భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ భాగవత పురాణం



వచనం : డా॥ జయంతి చక్రవర్తి

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ భాగవత పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ భాగవత పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. **60 /-** |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రుజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

**వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్**



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...



# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

## ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ ఆ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా పినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం ।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**

**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**

**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**

**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**

**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**

**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**

**తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా ఉండవచ్చు.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠునికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదునికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదునికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్ద్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ భాగవత పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥

**అ**ష్టాదశ మహాపురాణాలలో అయిదవది శ్రీ భాగవత పురాణం. 'ఊరూ భాగవతం ప్రోక్తమ్' శ్రీ మహావిష్ణువుకి తొడల స్థానంగా వర్ణించబడింది ఈ పురాణం. ఇందులో మొత్తం 12 స్కందాలు, 18 వేల శ్లోకాలు వున్నాయి.

**మొదటి స్కంధంలో :–** భగద్భక్తి మహత్యం, భీష్మనిర్యాణం, పరీక్షిత్తు జననం, అర్జునుడి విషాదం తదితర విషయాలు చెప్పబడ్డాయి.

**రెండవ స్కంధంలో :–** ముక్తిమార్గం, విశ్వసృష్టి, భగవంతుడి అవతారాలు, భాగవత పురాణ లక్షణం, విరాట్ పురుషుడి వర్ణన తదితర విషయాలు చెప్పబడ్డాయి.

**మూడవ స్కంధంలో :–** విదురుడి వైరాగ్యం, భాగవత రహస్యం, బ్రహ్మ సృష్టి, స్వాయంభువ మనువు, కపిలబోధ తదితర విషయాలు వివరించబడ్డాయి.

**నాలుగో స్కంధంలో :–** దక్షుడు చేసిన యాగం, ధ్రువుడి చరిత్ర, పృధుమహారాజు చరిత్ర, పురంజనోపాఖ్యానం వంటి విషయాలు.

**ఐదో స్కంధంలో :–** ప్రియవ్రతుడి చరిత్ర, అగ్నీధ్రుడి చరిత్ర, భరత–జడభరతుల వృత్తాంతం, సూర్యుడు, అంతరిక్షం, వివిధ రకాల నరకాలు తదితర విషయాలు వర్ణించబడ్డాయి.

**ఆరో స్కంధంలో :–** అజామిళోపాఖ్యానం, దధీచి వృత్తాంతం, వృత్రాసురవధ, చిత్రకేతు చరిత్ర వంటి విషయాలు చెప్పబడ్డాయి.

**ఏడో స్కంధంలో :–** జయవిజయులు, ప్రహ్లాదచరిత్ర, త్రిపురాసుర సంహారం, అజగరో పాఖ్యానం వంటి విశేషాలున్నాయి.

**ఎనిమిదో స్కంధం :–** మనువులు, గజేంద్రమోక్షం, కూర్మావతారం, మోహినీ అవతారం, వామనావతారం, మత్స్యావతారం వంటి విషయాలు చెప్పబడ్డాయి.

**తొమ్మిదో స్కంధం :–** వైవస్వత మనువంశం, ఇక్ష్వాకు వంశం, రాముడి చరిత్ర, చంద్రవంశరాజుల చరిత్ర, యదువంశ విశేషాలు వర్ణించబడ్డాయి.

**పదో స్కంధం :–** దేవకీవసుదేవులు, శ్రీకృష్ణావతారం, శ్రీకృష్ణలీలలు, శిశుపాల వధ, శ్రీకృష్ణుడి సంతానం తదితర విశేషాలు సవివరంగా వర్ణించబడ్డాయి.

**పదకొండో స్కంధం :–** సాధువుల లక్షణాలు, ఉద్ధవగీత భక్తి, ధ్యానం, సిద్ధులు, వర్ణాశ్రమ ధర్మాలు, భిక్షుగీత, సాంఖ్యయోగం, అంతిమ సందేశం, శ్రీకృష్ణ నిర్యాణం తదితర విషయాలు చెప్పబడ్డాయి.

**పన్నెండో స్కంధం :–** కలియుగ ప్రభావం, ప్రళయాలు, పరీక్షిత్తుకి విముక్తి, వేదాలు, పురాణాలు, మార్కండేయముని, సౌరవ్యూహం వంటి విశేషాలు ప్రధానంగా చెప్పబడ్డాయి.

శ్రీ భాగవత పురాణంలోని 12 స్కంధాలలో చెప్పబడ్డ ప్రధాన అంశాలని ఈ గ్రంథంలో మీకు పరిచయం చేస్తాం.

## చతుఃశ్లోకీ భాగవతం

**పూ**ర్వం శ్రీ మహావిష్ణువు స్వయంగా బ్రహ్మదేవుడికి పూర్తి భాగవత రహస్యాన్ని, తత్త్వాన్ని కేవలం నాలుగు శ్లోకాలలో ఇలా చెప్పాడు.

**1. అహమేవాసమేవాఽగ్రే నాన్యద్యత్ సదసత్పరం ।**
**పశ్చాదహం యదేతచ్చ యోఽవశిష్యేతసోఽస్మ్యహం ॥**

ఈ సృష్టికి ముందు నేనే వున్నాను. తరువాతా నేనే వున్నాను. ఈ చరాచర ప్రపంచాన్ని సృష్టించి, వ్యక్తపరిచిందీ నేనే, ఈ సృష్టి లయమైపోయాక మిగిలివుండేదీ నేనే.

**2. ఋతేఽర్థం యత్ ప్రతీయేత న ప్రతీయేతచాత్మని ।**
**తద్విద్యాద్ ఆత్మనో మాయాం యథాభాసోఽయథాతమః ॥**

ఈ సృష్టి అంతా నా నుంచే ఆవిర్భవించిందని చూసేది నా మాయాశక్తే. ఆ మాయాశక్తి ప్రభావంతోనే లేనిది ఉన్నట్టుగా, ఉన్నది లేనట్టుగా కనిపిస్తుంది.

**3. యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను ।**
**ప్రవిష్టాన్య ప్రవిష్టాని తథాతేషు న తేష్వహం ॥**

ఈ చరాచర సృష్టిలో వున్న అన్ని వస్తువులలో పంచభూతాలు ప్రవేశించి వున్నప్పటికీ అవి కనిపించవు. అదేవిధంగా నేను కూడా సకల భూతాలలో ఆత్మగా ప్రవేశించి సర్వత్రా నిండి వున్నప్పటికీ కనిపించను.

**4. ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసు నాత్మనః ।**
**అన్వయ వ్యతిరేకాభ్యాం యత్ స్యాత్ సర్వత్ర సర్వదా ॥**

పరమసత్య స్వరూపమైన నా ఆత్మతత్త్వం అనాదిగా సర్వత్రా వ్యాపించి వుంది. ఇదంతా పరబ్రహ్మ స్వరూపమే అన్న సత్యాన్ని బాగా విచారించి తెలుసుకుని అనుభూతి చెందాలి. ఆత్మతత్త్వాన్ని అన్వయ వ్యతిరేక పద్ధతుల ద్వారా ఆత్మ అని గ్రహించాలి.

మహావిష్ణువు ద్వారా తెలుసుకున్న ఈ నాలుగు శ్లోకాల భాగవత రహస్యాన్ని బ్రహ్మదేవుడు నారదుడికి చెప్పాడు. నారదుడు దాన్ని వ్యాసమహర్షికి చెప్పగా, వ్యాసుడు శుకుడికి బోధించాడు. శుకుడు తాను విన్నదాన్ని శాపగ్రస్తుడైన పరీక్షిన్మహారాజుకు ఏడురోజుల్లో బోధించి ఆయనకు ముక్తిని చేకూర్చాడు. తరువాత ఆదిశేషుడు భాగవతాన్ని పాతాళలోకంలో వ్యాప్తిచేయగా, బృహస్పతి స్వర్గలోకంలో, పరాశరుడు భూలోకంలో, సనక సనందనాది మహర్షులు స్వర్గానికి అతీతమైన లోకాల్లో ప్రచారం చేసారు.

## భాగవత పురాణ లక్షణాలు

**భా**గవతపురాణం పది లక్షణాలని అనుసరిస్తూ రచించబడింది.

**1. సర్గ :** భగవంతుడి చూపుతో త్రిగుణాలు ఒక్కసారిగా చెదిరిపోయి పది ఇంద్రియాలుగా, ఐదు తన్మాత్రలుగా, మనసు అహంకారంతో కూడిన మహత్తత్త్వం పంచభూతాలు ఆవిర్భవించాయి.

**2. విసర్గ :** చతుర్ముఖ బ్రహ్మదేవుడు చరాచర సృష్టిరచన చేయటం.

**3. స్థానం :** తాను సృష్టించిన వాటిని, వాటివాటి పరిధుల్లో నిలిపి వుంచటం, దుష్టుల్ని శిక్షించి, వారిని జయించటం వంటి విషయాల్లో భగవంతుడు కృతకృత్యుడు కావటం.

**4. పోషణం :** భక్తుల్ని రక్షించి, వారిని అనుగ్రహించటం.

**5. ఊతులు :** జీవరాసుల్లో దాగివున్న కర్మవాసనలు.

**6. మన్వంతరాలు :** మనువులు తాము పాలించే మన్వంతరాలలో చేసిన గొప్పపనులు, గాథలు.

**7. ఈశానుడి కథలు :** వివిధ అవతారాలలో శ్రీహరి గురించి చెప్పిన కథలు, గాథలు.

**8. విరోధం :** ఆవాంతర ప్రళయంలో జీవాత్మలు వాసనలతో వుంటూ, ఎలాంటి చేతనాస్థితి లేని అవస్థను గురించి చెప్పటం.

**9. ముక్తి :** జీవుడు కర్మబంధాల్ని తొలగించుకుని, భక్తిమార్గం ద్వారా బ్రహ్మపథాన్ని (వైకుంఠాన్ని) పొందటం వంటి విషయాలు.

**10. ఆశ్రయం :** సృష్టి, స్థితి, లయాలు ఏ పరమాత్మ నుంచి జరుగుతున్నాయో ఆ పరమాత్మ స్థానం.

## భాగవత మాహాత్మ్యం

**శ్రీ**కృష్ణ భగవానుడు తన అవతారాన్ని పరిసమాప్తి చేయాలనుకున్నాడు. వెంటనే తన ప్రియమిత్రుడైన ఉద్ధవుణ్ణి పిలిచి ఆ విషయాన్ని తెలియచేసాడు.

అది విని ఉద్ధవుడు ఎంతో విలపిస్తూ "ప్రభూ! శ్రీకృష్ణా! నీవులేని ఈ లోకం శూన్యమైపోతుంది. కలి కూడా ప్రవేశిస్తోంది. ఈ కలియుగంలో మానవులందరూ ఎన్నో బాధలుపడతారు. వారందరికీ తగిన తరుణోపాయాన్ని చెప్పండి స్వామీ! అని వేడుకున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తనలో వున్న దివ్యతేజస్సుని, దివ్యశక్తుల్ని భాగవతపురాణంలోకి ప్రవేశింప చేసాడు. ఉద్ధవుడితో – ఉద్ధవా! నేను సదా ఈ భాగవతంలోనే నివసిస్తుంటాను. దీన్ని పూజిస్తే, పఠిస్తే నన్ను సేవించినట్టే అని ప్రబోధించాడు. కనుక శ్రీకృష్ణుడి దివ్యస్వరూపమే శ్రీ భాగవత మహాపురాణమని భావించాలి.

శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు శ్రీ భాగవతాన్ని వినిపించబోతున్నాడని తెలుసుకుని దేవతలంతా ఒక కలశంలో అమృతాన్ని తీసుకుని శుకమహర్షి దగ్గరకు వెళ్ళారు. ఆయనతో స్వామీ ఈ అమృతాన్ని పరీక్షిత్తుకిచ్చి భాగవతాన్ని తమకు ఇవ్వమని కోరగా, దేవతల కుత్సిత బుద్ధి తెలిసిన శుకమహర్షి అందుకు అంగీకరించలేదు.

శ్రీ భాగవతాన్ని శుకమహర్షి ద్వారా విని పరీక్షిన్మహారాజు మోక్షం పొందాడన్న విషయం బ్రహ్మదేవుడికి తెలిసింది. వెంటనే ఆయన వేదశాస్త్రాలన్నీ ఒకవైపు, శ్రీ భాగవతాన్ని మరోవైపు త్రాసులో వేసి తూయగా శ్రీ భాగవతమే బరువు తూగిందట.

## భాగవత సప్తాహం

**భా**గవత పురాణాన్ని ఏడురోజుల్లో ప్రవచనం చేయటం అనే సంప్రదాయాన్ని మొదట శుకమహర్షి ప్రారంభించాడు. ఇది శ్రీకృష్ణుడు నిర్యాణం చెందిన తరువాత ముప్పై సంవత్సరాలకు, కలియుగం ప్రవేశించిన తరువాత, భాద్రపద శుద్ధ నవమి నుంచి పౌర్ణమి వరకు జరిగింది.

తరువాత కాలంలో గోకర్ణుడనేవాడు, తరువాత గంగాతీరంలోని ఆనందవనంలో నారదమహర్షి భాగవత సప్తాహాల్ని నిర్వహించారు. అలా ఆనాటి నుంచి నేటివరకూ ఎందరో భాగవత సప్తాహాలు నిర్వహించి కృతార్థులు, చరితార్థులు అవుతున్నారు.

# భగవంతుడి అవతారగాథ

**పూ**ర్వం నైమిశారణ్యంలో శౌనకాది మునులందరూ కలిసి దీర్ఘసత్ర యాగాన్ని చేస్తున్నారు. ఆ సమయంలో వేదవ్యాసుడి శిష్యుడు రోమహర్షణుడి కుమారుడైన సూతమహర్షి అక్కడికి వచ్చాడు. అందరూ ఆయన్ని ఘనంగా స్వాగతించి సత్కారాలు చేసి ఇలా వేడుకున్నారు.

"స్వామీ! సూతమహర్షీ! నీ తండ్రి ద్వారా వ్యాసమహర్షి రచించిన అన్ని పురాణాలనూ నీవు శ్రద్ధగా అవగతం చేసుకున్నావు. ఈ కలియుగంలో మానవులందరూ అల్పాయుష్కులు, భోగలాలసులు, రోగపీడితులు కనుక వారంతా వేదాధ్యయనం చేసి, వేదధర్మాన్ని తెలుసుకోలేరు. అలాంటి వారందర్నీ తరింపచేయటానికి ఏకైక మార్గం శ్రీకృష్ణుడి దివ్యగాథల్ని వినటమే. కనుక పుణ్యశ్లోకుడైన ఆ కృష్ణ పరమాత్మ పుణ్యగాథల్ని మాకు వినిపించి మా జీవితాలను చరితార్థం చేయమని కోరుతున్నాం" అని ప్రార్థించారు.

సూతముని ముందుగా శుకుడికి, నరనారాయణులకు, శ్రీకృష్ణుడికి, సరస్వతీదేవికి, వ్యాసమహర్షికి, బ్రహ్మదేవుడికి నమస్కరించి చెప్పటం ప్రారంభించాడు – శౌనకాదిమునులారా! శ్రీకృష్ణుడి అవతారగాథని వినాలన్న మీ కోరిక శ్రేయోదాయకం. అది మీ అందరి కర్తవ్యం కూడా. శ్రీకృష్ణుడి మీద అనన్యభక్తి కలిగి వుంటే చాలు అది జ్ఞానవైరాగ్యాల్ని ప్రసాదిస్తుంది. మానవులు నిరంతరం కృష్ణలీలల్ని వింటూ, ఆయన్నే ఆరాధిస్తూ, కీర్తిస్తూ, స్మరిస్తూ వుంటే వారు సంసార బంధాల నుంచి విముక్తి పొందుతారు. అందరి హృదయాలలో నివసించే కృష్ణపరమాత్మ తన భక్తులు గానం చేసే కీర్తనల్ని విని ఆనంద తన్మయుడౌతాడు. కనుక ఆయనమీద భక్తిని పెంపొందించుకుంటే జీవుడికి కామక్రోధాలు తగ్గిపోయి అతడి బుద్ధి పరిశుద్ధంగా మారిపోతుంది.

పరబ్రహ్మ స్వరూపుడైన కృష్ణపరమాత్మ గడ్డిపరక నుంచి బ్రహ్మదేవుడి వరకూ సకల జీవరాసుల్నీ తానే సృష్టించాడు. ఆయన సృష్టిలో ప్రధానంగా దేవతలు, మానవులు, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు), స్థావరాలు (కదలని

పర్వతాలు) అని నాలుగురకాల జీవరాసులున్నాయి. ఈ జీవుల్లో స్త్రీలు, పురుషులు అనే లింగభేదం, సత్త్వరజస్తమో గుణాలనే స్వభావ భేదాలు ఏర్పడ్డాయి. ఆ పరమాత్మ మానవుల జీవితాన్ని క్రమబద్ధం చేసే లక్ష్యంతో బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్యాసం అనే నాలుగు వర్ణాశ్రమ ధర్మాల్ని ఏర్పరిచాడు. అలాగే మానవుల్ని బ్రహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అని నాలుగు వర్ణాలుగా వారు చేసే పనుల్ని అనుసరించి ఏర్పాటు చేసాడు. ఈ మానవులంతా ధర్మబద్ధమైన జీవితం గడపటం కోసం ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలని నిర్దేశించాడు. ఈ పురుషార్థాలు సాధించటానికి కావలసిన విజ్ఞానాన్ని తెలుసుకోవటం కోసం బ్రహ్మదేవుడి ద్వారా నాలుగువేదాల్ని సృష్టించాడు. అయితే ఈ వేదవిజ్ఞానం అందరికీ సులభంగా అర్థంకాదని భావించి తానే బాదరాయణుడిగా (వ్యాసుడు) అవతరించి వేదవాఙ్మయాన్ని నాలుగుగా విభజించాడు. అందులో కర్మకాండకి సంబంధించిన పూర్వభాగానికి జైమినిమహర్షి చేత వ్యాఖ్యానం రాయించి, జ్ఞానభాగానికి (ఉత్తరభాగానికి) తానే బ్రహ్మసూత్ర భాష్యం రచించాడు. అదేవిధంగా పూర్వభాగానికి వివరణగా మహాభారతాన్ని, ఉత్తరభాగానికి వివరణగా మహాభాగవతాన్ని రచించి వేదసారమంతా ఈ రెండింటిలో పొందుపరిచాడు.

భగవంతుడంటే జ్ఞానం, వీర్యం, శక్తి, ఐశ్వర్యం, తేజస్సు వంటి ఉత్తమ లక్షణాల్ని కలిగి వుంటూ, ఎటువంటి అవలక్షణాలూ లేనివాడని అర్థం. అంతేకాదు సమస్త కళ్యాణ గుణాలు కలిగినవాడు, ఎలాంటి దోషాలు అంటనివాడు కూడా భగవంతుడే.

ఈ భగవంతుడు తనకి సృష్టి చేయాలి అన్న సంకల్పం కలిగితే రజోగుణ ప్రధానుడైన బ్రహ్మ శరీరంలోకి ప్రవేశించి జగత్తుని సృష్టిస్తాడు. అలాగే లయం చేయాలని భావిస్తే తమోగుణ ప్రధానుడైన పరమేశ్వరుడిలో చేరి సృష్టిని లయం చేస్తాడు. ఇక తన సృష్టిని పోషించాలన్న భావన ఆయనకి కలిగితే సత్త్వగుణ ప్రధానుడైన విష్ణువులో ప్రవేశించి ప్రపంచాన్ని పోషిస్తాడు. ఇలా

ఈ సకలజగత్తుకీ కారకుడైన శ్రీ మహావిష్ణువుని భజిస్తే జ్ఞానం కలుగుతుంది. ముక్తి లభిస్తుంది.

వాసుదేవుడి ఆరాధన ఎంతో ప్రాచీనమైనది. వేదాల్లో మొదట చెప్పింది వాసుదేవుడి ఉపాసనే. ఈ వాసుదేవుడే సకల సృష్టికి ముందున్న పరమాత్మ, ఆదిదేవుడు. ఆయనే సకల జీవరాసుల ఇంద్రియాలతో, మనస్సులతో, పంచభూతాలతో కలిసి విరాట్పురుషుడుగా అవతరించాడు. ఆ మహాపురుషుడు అపార జలరాశిలో యోగనిద్రలో వుండగా ఆయన నాభినుంచి పుట్టిన కమలంలో బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. తరువాత ఆయన దేహం నుంచి ఎన్నో దేవ మానవరూపాలు ఆవిర్భవించాయి. ఆ మహాపురుషుడే కాలక్రమంలో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, కృష్ణ, పరశురామ, నారద, నరనారాయణ, కపిల, ఋషభ, దత్తాత్రేయ తదితర అవతారాల్ని ధరించి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసాడు. అలాగే మంత్రద్రష్టలైన ఎందరో ఋషులు, మునులు కూడా ఆయన నుంచి పుట్టినవారే.

పరమాత్మ ధరించిన అన్ని అవతారాలలో శ్రీకృష్ణావతారం పరిపూర్ణమైనది. ఈ అవతారంలో పరమాత్మ లక్షణాలుగా చెప్పబడ్డ జ్ఞానం, బలం, ఐశ్వర్యం, ప్రకాశం, వీర్యం వంటి కళ్యాణ గుణాలన్నీ ప్రకటించబడ్డాయి. అందుకే “కృష్ణస్తు భగవాన్ స్వయం” అంటారు.

శౌకనాదిమునులారా! ఈ స్థూలమైన జగత్తే కాకుండా, మనోబుద్ధి అహంకారాలతో కూడిన సూక్ష్మజగత్తును కూడా ఆ పరమాత్మే సృష్టించాడు. ఆ పరమాత్మ లీలావిలాసాలు మాయతో కూడుకున్నవి. అవి అందరికీ సులభంగా అర్థంకావు, కేవలం ఆయన పాదపద్మాల మీద భక్తి కలిగినవారికి మాత్రమే అవి అవగతం అవుతాయి. సకల వేదాల సారాన్నీ వ్యాసభగవానుడు శ్రీ భాగవత పురాణంలో పొందుపరిచి తన కుమారుడు శుకమహర్షికి బోధించాడు. ఆయన దాన్ని పరీక్షిన్మహారాజుకు వినిపించే సమయంలో నేను కూడా అక్కడకు చేరి మొత్తం శ్రవణం చేసాను. నా శక్తివంచన లేకుండా నేను విన్నదంతా మీకు వివరిస్తాను” అని సూతుడు మహర్షులందరికీ చెప్పాడు.

## వ్యాసమహర్షి

ఉపరిచరమనువు కుమార్తె సత్యవతి. ఆమె పరాశర మహర్షిని వివాహం చేసుకుంది. వారిద్దరికీ నారాయణుడి అంశతో వ్యాసమహర్షి జన్మించాడు. ఈయన్నే బాదరాయణుడు, కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. ఆయన వేదాలన్నిటినీ నాలుగుగా విభజించి వేదవ్యాసుడుగా ప్రసిద్ధి చెందాడు. సాక్షాత్తు నారాయణ స్వరూపుడుగా, మహాజ్ఞానిగా కీర్తి పొందిన వ్యాసుడు ఒకనాడు సరస్వతీ నదీతీరంలో ధ్యానం చేస్తుండగా ఆ ధ్యానంలో కలిప్రవేశించటం, ఆ ప్రభావంతో మానవులంతా అల్పాయుష్కులుగా, దుర్బలులుగా వుండటం, వారంతా అధర్మకార్యాలు ఆచరించటం వంటి దృశ్యాల్ని చూసాడు. వారందరినీ తరింపచేయాలని తాను నాలుగుగా విభజించిన వేదాలలో ఋగ్వేదాన్ని పైలుడనే శిష్యుడికి, యజుర్వేదాన్ని వైశంపాయనుడికి, సామవేదాన్ని జైమిని మహర్షికి, అధర్వణవేదాన్ని సుమంతుడికి బోధించి వాటిని గురుశిష్య పరంపరగా లోకంలో వ్యాప్తి చేయమని ఆదేశించాడు. తరువాత అష్టాదశ పురాణాలని రచించి వాటిని రోమహర్షణుడికి అప్పగించాడు. వేదసారాన్ని రంగరించి మహాభారత ఇతిహాసాన్ని పండిత పామరులందరికీ అర్థమయ్యేలా వ్రాసాడు. ఇలా ఎన్ని రచించినప్పటికీ వ్యాసమహర్షికి ఏదో తెలియని అసంతృప్తి కలుగుతోంది. అది రోజురోజుకీ పెరిగిపోతోంది. కారణం ఏమిటో? ఆయనకి ఎంత ఆలోచించినా తెలియటంలేదు. అదే సమయంలో ఒకనాడు నారదమహర్షి ఆయన్ని దర్శించటానికి వచ్చాడు. వ్యాసులవారు ఎంతో ఆనందంగా నారదుణ్ణి ఆహ్వానించి అతిథి సత్కారాలు చేసాడు.

## భాగవతరచనకు ప్రేరణ

వ్యాసుడు నారదమహర్షిని సావధానంగా కూర్చోబెట్టి ఆయనతో “నారదమహర్షీ, ఎందుకో నేను ఎన్ని రచనలు చేసినా నా మనసు సంతృప్తి చెందటం లేదు. ఏదో మిగిలిపోయింది. అది ఏదో తెలియటంలేదు. ఇలా

నా మనసు రోజూ వేదన చెందుతోంది. దీనికి కారణమేమిటో చెప్పండని" ప్రార్థించాడు.

వ్యాసమహర్షీ! నీవిప్పటిదాకా ఎన్నో మహత్తరమైన గ్రంథాలు రచించావు. వేదాల్ని విభజించావు. అనన్యసామాన్యమైన మహాభారత ఇతిహాసాన్ని కూడా సృష్టించావు. నీ రచనా చాతుర్యం అమోఘం. అయితే మహాభారతంలోగానీ, ఇతర పురాణాలలో గానీ భగవంతుడి గుణగణాలు గురించి కేవలం పేర్కొన్నావే గానీ, వాటిని సంపూర్ణంగా ఎక్కడా వర్ణించలేదు. భగవంతుడి గుణగణాల్ని, కథల్ని గాథల్ని కీర్తిస్తుంటే ఆయనెంతో సంతోషిస్తాడు. అవి కీర్తించేవారి మనసుని కూడా ఎంతో సంతోషపరుస్తాయి. భగవంతుడి మీద భక్తి కలిగించని గ్రంథాలు నిష్ప్రయోజనాలు. అవి చతుర్విధ పురుషార్థాలను మానవులకు అందించలేవు. భగవంతుడి దివ్యలీలల్ని వర్ణించే గ్రంథంలో చిన్నచిన్న దోషాలున్నప్పటికీ భక్తులు వాటిని ఎంతో ఆరాధిస్తారు. భగవంతుడి లీలల్ని తెలుపని గ్రంథం ఎంతో గొప్పదైనా దాన్ని భాగవతులు ఆదరించరు.

బాదరాయణా! నీవెంతో గొప్పవాడివి, నారాయణాంశ సంభూతుడివి. సత్త్వగుణ సంపన్నులకి భగవద్దర్శనం చేయించగల సమర్థుడివి. నీవు గనుక భగవంతుడి లీలావిలాసలను వర్ణిస్తూ భక్తిరస ప్రధానమైన గ్రంథాన్ని రచిస్తే నీ మనసులోని బాధ తొలగిపోతుంది. మనశ్శాంతి కలుగుతుంది. నీవు మాత్రమే ఈ బృహత్తర గ్రంథాన్ని రచించగలవు. నీవు రచించిన గ్రంథాన్ని విన్నా, చదివినా ఆ మానవులు మోక్షాన్ని పొందుతారు. భగవంతుడి కథల్ని విన్నంత మాత్రాన ఎలాంటి సద్గతులు కలుగుతాయో నా చరిత్రే ఉదాహరణ.

## నారదమహర్షి పూర్వజన్మ

**బా**దరాయణా! పూర్వజన్మలో నేను ఒక దాసీ కుమారుణ్ణి. నా తల్లి బ్రాహ్మణుల ఇళ్ళలో పనిచేసేది. నా చిన్నప్పుడు నాతల్లి పనిచేస్తున్న ఇంటికి చాతుర్మాస్యవ్రతం ఆచరించటానికి కొందరు సన్యాసులు వచ్చారు. వారందరికీ

సేవలు చేయమని నా ఇంటి యజమాని నన్ను నియమించాడు. నేనెంతో భక్తిశ్రద్ధలతో వారికి శుశ్రూష చేస్తున్నాను. ప్రతిరోజు వారు శ్రీకృష్ణుడి లీలల్ని గాథల్ని కీర్తిస్తూ సద్గోష్ఠి చేసేవారు. నా సేవలకు మెచ్చుకుని వారు చేస్తున్న కీర్తనల్ని వినటానికి నన్ను అనుమతించారు. అలా రోజూ వారుచేసే కీర్తనల్ని వినటం వల్ల నాకు శ్రీకృష్ణుడి మీద అచంచలమైన భక్తిప్రపత్తులు ఏర్పడ్డాయి. ఆ మహాపురుషులు చాతుర్మాస్యం ముగించుకుని వెళ్తూ నామీద ప్రేమతో రహస్యమైన వైష్ణవతత్త్వాన్ని ఉపదేశించి వెళ్ళారు. దానివల్ల ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆదిభౌతిక దుఃఖాలు కలగకుండా వుండాలంటే మనంచేసే అన్నిపనుల్నీ భగవంతుడికి సమర్పణంగా, ఆయన ప్రీతి కోసమే చేయాలని తెలుసుకున్నాను. స్వధర్మాన్ని ఆచరిస్తూ నిరంతరం భగవన్నామ సంకీర్తన చేస్తుంటే భక్తి ఉదయించి అభివృద్ధి చెందుతుంది.

'ఓం నమో భగవతే వాసుదేవాయ' అనే నామాన్ని నిరంతరం ధ్యానిస్తూ వుంటే భగవత్సాక్షాత్కారం లభిస్తుంది. నేను ఆవిధంగానే చేసి నారాయణుడి దర్శనాన్ని పొందాను. నేనలా బ్రాహ్మణుడి ఇంట్లో పనిచేస్తూ కాలం గడుపుతున్నాను. ఒకనాడు నాతల్లి పాముకాటుతో మరణించింది. అప్పుడు నేను ఉన్న ఒక్క బంధం వదిలిపోవటంతో ఇల్లు విడిచి అరణ్యాలకి వెళ్ళిపోయాను. అప్పుడు నాకు అయిదుసంవత్సరాలు. అలా వెళ్ళిన నేను అడవిలో ఒక చెట్టుకింద అలసిపోయి కూర్చున్నాను. పూర్వం నాకు మహాపురుషులు చేసిన జ్ఞానబోధను గుర్తుకుతెచ్చుకుని నా హృదయంలో పరమాత్మ దివ్యస్వరూపాన్ని భావించుకుంటూ, ఆయన దర్శనం కోసం తపించాను.

అలా కొంతసమయం గడిచింది. హఠాత్తుగా నాకు శ్రీమన్నారాయణుడి దివ్యదర్శనం లభించింది. నేను ఎంతో పరవశించి పోయాను. నా శరీరం గగుర్పొడిచింది. ఆ దివ్యమంగళాకారాన్ని మళ్ళీమళ్ళీ చూడాలని నా మనసు ఉవ్విళ్ళూరింది. అలాగే ఆ రూపాన్నే ధ్యానిస్తూ ఎంతకాలం గడిపానో నాకే

తెలీదు. అంతలో ఒక మధురస్వరం నాకు వినిపించింది. "నాయనా! నీవు సత్పురుషులకు శ్రద్ధగా సేవచేసిన ఫలితంగా నీకు నామీద భక్తిశ్రద్ధలు ఏర్పడ్డాయి. నీకున్న భక్తి మరింతగా స్థిరపడాలని నేను నీకు దర్శనమిచ్చాను. తరువాత జన్మలో కూడా నీవు నా భక్తుడివే అవుతావు. రాబోయే కల్పంలో తిరిగి నీవు జన్మించి నాకు సేవచేస్తావు" అన్న మాటలు నాకు వినిపించాయి. అలా కొంతకాలం గడిచాక నా శరీరం పతనమయ్యింది. ఆ దివ్యవాక్కు చెప్పిన విధంగానే నా జీవాత్మ బ్రహ్మదేవుడిలో ప్రవేశించింది. వెయ్యి యుగాల తరువాత నూతనకల్పం ప్రారంభంలో మరీచి వసిష్ఠ మహర్షులతో పాటు నేను కూడా ఆవిర్భవించాను. బ్రహ్మ మానసపుత్రుడనైన నేను నాటినుంచీ హరిసంకీర్తన చేస్తూ బ్రహ్మచర్య దీక్షతో అన్ని లోకాలూ సంచరిస్తున్నాను.

## వ్యాసుడు భాగవతరచన చేయుట

**ఓ** వ్యాసమునీంద్రా! నేనలా భక్తిశ్రద్ధలతోనే శ్రీమన్నారాయణుడి దివ్యమంగళ రూపాన్ని దర్శించగలిగాను. ఆయన అనుగ్రహంతో ఆయన దివ్యనామాన్ని గానం చేస్తూ లోకాలన్నీ సంచరించగలుగుతున్నాను. భగవన్నామ మహిమకు ఇంతకన్నా గొప్ప నిదర్శనం ఏముంటుంది. నేను నారాయణ నారాయణ అని హరినామస్మరణ చేస్తుంటే సాక్షాత్తు శ్రీహరే నాముందు ప్రత్యక్షమైనంత ఆనందం అనుభూతి నాకు కలుగుతాయి. నీవు వేదాల్లో కర్మకాండనీ, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాల్లో జ్ఞానమార్గాన్ని, మహాభారతంలో కర్మమార్గాన్ని దానితో పాటు మానవధర్మాల్నీ ప్రబోధించావు. ఇప్పుడు భక్తిమార్గం ప్రధానంగా భగవంతుడి లీలావిలాసాలను ఒక గ్రంథంగా రచించు. అప్పుడే నీకు మనశ్శాంతి లభిస్తుంది" అని చెప్పి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు నారదమహర్షి.

నారదమహర్షి బోధ విన్నాక వ్యాసులవారికి జ్ఞానోదయమైంది. ఇన్నాళ్ళూ తాను పడుతున్న అశాంతికి కారణం తెలిసింది. సరస్వతీ నదీతీరంలో వున్న తన శమ్యాప్రాసం అనే ఆశ్రమంలో కూర్చుని దీక్షగా పరమాత్మను

ధ్యానించాడు. ఆయనతోపాటే యోగమాయ కూడా వ్యాసుడికి దర్శనమిచ్చింది. ఆ మాయను జయించటానికి, భగవంతుడి దివ్యానుగ్రహాన్ని పొందటానికి భక్తి ఒక్కటే తగినమార్గం అని ఆయన గుర్తించాడు. వెంటనే శ్రీభాగవత మహాపురాణ రచనకు శ్రీకారం చుట్టాడు.

వ్యాసమహర్షి రచించిన ఈ భాగవతగాథని విన్నవారికి శ్రీకృష్ణపరమాత్మ మీద అచంచలమైన భక్తివిశ్వాసాలు కలుగుతాయి. వారికి శ్రీకృష్ణానుగ్రహంతో మోక్షం లభిస్తుంది. కనుక అందరూ భాగవత రసామృతాన్ని గ్రోలి అమరులవ్వండి" అని సూతమహర్షి శౌనకాది మునులందరికీ బోధించాడు.

## పరీక్షిన్మహారాజు

**అ**భిమన్యుడికి ఉత్తరకి జన్మించినవాడు పరీక్షిత్తు. ఆయన అసలు పేరు విష్ణురాతుడు. మహాభాగవతుడుగా, ఉత్తమ గుణసంపన్నుడుగా, పరాక్రమశాలిగా పరీక్షిత్తు పేరుపొంది మహారాజుగా పట్టాభిషిక్తుడయ్యాడు. ఉత్తరుడి కుమార్తె ఐరావతిని పెళ్ళి చేసుకుని జనమేజయుడుతో సహా నలుగురు పుత్రుల్ని కన్నాడు. కృపాచార్యుడి ఆధ్వర్యంలో మూడు అశ్వమేధయాగాల్ని దిగ్విజయంగా చేసాడు. ఒకనాడు పరీక్షిత్తు దిగ్విజయయాత్రకి బయలుదేరాడు. ఎన్నో దేశాల్ని జయించాడు. ఆయాదేశాల్లో పండితులు, ప్రజలు తమ పూర్వీకుల గురించి, శ్రీకృష్ణపరమాత్మ చూపిన లీలావిశేషాల గురించి కథలుగా చెబుతుంటే విని ఆనందిస్తూ తన యాత్ర కొనసాగిస్తున్నాడు.

### వృషభగోమాత సంభాషణ

ఒకరోజు దారిలో ఒకేపాదంతో వృషభరూపంతో వున్న ధర్మదేవత, కన్నీరుకారుస్తూ కళావిహీనంగా గోమాతరూపంలో వున్న భూదేవి పరీక్షిత్తుకు కనిపించారు. వాటిలో వృషభరూపంలో వున్న ధర్మదేవత గోమాతతో అమ్మా! గోమాతా! భూమాతా! ఎందుకు తల్లీ విలపిస్తున్నావు. మూడుకాళ్ళూ లేని నన్ను ఎవరైనా బంధించి హింసిస్తారనా? మానవులు యజ్ఞయాగాలు చేయకుండా దేవతలకి ఆహారం అందించరనా! వ్యసనాల బారినపడి

పరమార్థాన్ని మర్చిపోతారనా! శ్రీకృష్ణుడు ఈ భూమిని వదిలి వెళ్ళిపోయాడనా! చెప్పు తల్లీ అని అడిగింది.

"ధర్మదేవతా! నీవు చెప్పింది నిజమే! నేనెందుకు బాధపడుతున్నానో నీకు తెలుసు. శ్రీకృష్ణపరమాత్మ సకల సద్గుణ సంపన్నుడు. సత్యం, దయ, క్షమ, త్యాగం, సంతోషం, వీర్యం, వెలుగు, ధైర్యం, గుణం, శీలం, బలం, గాంభీర్యం, నిరహంకారం లాంటి ఎన్నో గుణాలు ఆయన్ని ఆశ్రయించి వున్నాయి. అలాంటి పరమాత్మ నన్ను విడిచి వెళ్ళిపోవటం ఎంతో బాధాకరం. దీనికే కాదు. ఈ కలి ప్రభావంతో మానవులంతా పాపగ్రస్తులూ, రోగగ్రస్తులూ అవుతున్నారు. అందుకే నేను దుఃఖిస్తున్నాను. రాబోయే కాలంలో దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు, గోవులకు, సాధుజీవులకు కలిగే కష్టనష్టాలు గురించి ఆలోచిస్తూంటే నాకు బాధ కలుగుతోంది. శ్రీకృష్ణుడి పాదాలు నామీద వున్నంతవరకూ నేను ఆనందంగానే వున్నాను. ఆయనలేడు ఇకపై ఎలా వుంటుందో" అని చెప్పింది.

## కలిపురుషుడు

**ఈ** సంభాషణ మొత్తం అక్కడే వున్న పరీక్షిత్తు విన్నాడు. ఆయనకు ఆశ్చర్యం కలిగింది. అంతలో ఒక నీచమైన వ్యక్తి రాజువేషంతో అక్కడికి వచ్చి ఒంటికాలితో వున్న వృషభాన్ని ఒక్క తన్ను తన్ని నేలకూల్చాడు. తరువాత కన్నీరుకారుస్తూ విలపిస్తున్న గోమాతను కూడా నిర్దాక్షిణ్యంగా తన్నటం ప్రారంభించాడు. ఇది చూసి సహించలేక పరీక్షిత్తు అతన్ని అడ్డుకున్నాడు. "ఎవర్రా నీవు. ఇంత కఠినంగా ప్రవర్తిస్తున్నావు! ఏ అపకారం చేయని ఈ గో, వృషభాలని దండిస్తున్నావు. నిన్ను దండించే వారెవరూ లేరనా నీ ధైర్యం. ఇదిగో నిన్నిప్పుడే శిక్షిస్తాను. ఎక్కడికీ కదలకు అని గద్దించాడు. దానితో భయపడిపోయిన కలిపురుషుడు తన మాయావేషాన్ని వదిలి నిజరూపంలో ప్రత్యక్షమయ్యాడు. వెంటనే పరీక్షిత్తు పాదాల మీదపడి దీనంగా శరణువేడుకున్నాడు. పరీక్షిత్తు అతన్ని కనికరించి "ఓరీ! నీవు చాలా పాపాత్ముడిలా వున్నావు. అన్నీ నీచగుణాలే నీలో నాకు కనిపిస్తున్నాయి. అసత్యం,

లోభం, చౌర్యం, దౌర్జన్యం, దురాచారం, కపటం, కాలుష్యంలాంటి అవగుణాలన్నీ నిన్ను ఆశ్రయించి కనిపిస్తున్నాయి. నీవల్ల మా ప్రజలందరూ బాధలుపడతారు. అందుకని నీకు నా రాజ్యంలో చోటులేదు వేరే ఎక్కడికైనా కనిపించకుండా పో" అని హెచ్చరించాడు.

ఓ పరీక్షిన్మహారాజా! ఈ భూమండలమంతా నీ రాజ్యమే! నేనెక్కడికి పోను? తమరే చెప్పండి. మీరెక్కడ వుండమంటే అక్కడే వుంటానని వేడుకున్నాడు కలిపురుషుడు. అప్పుడు పరీక్షిత్తు కొంచెం ఆలోచించి, "కలిపురుషా! ప్రాణుల్ని చంపేచోట, స్త్రీని అనుభవించేచోట, జూదం, మద్యపానం జరిగే స్థలాలు, బంగారం కావాలనే కోరిక వున్న చోట నీవు నివసించవచ్చు. ఈ ఐదు ప్రదేశాలే నీకు నివాసం అని చెప్పి అతన్ని పంపేశాడు. తరువాత వృషభానికి లోపించిన తపస్సు, శౌచం, దయ అనే పాదాలూ పునరుద్ధరించి, భూమాతకి (గోమాతకి) ఆనందం కలిగించి సుభిక్షంగా పాలించాడు.

## పరీక్షిత్తుకి శాపం

**ప**రీక్షిన్మహారాజు దిగ్విజయం చేసి ఈ సమస్త భూమండలాన్నీ సుభిక్షంగా పాలిస్తున్నాడు. ఒకనాడు ఆయన వేటకు వెళ్ళాడు. అడవిలో వేటాడి వేటాడి ఎంతో అలసిపోయాడు. ఎంత వెతికినా ఆయనకు నీరు దొరకలేదు. దారిలో ఒక ఆశ్రమం కనిపిస్తే లోపలకు వెళ్ళాడు. అక్కడ శమీక మహర్షి ధ్యానంలో కూర్చొని కనిపించాడు. దాహం దాహం అని ఎంత గట్టిగా అరిచినా ఆయన కళ్ళు తెరవలేదు. దాంతో పరీక్షిత్తుకు కోపం పెరిగిపోయింది. విధి ప్రారబ్ధంతో యుక్తాయుక్తాలు మర్చిపోయి మూర్ఖుడై అక్కడే ఒకపొద దగ్గర చచ్చిపడున్న పాముని తెచ్చి శమీకుడి మెడలో వేసి తిరిగి వెళ్ళిపోయాడు. ధ్యానంలో వున్న శమీకుడు చలించలేదు.

కొంతసేపటికి శమీకుడి కుమారుడు శృంగి అక్కడికి వచ్చాడు. తండ్రి మెడలో చచ్చిన పాము కనిపించింది. దూరం నుంచి జరిగిన తతంగాన్నంతా గమనించిన బాలకులు విషయాన్నంతా శృంగికి చెప్పారు. వెంటనే శృంగికి

ఆగ్రహం కట్టలు తెంచుకుంది. నరాధముడైన రాజుకి ఇంత అహంకారమా! ఆశ్రమాల్లో అందరికీ దూరంగా తపస్సు చేసుకుంటున్న మునులంటే అంత చులకనా! ఏం నేరం చేసాడని నా తండ్రిని ఇంతగా అవమానించాడు. ఇందుకు తగిన శిక్ష అతడు అనుభవించాల్సిందే. "ఎవడైతే అకారణంగా చచ్చిన సర్పాన్ని నా తండ్రి మెడలోవేసి అవమానించాడో, ఆ రాజు నేటి నుంచి ఏడోరోజు తక్షకుడనే సర్పరాజు విషానికి ఆహుతైపోగాక" అని కఠినంగా శపించాడు.

నెమ్మదిగా శమీకముని ధ్యానం నుంచి కళ్ళు తెరిచాడు. జరిగిందంతా ఆయనకి అవగతమైంది. తనను అవమానించింది పరీక్షిత్తేనని గ్రహించాడు. తన కుమారుడు తొందరపాటుగా అతన్ని శపించినందుకు ఎంతో బాధపడ్డాడు. "నాయనా శృంగి ఎంత పనిచేసావయ్యా! చిన్నతప్పుకి మరణశిక్ష వేస్తావా. పరీక్షిత్తు తల్లిగర్భంలోనే చావవలసినవాడు అలాంటివాడిని సాక్షాత్తు శ్రీకృష్ణుడే బతికించాడు. ఆయన పరమ భాగవతోత్తముడు. ఎంతోమందికి దానధర్మాలు చేసినవాడు. ఏదో ప్రారబ్ధం వల్ల ఈ పనిచేసాడు. నీవు చాలా తప్పు చేసావు" అని మందలించాడు. వెంటనే ఒక మునిపుత్రుణ్ణి పిలిచి శృంగి ఇచ్చిన శాపం గురించి పరీక్షిత్తుకు తెలియచేయమని చెప్పి పంపాడు.

మునిపుత్రుడి ద్వారా శృంగి శాపం గురించి విన్న పరీక్షిత్తు ఎంతో బాధపడ్డాడు. శాపానికి కాదు తాను చేసిన పొరపాటుకి ఒక బ్రహ్మర్షిని అవమానించినందుకు తనకు తగిన శిక్ష భగవంతుడు విధించాడని తలచాడు. ఇక తనకు మరణం తప్పదని గ్రహించి సర్వసంగ పరిత్యాగం చేసి, గంగాతీరంలో నిరాహారుడై ప్రాయోప్రవేశ దీక్షతో కూర్చున్నాడు.

## శుకమహర్షి ఆగమనం

**ప**రీక్షిన్మహారాజు ప్రాయోప్రవేశం చేస్తున్నాడని తెలిసి రాజ్యంలోని ప్రజలంతా ఆయన్ను దర్శించటానికి వచ్చారు. ప్రజలేకాదు. అత్రి, విశ్వామిత్ర, వసిష్ఠ, వ్యాస, భారద్వాజ, పరశురామ, మైత్రేయ నారదాది దేవర్షులు, మహర్షులు, బ్రహ్మర్షులు శిష్యప్రశిష్యులతో సహా అక్కడికి వచ్చారు. వచ్చిన

వారందరికీ సాష్టాంగ దండప్రణామం చేసిన పరీక్షిత్తు వారితో “ఋషి, మునిపుంగవులారా! నేను సహనం కోల్పోయి ఒక బ్రహ్మర్షి మెడలో చచ్చిన పాముని వేసి ఘోరమైన పాపం చేసాను. ఈ పాపానికి తగిన పరిహారం చెప్పండి. శృంగి ఇచ్చిన శాపం నాకు సరైన శిక్షే. నేను ఆనందంగా నా ప్రాణాలు తక్షకుడికి సమర్పిస్తాను. నాదో చిన్న కోరిక రాబోయే జన్మలో కూడా శ్రీకృష్ణపరమాత్మ మీద నాకు అచంచలమైన భక్తి, ఆయన కథల్ని వినటం మీద ఆసక్తి కలిగేలా అనుగ్రహించండి. ఈ ఏడురోజుల్లో నేను మోక్షం పొందే మార్గమేదైనా చూపండి” ప్రార్థించాడు.

ఋషులందరూ పరీక్షిత్తు భక్తితత్పరతకు మెచ్చుకుని ఆశీర్వదించారు. ఏడురోజుల వరకూ తాము కూడా ఆయనతో పాటే వుంటామన్నారు. అంతలో పదహారేళ్ళ బాలుడు దిగంబరగా నడుస్తూ అక్కడికి వచ్చాడు. ఆ వచ్చిన బాలుణ్ణి తేరిపార చూసిన ఋషులు, మునులు, అతడు మహాయోగి, బ్రహ్మజ్ఞాని, వేదవ్యాసుడి కుమారుడైన శుకయోగి అని గుర్తించారు. వెంటనే అందరూ స్వాగతం పలికి ఆయనకు ఉచితాసనాన్ని సమర్పించారు. పరీక్షిత్తు శుకమహర్షిని సమీపించి జరిగిన వృత్తాంతమంతా చెప్పి ఏడురోజుల్లో ముక్తిని ప్రసాదించే దాన్ని బోధించమని కోరాడు.

## శుకమహర్షి అభయం

**ప**రీక్షిన్మహారాజా! శరీరాన్ని వదిలివేసే వ్యక్తి మోక్షం లభించాలంటే ఏం చేయాలి? అన్న మంచి ప్రశ్న వేశావు. సమాధానం విను. సామాన్య మానవులంతా తన ఇల్లు, తన ఇల్లాలు, సంతానం, ధనం, బంగారం, భూమి అంటూ మమకారాన్ని బంధాల్ని పెంచుకుని అసలైన ఆత్మతత్వాన్ని తెలుసుకోలేకపోతున్నారు. జీవితమంతా విషయవాంఛలతో మునిగిపోతున్నారు. తన చుట్టూ అందరూ మరణిస్తున్నా తనకు మాత్రం మరణం రాదని భ్రమిస్తున్నారు.

ముక్తిని పొందాలనుకునేవాడు నిత్యం సకలశుభ గుణ సమన్వితుడైన పరమాత్ముని గురించి ఆలోచించాలి. ఆయన్నే భజించాలి. శరణువేడాలి.

ఆయన లీలల్ని వినాలి. చివరిదాకా నారాయణుణ్ణి స్మరిస్తూనే వుండాలి. ఇదే ముక్తికి సులభమైన మార్గం.

నా తండ్రి వ్యాసమహర్షి నాకు భాగవతాన్ని బోధించాడు. ఆయన అవతార లీలల్ని ఎంతో ఆనందంగా శ్రద్ధగా అధ్యయనం చేసాను. భాగవత శ్రవణం వల్ల సంసారబంధాలు తొలగిపోతాయి. వాసుదేవుడి గుణగణాలు, నామసంకీర్తనలు యోగులు నిత్యం ఆచరించవలసినవి. పరమ భాగవతోత్తముడవైన నీకు భాగవత పురాణాన్ని ప్రవచనం చేస్తాను. ఈ పురాణాన్ని శ్రద్ధగా శ్రవణం చేసినవాడికి ముక్తి తప్పకుండా లభిస్తుంది. పరీక్షిన్మహారాజా శ్రీహరి నామాన్ని ఒక్క ఘడియ స్మరించినా చాలు అది మోక్షాన్ని ప్రసాదిస్తుంది. పూర్వం ఖట్వాంగుడనే మహారాజు దేవతల ద్వారా తనకు ఒక ఘడియకాలంలో మరణం సంభవిస్తుందని తెలుసుకుని, ఆ ఒక ఘడియలో సర్వం త్యజించి నారాయణ నామస్మరణ చేసి ముక్తి పొందాడు. నీకింకా ఏడురోజుల గడువుంది. నీవేం బాధపడకు అని శ్రీ భాగవత పురాణాన్ని వినిపించటం ప్రారంభించాడు.

## శ్రీ మహావిష్ణువు విరాట్ స్వరూపం

**శ్రీ** మహావిష్ణువు విరాట్ స్వరూపం ఎంతో గొప్పది. ఈ దివ్యస్వరూపంలో భూత భవిష్యత్ వర్తమానాలన్నీ కనిపిస్తాయి. భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం అనే పంచభూతాలు, అహంకారం, మహత్తత్త్వం అనే వాటితో కలిపి ఏడు ఆవరణలు విరాట్పురుషుడి శరీరంలో వుంటాయి.

విరాట్పురుషుడి పాదాల కిందవున్న ప్రదేశం పాతాళం. ఆయన కాలిమడమ రసాతలం. చీలమండలు మహాతలం. పిక్కలు తలాతలం. మోకాళ్ళు సుతలం. ఆయన తొడలు వితలం. ఆయన జఘనం మహీతలం. ఆయన నాభి ఆకాశం. వక్షస్థలం నక్షత్రలోకం. మెడ మహర్లోకం. ముఖం జనోలోకం. ఆయన లలాటం తపోలోకం. శిరస్సు సత్యలోకం. చేతులు ఇంద్రాదిదేవతలు. చెవులు దిక్కులు, శోత్రేంద్రియం శబ్దం. ఆయన ముక్కు రంధ్రాలు అశ్వినీ దేవతలు, గంధం ఆయన ఘ్రాణేంద్రియం. ఆయన నోరు అగ్ని. కళ్ళు అంతరిక్షం.

చక్షురింద్రియం సూర్యుడు. ఆయన కనురెప్పలు రాత్రి పగలు, భృకుటి బ్రహ్మనివాసం, ఆయన దవడలు జలం, జిహ్వేంద్రియ రసం, ఆయన మాటలు వేదాలు, నోటిలో వున్న కోరలు యముడు, దంతాలు స్నేహకళలు. మానవులకు మోహాన్ని కలిగించేవి ఆయన చిరునవ్వులు. ఆయన కటాక్ష వీక్షణాలే ఈ అనంతసృష్టి. సిగ్గు లోభం అనే రెండూ ఆయన రెండు పెదవులు. ధర్మం ఆయన ఱొమ్ము, వెన్ను అధర్మం, పురుషాంగం ప్రజాపతి, వృషణాలు మిత్రా వరుణులు. సముద్రం ఆయన ఉదరం. ఆయన ఎముకలు కొండలు, నాడులు నదులు, చెట్లు ఆయన రోమాలు, ఊపిరి వాయువు, అనంతకాలం ఆయన వయసు, వివిధ జీవుల స్థితిలయాలే ఆయనకు పని, ఆయన శిరోజాలు వేదాలు, మూడు సంధ్యాకాలాలే ఆయనకు వస్త్రాలు, అవ్యక్తం ఆయన హృదయం, చంద్రుడు ఆయన మనస్సు, మహత్తత్త్వం చిత్తం, రుద్రుడు ఆయనకి అహంకారం, గుర్రాలు, ఏనుగులు ఒంటెలు లాంటి జంతువులు ఆయన గోళ్ళు, పశువులు మృగాలు పిరుదులు.

ఆయన చేసే చిత్రవిచిత్ర శబ్దాలు పక్షులు. ఆయన బుద్ధి మనువు. పురుషుడు (మానవుడు) ఆయన నివాసం. గంధర్వులు, విద్యాధరులు, చాణూరులు, అప్సరసలు ఆయన షడ్జాదులైన శబ్ద విశేషాలు. ఆయన స్మృతి ప్రహ్లాదుడు. వీర్యం దానవులు, ఆయన ముఖం వేదాధ్యయనం చేసిన విప్రులు, క్షత్రియులు ఆయన భుజాలు, వైశ్యులు ఆయన తొడలు, శూద్రులు ఆయన పాదాలు, వసువులు రుద్రులు మొదలైన వివిధరకాల దేవతల పేర్లే ఆయన నామాలు. యజ్ఞంలో సమర్పించే హవిస్సులే ఆయన ద్రవ్యం. యజ్ఞాలు చేయటమే ఆయన కర్మలు. ఈవిధంగా విరాట్స్వరూపంతో విలసిల్లేవాడు పరమాత్మ అలాంటి పరమాత్మని సదామనసులో ధారణ చేయాలి. అలా చేసిన వాడికి ముక్తి లభిస్తుంది.

## విష్ణువుని ధ్యానించే పద్ధతి

**వి**రాట్పురుషుడైన పరమాత్మ ప్రతిజీవుడి హృదయంలో వున్న సూక్ష్మమైన ఆకాశంలో, ప్రాదేశమాత్ర ప్రమాణంలో వుంటాడు. అలా తనలో

వున్న పరమాత్మని చతుర్భుజుడుగా, శంఖ, చక్ర, గదా పద్మాలను ధరించినవాడిగా, కోటి మన్మథుల సౌందర్యంతో వెలుగొందేవాడిగా, చంద్రవదనుడిగా, పద్మాదళాల లాంటి కళ్ళు కలవాడుగా, పీతాంబరాలను, కౌస్తుభమణిని, నవరత్నఖచిత కిరీట కుండలాలను, శ్రీవత్స చిహ్నాన్ని, వైజయంతీమాలను స్వర్ణకంకణాలనూ, భుజకీర్తుల్నీ ధరించినవాడిగా భావిస్తూ ఆ దివ్యమంగళ మూర్తిని, నీ హృదయంలో వికసించిన పద్మ కర్ణిక మీద నిల్చొని చిరునవ్వులు చిందిస్తూ తన దివ్యానుగ్రహాన్ని అందుకోవటానికి రమ్మని ఆహ్వానిస్తున్నట్టుగా మనోఫలకం మీద చిత్రీకరించుకోవాలి. నీవు చిత్రీకరించుకున్న ఆ రూపాన్నే మరల మరల తీవ్రంగా చూస్తూ వుండాలి.

క్రమంగా నీ చూపుని దివ్యపురుషుడి పాదపద్మాల మీద కేంద్రీకరించాలి. ఆ తరువాత ఆయన శరీరంలోని ప్రతిభాగాన్నీ మనోనేత్రంతో దర్శించాలి. లక్ష్మీదేవి కొలువున్న ఆయన వక్షఃస్థలం మీద, ఆయన ముఖపద్మం మీద మనసు నిలపాలి. చివరిగా త్రిలోకాలనూ మోహింపచేసే పరమాత్మ చిరునవ్వు మీద సంపూర్ణంగా మనసును కేంద్రీకరించి ధ్యానం చేయాలి. ఈవిధంగా రూపాన్ని నిలిపి ధ్యానం చేయటాన్నే ధారణ అంటారు. ఈవిధంగా ధారణచేసి పరమాత్మను ధ్యానిస్తే బుద్ధి శుద్ధి అవుతుంది. అతడి ప్రారబ్దకర్మ నశించిపోతుంది.

## మోక్ష స్వరూపం

**మోక్షం** లేదా ముక్తి రెండు విధాలుగా వుంటుంది. 1.సద్యోముక్తి (వెంటనే కలిగేది) 2.క్రమముక్తి (క్రమంగా లభించేది). సద్యోముక్తిని కోరుకునే యోగి, తన పాదమూలం అనగా మడమతో మూలాధార చక్రాన్ని అనగా గుదస్థానాన్ని నొక్కిపట్టి, ప్రాణవాయువును బిగపట్టి, బొడ్డు దగ్గరున్న మణిపూరక చక్రం దగ్గరకు తీసుకువెళ్ళాలి. అక్కడి నుంచి హృదయం దగ్గరున్న అనాహత చక్రానికి, తరువాత కంఠమూలంలో వున్న విశుద్ధచక్రం దగ్గరకు, అక్కడి నుంచి భ్రూమధ్యంలో వున్న ఆజ్ఞాచక్రం దగ్గరకు ప్రాణవాయువును తరలించాలి. ఆ తరువాత శరీర ద్వారాలైన కళ్ళు, చెవులు, ముక్కు, నోరు

మూసుకుని ఏ కోరికలు, ఎటువంటి ఆలోచనలు లేకుండా అర్ధముహూర్తం సేపు ఇంద్రియాలతో ఎలాంటి సంపర్కం లేకుండా ప్రాణాన్ని నిగ్రహించాలి. అలా నిగ్రహించగలిగితే ప్రాణం తలమీదున్న బ్రహ్మరంధ్రాన్ని భేదించుకుని పరబ్రహ్మ లోకానికి చేరుకుని ఆయనలో లీనమైపోతుంది.

క్రమముక్తి ఎలా వుంటుందంటే? శరీరత్యాగ సమయంలో ఇంద్రియాలతో సంగమం విడవలేని యోగి ఆ ఇంద్రియాలతో సహా కూడి వున్న బ్రహ్మలోకానికి చేరుకుంటాడు. ఆ లోకంలో కేవలం ఖేచరులు, సిద్ధులు మాత్రమే సంచరిస్తారు. అణిమాది సకలైశ్వర్యాలతో కూడిన విద్యతో, తపస్సు, యోగం, సమాధి, ధ్యానం చేస్తూ వాయువులో లీనమైన యోగీశ్వరులు బ్రహ్మండం లోపలా బైటా సంచరించగలరు. కేవలం కర్మల ద్వారా ఎవరూ అలాంటి శక్తిని పొందలేరు. యోగి సుషుమ్నా నాడి ద్వారా ముందుగా అగ్నిని చేరి ఆ తరువాత దివ్యతేజస్సుతో పవిత్రుడై క్రమంగా నక్షత్ర, సూర్య ధ్రువమండలాల్ని దాటి, నారాయణుడికి చెందిన శింశుమార చక్రం దగ్గరకు చేరుకుంటాడు. అక్కడ పరమాణు స్వరూపమైన లింగ శరీరాన్ని పొంది బ్రహ్మజ్ఞానులు నివసించే మహాలోకంలోకి ప్రవేశిస్తాడు. ఒక మహాకల్పం గడిచేవరకూ అక్కడే ఆనందంగా గడిపి కల్పాంతంలో అక్కడ నుంచి బయలుదేరి అనంతుడి ముఖజ్వాలలతో దహించబడే ముల్లోకాలనూ చూస్తూ క్రమంగా బ్రహ్మలోకానికి  చేరుకుంటాడు.

## బ్రహ్మలోకం

**యో**గులు ప్రవేశించే బ్రహ్మలోకం ఎలా వుంటుందంటే? పద్నాలుగురు మనువుల కాలం గడిస్తే అక్కడ ఒక్కరోజవుతుంది. ఎంతో గొప్ప మహనీయులైన సిద్ధులు ఆ లోకంలో విమానాలలో సంచరిస్తుంటారు. అక్కడ శోకం, వార్ధక్యం, కృశత్వం, మృత్యువు, భయం లాంటివేవీ వుండవు. ఆ లోకంలో పరమ సిద్ధపురుషుల దివ్యవాక్కులు వినవచ్చు. అలాంటి బ్రహ్మలోకాన్ని చేరుకున్నవాడు తిరిగి జన్మించడు. ఎంతో గొప్ప పుణ్యం చేసి బ్రహ్మలోకానికి చేరుకున్నవాడు కల్పాంతంలో తాము చేసిన పుణ్యఫలాల శాతం ప్రకారం తగిన అర్హత

పొందుతారు. బ్రహ్మాది దేవతల్ని ఆరాధించి బ్రహ్మలోకాన్ని చేరినవారు బ్రహ్మ జీవిత కాలమంతా ఆ లోకంలోనే వుండి ఆయనలో కలిసిపోతారు. నారాయణుణ్ణి ఆరాధిస్తూ బ్రహ్మలోకం చేరినవారు అక్కడ స్వేచ్ఛగా సంచరించి తరువాత బ్రహ్మాండాన్ని ఛేదించుకుని వైష్ణవపథానికి చేరుకుంటారు. ఇలా చేరుకున్న వారికి భయమే తెలియదు. విష్ణుపథాన్ని చేరుకున్న యోగి భయరహితుడై దివ్యానందంతో పరమాత్మ వాసుదేవ పరబ్రహ్మలో లీనమైపోతాడు. ఇది పరమ భాగవతులైన యోగులు ముక్తిని పొందే మార్గం. ఈ మార్గం ద్వారా క్రమముక్తిని పొందిన యోగి వందలాది కల్పాలు గడిచినా మళ్ళీ తిరిగి జన్మించడు.

## భక్తిమార్గం

**శు**కమహర్షి పరీక్షిన్మహారాజుతో ఇలా చెబుతున్నాడు – రాజా! పూర్వం బ్రహ్మదేవుడు మూడుసార్లు వేదాల్ని తరిచితరిచి చూసి, చివరికి నిర్ధారించిన విషయమేమిటంటే? కేవలం భక్తితో తప్ప మరో విధంగా మోక్షం త్వరగా సిద్ధించదు అని. మానవులు తమతమ కోరికల్ని తీర్చుకోవటానికి ఆ కోరికల్ని అనుసరించి వివిధ రకాల దేవతల్ని ఆరాధించాలి.

బ్రహ్మతేజస్సు కావాలనుకునేవాడు బ్రహ్మదేవుణ్ణి, ఇంద్రియపటుత్వం కోరేవాడు ఇంద్రుణ్ణి, సంతానం కావాలనుకునేవాడు దక్షాది ప్రజాపతుల్ని, భోజనం కావాలనుకునేవాడు అదితిని, స్వర్గానికి చేరాలనుకునేవాడు ఆదిత్యుడిని, రాజ్యాన్ని పొందాలనుకునేవాడు విశ్వే దేవతల్ని, దేశాన్ని, ధనాన్ని, సిద్ధుల్ని కోరుకునేవాడు దుర్గాదేవిని, దివ్యతేజస్సు కోరేవాడు అగ్నిదేవుణ్ణి, కేవలం ధనం కావాలనుకునేవాడు అష్టవసువుల్ని, వీర్యవృద్ధి కోరేవాడు రుద్రుణ్ణి, ఆయుర్దాయం కోసం అశ్వినీ దేవతల్ని, పుష్టి కావాలంటే భూదేవిని, కీర్తిప్రతిష్ఠలు కోరుకునేవాడు ఆకాశాన్ని, భూమిని, సౌందర్యాన్ని వాంఛిస్తే గంధర్వుల్ని, స్త్రీ సుఖం కావాలనుకునేవాడు ఊర్వశిని, సర్వాధిపత్యం వాంఛిస్తే బ్రహ్మదేవుణ్ణి, కేవలం కీర్తి కావాలనుకుంటే యజ్ఞపురుషుడైన విష్ణువును, విద్యను కోరుకునేవాడు ఉమాపతిని, దాంపత్య సుఖం కావాలంటే పార్వతీదేవిని, ధర్మార్థకామాలు

లభించాలంటే మహావిష్ణువును, సత్సంతానం కోసం పితృదేవతల్ని, రక్షణ కోసం యక్షుల్ని, బలం కావాలంటే మరుద్గణాలను, రాచరికం లభించాలంటే మనురూప దేవతల్ని, శత్రువులు మరణించాలని భావిస్తే నిరృతిని, సకలభోగాలూ అనుభవించాలంటే చంద్రుణ్ణి ఆరాధించాలి. అయితే ఈ దేవతలందరూ వివిధరకాల కోరికల్ని తీర్చగలరు కానీ మోక్షాన్ని మాత్రం ఇవ్వలేరు.

## శ్రీహరి ఆరాధన

**ని**జమైన తత్త్వం తెలిసినవాడు నశించిపోయే కోరికల్ని కోరకుండా విరాట్పురుషుడైన శ్రీహరిని హృదయంలో ప్రతిష్ఠించుకుని, మోక్షాన్ని ప్రసాదించమని ఆయన్ని కోరాలి. శ్రీహరిని సేవిస్తే పవిత్రమైన జ్ఞానం వైరాగ్యం మోక్షం సిద్ధిస్తాయి. కోరికలున్నా లేకపోయినా ఆ శ్రీహరిని ఆరాధిస్తే ఆయన తన భక్తులకు ముక్తిని ప్రసాదిస్తాడు.

వాసుదేవుడి మీద భక్తి వుండటం ఎంతో గొప్ప సుకృతం. ఆయన పుణ్య కథల్ని గాథల్ని వింటూ ఎవడు నిరంతరం కాలం గడుపుతాడో అలాంటివాడి ఆయుష్షుని తప్ప, మిగిలినవారి ఆయుష్షుని ప్రతిరోజూ సూర్యుడు ఉదయిస్తూ, అస్తమిస్తూ లాక్కుపోతుంటాడు. ఆ విషయం తెలుసుకోలేని అజ్ఞానులు తాము ఎంతోకాలం బతుకుతామని అనుకుంటారు. అలా అనుకుంటూ సంసార వ్యామోహంలో చిక్కి ఎన్నో పాపాలు చేస్తూ చివరికి యమభటులు లాక్కుపోతుంటే అయ్యో! నేను కొంచెమైనా పుణ్యకార్యాలు చేయాలని ప్రయత్నించలేదే! అని విలపిస్తుంటారు. శ్రీమహావిష్ణువు గాథలు వినని చెవులు కొండగుహల్లాంటివి. ఆయన గురించి స్తోత్రాలు చదవని నాలుకలు కప్ప నాలుకలు. శ్రీహరి దివ్యరూపాన్ని దర్శించని కళ్ళు నెమలిపింఛంలోని కళ్ళే. కమలాక్షుణ్ణి అర్చించని చేతులు శవాల చేతుల్లాంటివి. విష్ణుపాదాల మీదుండే తులసీదళ పరిమళాన్ని ఆఘ్రాణించని ముక్కు పందిముక్కుతో సమానం.

శ్రీమన్నారాయణుడి దివ్యనామస్మరణతో కరిగి ప్రవహించని మనస్సులు కఠినశిలలు. శ్రీహరి దివ్యకథల్ని విన్నా కూడా ఆనందబాష్పాలు రాల్చని కళ్ళు, రోమాంచంకాని శరీరం కట్టెతో సమానం. నారాయణుడికి నమస్కరించని మూర్ఖుడి తలమీద బంగారు కిరీటం వున్నా అది నిరుపయోగం. భగవంతుడి సేవకి సమర్పించని ఐశ్వర్యం అడవికాచిన వెన్నెలలాంటిది. వాసుదేవుడి సేవకోసం ఉపయోగించని ఈ శరీరం ప్రాణవాయువుతో కదిలే శవంతో సమానం. నారాయణ పాదపద్మాలను ఆశ్రయించనివాడి జీవితం పట్టుదారం గూడులో వున్న పురుగులాంటిది. కనుక శ్రీహరి ఆరాధన సర్వశ్రేయోదాయకం మోక్షప్రదాయకం అని గ్రహించాలి.

## భగవంతుడి అవతారాలు

**ఆ**దిపరమాత్మ కాలానుగుణంగా వివిధ కల్పాలలో వివిధరకాల అవతారాలను ధరించాడు. వాటిలో ముఖ్యమైనవి 20 అవతారాలు.

### 1. ఆదిపురుషావతారం

పరమాత్మ మొదట ధరించిన అవతారం ఆదిపురుషావతారం. వెయ్యితలలతో ఆవిర్భవించిన ఆదిపురుషుడి నుంచి కాలం, స్వభావం అనే రెండు శక్తులుద్భవించాయి. వాటి నుంచి కార్యకారణ రూపంతో వున్న ప్రకృతి పుట్టింది. ప్రకృతి నుంచి మహత్తత్వం, దాని నుంచి సత్త్వం, రాజసం, తామసం, అహంకారం పుట్టాయి. వీటిలో రాజసిక అహంకారం నుంచి ఇంద్రియాలు, సాత్త్విక అహంకారం నుంచి ఇంద్రియగుణాలు కలిగిన అధిదేవతలు, తామసాహంకారం నుంచి పంచభూతాలకీ హేతువులైన శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం, తన్మాత్రలు ఆవిర్భవించాయి. ఆ తన్మాత్రల నుంచి ఆకాశం, గాలి, నీరు, నిప్పు, భూమి అనే పంచభూతాలు పుట్టాయి. వాటినుంచి చర్మం, నేత్రాలు, చెవులు, నాలుక, ముక్కు అనే జ్ఞానేంద్రియాలు, మనస్సు పుట్టాయి. వీటితో పాటు వాక్కు, చేయి, కాలు, గుదం, యోని అనే కర్మేంద్రియాలు కూడా ఆవిర్భవించాయి.

వీటన్నిటి కలయికతో విరాట్పురుషుడు ఉదయించాడు. ఆయన నుంచి స్వయంప్రకాశంతో కూడిన స్వరాట్టు ఆవిర్భవించాడు. ఆ స్వరాట్టు నుంచి చరాచర రూపాలతో స్థావర జంగమాత్మకమైన ప్రపంచం పుట్టింది. ఆ ప్రపంచం నుంచి సత్త్వగుణ సంపన్నుడైన విష్ణువు, రజోగుణ సంపన్నుడైన హిరణ్యగర్భుడు (బ్రహ్మ) తమోగుణ స్వరూపుడైన శివుడు జన్మించారు. సృష్టికర్త అయిన చతుర్ముఖ బ్రహ్మ నుంచి దక్షాది ప్రజాపతులు తొమ్మిదిమంది పుట్టారు. అలాగే నారదుడు, సనకసనందనాది యోగులు, ఇంద్రాదిదేవతలు, గరుడాది పక్షిరాజులు, మానవలోకాన్ని పాలించే మను, మాంధాతాది చక్రవర్తులు, తలో లోకాన్ని పాలించే అనంతవాసుకి వంటి సర్పరాజులు, వీరితో పాటు గంధర్వ విద్యాధర, చారణ, సాధ్య, రాక్షస, యక్ష, ఉరగ, నాగలోక పాలకులు, ఋషులు, పితృదేవతలు, దేవ, దానవ, భూత, ప్రేత, పిశాచ, కూష్మాండ, పశు మృగాదులు ఆవిర్భవించారు.

జగత్తుకు సంబంధించిన ఈ సృష్టిని ప్రథమ సృష్టి అంటారు. రెండోది అండగతి సృష్టి, మూడోది సమస్త భూతగత సృష్టి అని అంటారు. ఈ సృష్టులలో ఐశ్వర్యంతో దివ్యతేజస్సుతో వెలిగిపోయే వారందరూ శ్రీమన్నారాయణుడి అంశతో జన్మించినవారే.

## 2. యజ్ఞవరాహావతారం

పూర్వం హిరణ్యాక్షుడనే రాక్షసుడుండేవాడు. తన బాహుబలంతో భూమిని చాపలాచుట్టి సముద్రగర్భంలోకి పోయి దాచిపెట్టాడు. అప్పుడు శ్రీమన్నారాయణుడు యజ్ఞవరాహ రూపాన్ని ధరించి హిరణ్యాక్షుణ్ణి సంహరించి తిరిగి భూమిని ఉద్ధరించాడు.

## 3. సుయజ్ఞావతారం

రుచి అనే ప్రజాపతికి స్వాయంభువ మనువు కుమార్తె ఆకూతికీ 'సుయజ్ఞుడనే' కుమారుడు జన్మించాడు. అతడు 'దక్షిణ' అనే స్త్రీని వివాహం చేసుకోగా వారికి 'సుయముతి' అనే దేవతలు పుట్టారు. సుయజ్ఞుడు కాలక్రమంలో

దేవతలకు రాజై ఇంద్రపదవిని అధిష్టించాడు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువులాగా అందరి బాధల్ని పోగొట్టాడు. స్వాయంభువ మనువు తన మనుమడైన సుయజ్ఞుడి గొప్పతనాన్ని గుర్తించి "అతడు సాక్షాత్తు శ్రీహరి అవతారుడే" అని ప్రకటించాడు.

### 4. కపిలావతారం

కర్దమ ప్రజాపతి, దేవహూతి దంపతులకి తొమ్మిదిమంది ఆడపిల్లలు జన్మించిన తరువాత కపిలుడు పుట్టాడు. శ్రీమన్నారాయణుడే కపిలుడుగా వారికి ఉదయించాడు. ఆ కపిలుడు కాలక్రమంలో తన తల్లికి సాంఖ్యయోగాన్ని బోధించి ఆమెకి మోక్షం లభించేలా చేసాడు.

### 5. దత్తాత్రేయావతారం

మహాతపస్వి అయిన అత్రిమహర్షి సంతానం కోసం శ్రీహరిని గురించి ఘోరమైన తపస్సు చేసాడు. శ్రీహరి ప్రత్యక్షమై నేటినుంచి నేను నీకు దత్తుడనయ్యానని చెప్పి అతడికి పుత్రుడుగా జన్మించాడు. దత్తుడు కాబట్టి ఆయన దత్తాత్రేయుడుగా విఖ్యాతి చెందాడు. మహాయోగి అయిన దత్తాత్రేయుడిని ఆరాధించి హైహయ వంశానికి చెందిన వారంతా పవిత్రులయ్యారు. దత్తాత్రేయుడు యోగిగా, స్మరిస్తే చాలు ప్రత్యక్షమయ్యే దైవంగా లోకంలో ఎంతో కీర్తి పొందాడు.

### 6. సనకసనందనాదులు

పూర్వం కల్పారంభంలో బ్రహ్మదేవుడు విశ్వసృష్టి చేయటం కోసం తపస్సు చేయటం ప్రారంభించాడు. అలా చేస్తున్నప్పుడు ఆయన నోటినుంచి అప్రయత్నంగా 'సన' అనే శబ్దం వెలువడింది. వెంటనే నలుగురు కుమారులు ఉద్భవించారు. వారే సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు. వీరంతా బ్రహ్మ మానసపుత్రులుగా ప్రసిద్ధి చెందారు. పూర్వకల్పం చివర్లో నాశనమైపోయిన ఆత్మతత్త్వాన్ని తిరిగి లోకంలో ప్రచారం చేసారు. అవటానికి బ్రహ్మ మానసపుత్రులైనా, వారు నలుగురూ విష్ణు కళతో జన్మించారు. వారంతా ఒకే అవతారం నుంచి ఆవిర్భవించినవారు.

## 7. నరనారాయణావతారం

మహాయోగులు, వీరులు నరనారాయణులు. వీరిద్దరూ 'ధర్ముడు' దక్షుడి కుమార్తె 'మూర్తి'కి జన్మించారు. వారిద్దరూ బదరికాశ్రమంలో తపస్సు చేసుకుంటున్నారు. వారి తపస్సు చూసి తన ఇంద్రపదవికి భంగం కలుగుతుందేమోనని భయపడ్డ ఇంద్రుడు వారి తపస్సు భగ్నం చేయటానికి అప్సరసల్ని పంపించాడు. ఆ సుందరీమణులు చేసిన శృంగారచేష్టలకు వారిద్దరూ ఏమాత్రం చలించలేదు. వారిమీద జాలిపడ్డారు. వారికి కనువిప్పు కలిగించాలని భావించిన నారాయణ ఋషి ఒక్కసారి తన తొడను చరిచాడు. వెంటనే ఆయన తొడనుంచి అందమైన దివ్యకాంత ఆవిర్భవించింది. ఊరువు నుంచి పుట్టిన ఆ మొదటి కాంతని ఊర్వశి అని పిలిచారు. అందచందాలలో తమకన్నా ఎన్నోరెట్లు మెరిసిపోతున్న ఊర్వశిని చూసి వారంతా సిగ్గుతో తలలు దించుకున్నారు. నరనారాయణులు ఊర్వశిని ఇంద్రుడికి కానుకగా తీసుకుపొమ్మన్నారు. ఆ అప్సరసలు ఊర్వశిని తమ నాయకురాలిగా చేసుకుని వచ్చినదారినే స్వర్గానికి తిరిగి వెళ్ళారు. ఈవిధంగా శ్రీహరి అవతారమైన నరనారాయణులు కామక్రోధాల్ని జయించి సృష్టిని సైతం చేయగల సమర్థులుగా కీర్తి పొందారు.

## 8. ధ్రువుడికి దర్శనమిచ్చిన అవతారం

ఉత్తానపాదుడనే రాజు కుమారుడు ధ్రువుడు. ఒకనాడు ధ్రువుడు తన తండ్రితో ఆడుకుంటుండగా, సురుచి అనే అతడి సవతి తల్లి వచ్చి ధ్రువుణ్ణి తూలనాడింది. దానితో ధ్రువుడెంతో బాధపడ్డాడు. అప్పుడు నారదుడిచ్చిన సలహాను అనుసరించి శ్రీహరి గురించి కఠినంగా తపస్సు చేసాడు. శ్రీహరి ప్రత్యక్షమై అతణ్ణి అనుగ్రహించాడు. ఆయన అనుగ్రహంతో ధ్రువుడు సశరీరంగా వెళ్ళి శాశ్వతమైన ధ్రువలోకంలో స్థిరంగా నిలిచాడు. విష్ణుసమానుడుగా నాటినుంచీ ప్రసిద్ధి పొందాడు.

## 9. పృథుచక్రవర్తి అవతారం

పూర్వం 'వేనుడు' అనే రాజు, ఒక బ్రాహ్మణుడి శాపానికి గురై ఐశ్వర్యాన్ని పౌరుషాన్ని కోల్పోయి చివరికి నరకానికి వెళ్ళాడు. అతడికి మహావిష్ణు అంశతో జన్మించిన పృథువు అనే కుమారుడున్నాడు. ఆ పృథువు తండ్రిని నరకం నుంచి రక్షించి, భూదేవిని తన బిడ్డగా స్వీకరించి ఆమె ద్వారా ప్రజలకు కావలసిన ఎన్నో వస్తువుల్ని పొందాడు. పృథువుకి కూతురుగా వున్నది కనుకనే భూమికి 'పృథివి' అనే పేరు వచ్చింది.

## 10. ఋషభావతారం

అగ్నీధ్రుడి కుమారుడు 'నాభి'కి, మేరుదేవికి జన్మించినవాడు ఋషభుడు. ఈయన నారాయణాంశ సంభూతుడు. ఋషభుడు జడుడిలాగా వుంటూ, నిరంతరం యోగాభ్యాసం చేస్తూ పరమహంసలా సంచరించేవాడు. ఆయన గొప్ప అవధూత అని నాటి మహర్షులు ప్రశంసించేవారు.

## 11. హయగ్రీవావతారం

పూర్వం నారదుడు చేసిన యాగంలో యజ్ఞపురుషుడైన మహావిష్ణువు బంగారంలాంటి శరీరఛాయతో హయగ్రీవుడుగా ఆవిర్భవించాడు. ఆయన సర్వాంతర్యామి. దేవతలందరకూ ఆత్మలాంటివాడు. ఆయన నాసిక నుంచి వేదాలు శ్వాసలుగా వెలువడ్డాయి.

## 12. మత్స్యావతారం

పూర్వం ప్రళయం సంభవించి అంతా జలమయమైపోయింది. అప్పుడు వైవస్వత మనువు ఒక పడవలో కూర్చున్నాడు. ఆ సమయంలో మహావిష్ణువు మత్స్యంగా అవతరించి రాబోయే సృష్టికి అవసరమయ్యే వస్తువులన్నిటినీ ఆ పడవలో వుంచి దాన్ని ప్రళయం బారినుంచి రక్షించాడు. అలాగే బ్రహ్మముఖం నుంచి జారిన వేదాల్ని తిరిగి ఆయనకు అందచేసాడు.

## 13. కూర్మావతారం :

అమృతాన్ని పొందాలని దేవతలు దానవులు మంధరగిరిని కవ్వంగా వాసుకిని తాడుగా చేసుకుని క్షీరసాగరాన్ని చిలకటం ప్రారంభించారు.

ఆ సమయంలో మంధర పర్వతం సముద్రంలో మునిగిపోతుంటే శ్రీహరి కూర్మావతారాన్ని ధరించి మందరపర్వతం కిందకి చేరి అది మునిగిపోకుండా కాపాడాడు.

## 14. నరసింహావతారం

పూర్వం హిరణ్యకశిపుడనే అసురుడు శ్రీహరిని ద్వేషిస్తూ అందర్నీ బాధలకు గురిచేస్తుండేవాడు. అతడికి ప్రహ్లాదుడనే హరిభక్తుడు ఉదయించాడు. ప్రహ్లాదుడి హరిభక్తిని సహించలేని హిరణ్యకశిపుడు ఆ బాలుణ్ణి ఎంతో హింసించాడు. తన భక్తుడు హింసించబడటం చూడలేని విష్ణువు నరసింహావతారం ధరించి హిరణ్యకశిపుణ్ణి వధించి లోకాలకు ఎంతో మేలు చేసాడు.

## 15. ఆదిమూలావతారం

పూర్వం గజేంద్రుడనేవాడు ఒక సరస్సులో దిగి అందులో వున్న మొసలిచేత పట్టుకోబడ్డాడు. తన శక్తికొద్దీ వెయ్యి సంవత్సరాలు దానితో పోరాడినా మొసలి పట్టు విడవలేదు. అప్పుడు గజేంద్రుడు తన శక్తి చాలక పరమాత్మని అన్యధాశరణం నాస్తి త్వమేవ శరణం మమ అని ఎలుగెత్తి ప్రార్థించాడు. అదివిని మహావిష్ణువు పరమేశ్వరుడుగా, ఆదిమూల స్వరూపంతో ఆ సరస్సు దగ్గరకు వచ్చి మొసలిని చంపి ఏనుగుకి మోక్షాన్ని ప్రసాదించాడు.

## 16. వామనావతారం

పరమాత్మ అదితి గర్భాన వామనుడుగా జన్మించాడు. ఆ సమయంలో దానవరాజైన బలిచక్రవర్తి ముల్లోకాల్నీ ఆక్రమించి విజయగర్వంతో తులతూగుతున్నాడు. అప్పుడు వామనుడు బలిగర్వం అణచాలని భావించి బాలవటువుగా అతడి దగ్గరకి వెళ్ళి మూడడుగుల నేలను దానమివ్వమని కోరాడు. బలి సరే అనగా ఒక అడుగుతో భూమిని, ఒక అడుగుతో ఆకాశాన్ని కొలిచి, మూడో అడుగుని బలి తలమీద పెట్టి అతన్ని పాతాళలోకానికి పంపించేసాడు.

## 17. హంసావతారం

ఒకనాడు నారదుడి కోరిక మేరకు మహావిష్ణువు హంసరూపంలో వచ్చి అతడికి ఆత్మతత్త్వాన్ని బోధించాడు. ఆయనే తరువాత ధన్వంతరిగా అవతరించి లోకంలో ఎంతోమందికి అనారోగ్యాన్ని పోగొట్టాడు.

## 18. పరశురామావతారం

పూర్వం హైహయరాజులు ఎంతో క్రూరంగా పరిపాలించేవారు. వారిని ప్రజలందరూ లోకకంటకులుగా భావించేవారు. ఆ సమయంలో పరమాత్మ పరశురాముడిగా అవతరించి 21 సార్లు భూమండలమంతా సంచరించి క్షత్రియుడన్న ప్రతి ఒక్కరినీ హతమార్చాడు. తాను సంపాదించిన భూమండలమంతా బ్రాహ్మణులకు దానం చేసాడు.

## 19. శ్రీరామావతారం

రావణాసురుడి బాధలు పడలేక దేవతల మొరవిన్న మహావిష్ణువు భూలోకంలో దశరథ మహారాజు కౌసల్యా దంపతులకు శ్రీరాముడుగా జన్మించాడు. రాముడు తండ్రికిచ్చిన మాట కోసం భార్యా తమ్ముడితో కలిసి వనవాసం చేసాడు. తన భార్యను అపహరించిన లంకేశుడి మీదకి దండెత్తి వానరసైన్యంతో లంకని జయించి రావణుణ్ణి సంహరించాడు.

## 20. శ్రీకృష్ణావతారం

రాక్షసాంశతో జన్మించిన ఎందరో రాజులు అధర్మంగా ప్రవర్తిస్తూ భూమిమీద సంచరించటంతో భూమాత పరమాత్మతో మొరపెట్టుకుంది. ఆమె మొరవిన్న పరమాత్మ భూలోకంలో అవతరించి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయాలని భావించాడు. వెంటనే తన తలలోని ఒక నల్లవెంట్రుకను, ఒక తెల్ల వెంట్రుకనూ తీసి భూలోకంలోకి విసిరాడు అవి రెండూ బలరామ-కృష్ణులుగా జన్మించాయి.

శ్రీకృష్ణుడు పరమాత్మ ధరించిన పరిపూర్ణావతారం. ఆయన సకల సద్గుణ సంపన్నుడు. తన చిన్నతనం నుంచీ ఎన్నో ఘనకార్యాలు చేసాడు. పుట్టిన కొద్దిరోజుల్లోనే తనని చంపటానికి వచ్చిన పూతన చన్నుల్ని పీల్చి

దాన్ని సంహరించాడు. అలాగే శకటాసురుణ్ణి సంహరించాడు. తల్లికి నోటిలో బ్రహ్మాండాన్ని చూపాడు. కాళీయుడి మదాన్ని అణిచాడు. పెద్దయ్యాక ప్రలంబుణ్ణి, ధేనుకుణ్ణీ, బకుడు, కేశిని, కంస, కాలయవన, నరకాసుర, పౌండ్రక వాసుదేవ, ముష్టిక, శిశుపాల, దంతవక్త్రుల లాంటి దుర్మార్గుల్ని సంహరించి లోకాన్ని రక్షించాడు.

## 21. వేదవ్యాసావతారం

ప్రతియుగంలో అల్పాయుష్కులైన అజ్ఞానులు ఎంతోమంది జన్మిస్తారు. వారికి పరమాత్మ చెప్పిన వేదాలు అందుబాటులో వుండవు. అందుకే పరమాత్మ ప్రతియుగంలో వ్యాసుడుగా జన్మించి వేదాల్ని విభాగించి, పురాణాల్ని రచించి మానవులందరికీ జ్ఞానం, మోక్షం కలిగేలా కృషి చేస్తున్నాడు.

## 22. బుద్ధావతారం

కలియుగంలో మానవులంతా భోగలాలసులై, హింసాప్రవృత్తితో యజ్ఞ యాగాలలో లక్షలాది పశువుల్ని సంహరిస్తూ వుండటాన్ని చూసి పరమాత్మ బుద్ధుడుగా అవతరించాడు. తన ధర్మబోధనతో అందరినీ అహింసామూర్తులుగా మార్చి లోకంలో సుఖం, శాంతి నెలకొనేలా చేసాడు.

## 23. కల్కి అవతారం

కలియుగంలో బ్రాహ్మణులు ధర్మభ్రష్టులై భగవంతుణ్ణి పూజించారు. వేదబాహ్యులై యజ్ఞయాగాది కర్మల్ని ఆచరించారు. వారి నోటినుంచి మంగళకర వాక్యాలు వినిపించవు. సత్యాన్ని పలుకరు. అదేవిధంగా రాజులు కూడా అధర్మబద్ధంగా పాలిస్తూ ప్రజల్ని హీనంగా చూస్తుంటారు. అంతటా అధర్మం అవినీతి ప్రబలంగా పెరిగిపోతుంది. ఆ సమయంలో పరమాత్మ కల్కిపురుషుడుగా అవతరించి తన ఖడ్గంతో దుష్టశిక్షణ శిష్టరక్షణ చేస్తాడు.

ఇవన్నీ పరమాత్మ ధరించిన లీలావతారాల్లో కొన్ని మాత్రమే. నిజం చెప్పాలంటే! సృష్టిలో వున్న ప్రతిజీవిలో నారాయణుడున్నాడు. సృష్టి ప్రారంభంలో ఆయన తపస్సు, బ్రహ్మ, ఋషులు, తొమ్మిదిమంది ప్రజాపతుల రూపంలో

అవతరించి సృష్టిరచన చేస్తాడు. తరువాత ధర్మం, విష్ణువు, యజ్ఞాలు, మానవులు, ఇంద్రాది దేవతలు, షట్చక్రవర్తులు, వీరి రూపాలలో అవతరించి సృష్టిని రక్షిస్తూ పోషిస్తుంటాడు. చివరగా అధర్మం, రుద్రుడు, సర్పాలు, రాక్షసులు వంటి రూపాల్ని ధరించి సృష్టిని లయం చేస్తాడు. ఇదంతా పరమాత్మ (శ్రీమన్నారాయణుడి) మాయ, లీల.

## భగవంతుడి మాయ

**ఒ**కనాడు బ్రహ్మదేవుడు నారదుడితో, “నారదా! భగవంతుడి మాయాశక్తి చాలా గొప్పది. దాన్ని నేనే తెలుసుకోలేకపోయాను. ఇక నా మానసపుత్రులైన సనకసనందనాదుల గురించి చెప్పేదేముంది. అలాగే ఆదిశేషుడు త్రికరణ శుద్ధిగా శ్రీమన్నారాయణుడి మీదే బుద్ధిని నిలిపి ఆయన గుణగణాల్ని తన వేయినోర్లతో కీర్తిస్తుంటాడు. ఆయనే శ్రీహరి మాయ ఎలాంటిదో తెలుసుకోలేక పోయాడు. ఇక ఇతరులకు ఎలా తెలుస్తుంది. ఎవరైతే ఏకాగ్రంగా మనసా, వాచా, కర్మణా శ్రీహరినే నమ్మి ఆయన్నే సదా సేవిస్తారో, వాళ్ళని ఆ పరమాత్మ అనుగ్రహిస్తాడు. వారు మాత్రమే మాయను తెలుసుకోగలరు.

భగవంతుడు అందరిచేత శరణు కోరబడేవాడు. అందరికీ ఆయనే ఫలదాత. అంతటా వ్యాపించినవాడు. కల్పాంతంలో అన్నీ నశించినా తాను మాత్రం స్థిరంగా వుండేవాడు.

నారదా! భాగవత పురాణగాథ వేదార్థాన్ని ప్రతిపాదించేది కావటం వల్ల ఎంతో ప్రశస్తమైనది. దీన్ని పఠించిన వారికి మోక్షం కలిగేలా భగవంతుడే వ్యాసుడి రూపంలో దీన్ని రచించాడు. భగవద్భక్తులకు ఇది కల్పవృక్షం లాంటిది. ఉపవాసాలు, వ్రతాలు, నోములు, శౌచాలు, యాగాలు, అగ్నికార్యాలు, సంధ్యోపాసనలు, వేదాధ్యయనాలు వంటి పనులు ఎన్ని చేసినా మోక్షం సిద్ధించదు. లక్ష్మీనాథుడు, అరవిందనేత్రుడు, పాపనాశకుడు, పరమేశ్వరుడు అయిన శ్రీమన్నారాయణుణ్ణి నిర్మలమైన భక్తితో భజిస్తూ, కీర్తిస్తూ, ఆయన

మహిమల్ని స్తుతించాలి. ఇతరులు ఆ పని చేస్తుంటే వినాలి. వింటూ వింటూ ఆ మహిమల్ని మననం చేసుకుని ఆనంద తన్మయత్వాన్ని పొందాలి. ఇలా చేసేవాళ్ళు ఎప్పటికీ భగవంతుడి మాయకు చిక్కరు" అని చెప్పాడు.

## కాల విశేషాలు

**కా**లంలో అత్యంత సూక్ష్మాతి సూక్ష్మమైన దాన్ని పరమాణువు అంటారు. మనం కిటికీలో నుంచి సూర్యరశ్మి లోపలికి ప్రసరిస్తున్నప్పుడు చూస్తే అందులో చాలా సూక్ష్మమైన రేణువులు కనిపిస్తాయి. అలాంటి ఒక రేణువులో ఆరోవంతు పరమాణువు. ఆ పరమాణువు మీద ఒక పక్కనుంచి మరోపక్కకి సూర్యరశ్మి ప్రసరించే కాలాన్ని సూక్ష్మకాలం అంటారు. రెండు పరమాణువులు కలిపితే ఒక అణువు. మూడు అణువులు = ఒక త్రసరేణువు. మూడు త్రసరేణువులు = ఒకత్రుటి. మూడు త్రుటులు= ఒకవేధ, మూడు వేధలు = ఒక లవం. మూడు లవాలు = ఒక నిమేషం. మూడు నిమేషాలు = ఒక క్షణం. ఐదుక్షణాలు = ఒకకాష్ఠ. పదికాష్ఠలు = ఒక లఘువు. అలాంటి పదిలఘువులు ఒకనాడి. రెండు నాడులు = ఒక ముహూర్తం. ఆరు లేక ఏడునాడులు = ఒక ప్రహరం లేదా యామం. అలాంటి నాలుగు జాములు = ఒక పగలు. నాలుగు జాములు = ఒకరాత్రి.

ఒక పగలు ఒక రాత్రి కలిస్తే ఒకరోజు కాలం. పదిహేనురోజులు = ఒక పక్షం. రెండు పక్షాలు కలిపితే ఒక మాసం. (ఇలాంటి ఒకమాసం పితృదేవతలకు ఒకరోజు) రెండుమాసాలు = ఒక ఋతువు. ఆరుమాసాలు = ఒక ఆయనం. (ఉత్తర దక్షిణాయానాలు) రెండు ఆయనాలు = ఒక సంవత్సరం.(మన ఒక సంవత్సర కాలం దేవతలకి ఒకరోజు) మానవులకు పరమాయుర్ధాయం వందసంవత్సరాలు.

సూర్యభగవానుడు ఒక సంవత్సర కాలంలో పన్నెండురాసుల్ని చుట్టి వస్తాడు. పితృదేవతలు మూడువేల సంవత్సరాల ఆయుర్ధాయాన్ని కలిగి వుంటారు. దేవతలకి ముప్పై ఆరువేల మానవ సంవత్సరాల కాలం ఆయుర్ధాయం వుంటుంది. ఒక దివ్యవర్షం అంటే మూడువందల అరవై

మానవ సంవత్సరాలు. కృతయుగ పరిమాణం 4000 దివ్యవర్షాలు. ప్రతియుగానికీ మధ్య సంధికాలం వుంటుంది. కృతాసంధ్య 800 దివ్య వర్షాలుంటుంది. త్రేతాయుగం 3000 దివ్యవర్షాలు. త్రేతాయుగసంధ్య 600 దివ్యవర్షాలు, ద్వాపరయుగం 2000 దివ్యవర్షాలు. దాని యుగసంధ్య 400 దివ్యవర్షాలు, కలియుగం 1000 దివ్యవర్షాలు. దాని సంధ్య 200 దివ్య సంవత్సరాలు. ఈ నాలుగుయుగాలలో సంధ్యాకాలాలతో సహా లెక్కిస్తే 12వేల దివ్య వర్షాలవుతాయి. ఈ మొత్తాన్ని కలిపి ఒక చతుర్యుగం అంటారు. ఈ సంధ్యాకాలాలతో ధర్మం చాలా తక్కువగా వుంటుంది. కృతయుగంలో ధర్మం నాలుగుపాదాలతో, త్రేతాయుగంలో మూడు పాదాలతో, ద్వాపరయుగంలో రెండు పాదాలతో, కలియుగంలో ఒక్కపాదంతో నడుస్తుంది.

సత్యలోకం భూలోకం, భూవర్లోకం, స్వర్గలోకం కంటే పైన వుంది. అది బ్రహ్మదేవుడి నివాసస్థానం. ఒక వెయ్యి చతుర్యుగాలు అంటే 432 కోట్ల మానవ సంవత్సరాలు గడిస్తే బ్రహ్మదేవుడికి ఒక పగలు అవుతుంది. ఇదే పరిమాణంలో రాత్రికూడా వుంటుంది. బ్రహ్మదేవుడికి పగలు కల్పం అని చెప్పబడుతుంది. ఆయన రాత్రిని నైమిత్తిక ప్రళయం అంటారు. బ్రహ్మదేవుడి ఒక కల్పంలో 14 మన్వంతరాలు గడుస్తాయి ప్రతి మన్వంతరంలో భగవంతుడు అవతరాల్ని ధరిస్తాడు. ప్రతి కల్పం చివరా, అన్ని లోకాలూ, సూర్యచంద్రులూ బ్రహ్మదేవుడిలో లయమై పోతుంటారు. మూడులోకాలూ సంకర్షణుడి ముఖం నుంచి వచ్చే అగ్నిజ్వాలలతో దహించబడతాయి. సముద్రజలాలన్నీ లోకాల్ని ముంచేస్తాయి. బ్రహ్మదేవుడు నిద్రపోతే చాలు ప్రళయం సంభవిస్తుంది. అదే నైమిత్తిక ప్రళయం. ఆయన తిరిగి మేలుకుంటే లోకాలన్నీ ఆవిర్భవిస్తాయి. అప్పుడు దేవతలు, ఋషులు, మునులు పరమాత్మ అంశతో మనువులుగా జన్మించి ఒక్కొక్కరూ డెబ్భై ఒక్క మహాయుగాల పాటు లోకాన్ని పాలిస్తారు.

మొత్తం బ్రహ్మదేవుడు జీవించి వున్న కాలంలో ముప్పై ఆరువేల కల్పాలు, ముప్పై ఆరువేల నైమిత్తిక ప్రళయాలు సంభవిస్తాయి. ప్రళయకాలంలో చండ

ప్రచండంగా గాలులు వీస్తాయి. సముద్రాలు పొంగి అన్ని ప్రాంతాల్నీ ముంచెత్తుతాయి. ఎటుచూసినా సముద్రమే. అలాంటి సముద్రంలో సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు హాయిగా శయనించి వుంటాడు.

బ్రహ్మదేవుడి ఆయుర్ధాయం వందసంవత్సరాలు. దానిలో మొదటి యాభై సంవత్సరాలు పూర్వపరార్థం అనీ, రెండో ఏభై సంవత్సరాల కాలాన్ని ద్వితీయ పరార్థమనీ అంటారు. పూర్వపరార్థంలోని చివరికల్పాన్ని పద్మకల్పం అంటారు. ద్వితీయ పరార్థం మొదటికల్పంలో మహావిష్ణువు వరాహరూపాన్ని ధరిస్తాడు. అందుకే దానికి వరాహకల్పం అనే పేరు వచ్చింది. ప్రస్తుతం నడుస్తున్న కాలం వరాహకల్పమే. బ్రహ్మదేవుడికి 51 సంవత్సరం నడుస్తోంది. పరమాత్మ ఆద్యంతాలు లేనివాడు. ఆ మహాపురుషుడికి బ్రహ్మదేవుడి జీవిత కాలమంతా ఒక ఱెప్పపాటే. పరమాత్మ అనంతుడు. కాలాతీతుడు. కాలమే ఆయన స్వరూపం.

## బ్రహ్మ సృష్టి

**మ**హాసృష్టి చేయాలనే కోరికతో బ్రహ్మదేవుడు వందసంవత్సరాలు తపస్సు చేసాడు. ఆ సమయంలో ప్రచండంగా గాలులు వీచాయి. ఆ గాలిధాటికి తాను కూర్చున్న కమలం ఊగిపోతుంటే వెంటనే గాలిని నిరోధించాడు. అక్కడున్న నీటి మొత్తం త్రాగేసి ఒక్కసారి ఆకాశంవైపు చూసాడు. ఆకాశంలో జలం కనిపించింది. అందులోనే ఒక పద్మం కూడా ఆయనకి కనిపించింది. ఆ పద్మం రేకుల్లో ఎన్నో లోకాలు ఆయనకి దర్శనమిచ్చాయి. వాటిని చూసే సరికి ఆయనకి తిరిగి సృష్టి చేయాలన్న విషయం గుర్తుకు వచ్చింది. వెంటనే ఆ పద్మంలోకి ప్రవేశించి, తన తపశ్శక్తితో పద్నాలుగు భువనాలను, వాటిలో దేవతల్ని, మానవుల్ని, పశుపక్ష్యాదుల్ని, స్థావరాలనూ క్రమంగా సృష్టించటం ప్రారంభించాడు. తన సృష్టిని మొత్తాన్ని తొమ్మిది వర్గాలుగా విభజించి చేసాడు. 1.మహత్తత్త్వం 2.అహంకారతత్త్వం 3.భూతసృష్టి 4.ఇంద్రియసృష్టి, 5.దేవతాసృష్టి 6.తామసవర్గ సృష్టి 7.స్థావరవర్గ సృష్టి 8.తిర్యక్కుల సృష్టి

9. మానవులు 10. దేవతలు (ఈ దేవతలుపై తెలిపిన తొమ్మిది వర్గాల్లో సృష్టించబడ్డారు.)

బ్రహ్మదేవుడు తాను 'సృష్టిస్తాను' అని అనుకోగానే ముందుగా శరీరం మీద అభిమానం గల 'మోహం' అనేది పుట్టింది. తరువాత భోగాలమీద ఆసక్తి వున్న 'మహామోహం' పుట్టింది. కోరికలు తీరకుండా పోయేసరికి కళ్ళకి కనిపించని 'క్రోధం' పుట్టింది. తరువాత క్రమంగా మృత్యుభయంతో కూడిన తామిస్రం, అంధతా మిస్రం అనేవి పుట్టాయి. ఈ అయిదిటినీ అవిద్యా పంచకం అంటారు. వీటివల్ల చిత్తభ్రమ కలుగుతుంది. ఇలాంటి అవిద్యా విషయాలతో సృష్టిచేయటం చాలా పాపం అని బ్రహ్మదేవుడు భావించాడు. ఇవి తన నుంచి పుట్టినందుకు బాధపడుతూ పరమాత్మని ధ్యానించి తిరిగి పవిత్రుడయ్యాడు.

బ్రహ్మదేవుడు తన మనసు నుంచి పరమపవిత్రులు, బ్రహ్మచారులు అయిన సనక సనందన, సనాతన, సనత్కుమారులనే నలుగుర్ని సృష్టించి, ప్రజల్ని ఉత్పత్తి చేయండి అని ఆదేశించాడు. అయితే వారు బ్రహ్మ ఆదేశాన్ని తిరస్కరించి, మేము సంసారులం కాము. మోక్షం కోసం శ్రీమన్నారాయణుడినే ఆశ్రయిస్తాం అని వెళ్ళిపోయారు. బ్రహ్మకు ఎంతో కోపం వచ్చింది. ఆయన కోపమంతా భ్రుకుటిలో నిక్షిప్తమై దానిలోంచి క్రోధ స్వరూపంతో నీలం రంగులో వున్న ఒక పురుషుడు ఆవిర్భవించాడు. పుట్టగానే ఆ శిశువు రోదించటం ప్రారంభించాడు.

తరువాత ఏడుపు ఆపి బ్రహ్మతో నేనెవరిని? నా పేరేమిటి? నేనెక్కడుండాలి? ఏం చేయాలి? అని ప్రశ్నించాడు. బ్రహ్మ అతడితో నాయనా? నీ పేరు రుద్రుడు. సూర్యుడు, చంద్రుడు, పంచభూతాలు, వీటితో పాటు ఇంద్రియాలు, ప్రాణం, తపస్సు, హృదయం అనే ఈ పన్నెండు స్థానాలలో నీవు ఉండవచ్చు. నీకు 1. మన్యువు, 2. మనువు, 3. మహాకాల, 4. మహత్తు, 5. శివ, 6. ఋతధ్వజ, 7. ఉరురేతస్క, 8. భవ, 9. కాల, 10. వామదేవ, 11. ధ్రుతవ్రత అనే పదకొండు పేర్లుంటాయి. అలాగే నీ పదకొండు రూపాలకీ 1. ధీ, 2. వృత్తి, 3. ఉశన, 4. ఉమ, 5. నియుత్, 6. సర్పి, 7. ఇళ, 8. అంబిక,

9.ఇరావతి, 10.సుధ, 11.దీక్ష అనే పేర్లతో పదకొండుమంది భార్యలు కూడా వుంటారు. నీవు నీ భార్యలతో సంసారం చేసి సృష్టిని పెంపొందించాలి అని ఆదేశించాడు. బ్రహ్మ ఆజ్ఞననుసరించి రుద్రుడు తన పదకొండు రూపాలతో తనలాంటి, తనతో సమానులైన ప్రజల్ని సృష్టించటం ప్రారంభించాడు. దానితో క్రమంగా రుద్రగణాల సంఖ్య అపరిమితంగా లోకంలో పెరిగిపోయింది. అది తెలిసి బ్రహ్మదేవుడు రుద్రుణ్ణి పిలిచి నాయనా! ఇప్పటివరకూ చేసిన సృష్టి చాలు ఇక ఆపేసి తపస్సు చేసుకోండని చెప్పగా వారు సరేనని తపస్సు చేసుకోవటంలో నిమగ్నులయ్యారు.

బ్రహ్మదేవుడు తన శరీరభాగాల నుంచి పదిమంది మహాపురుషుల్ని సృష్టించాడు. 1.తన బొటనవేలి నుంచి దక్షుణ్ణి, 2.తొడ నుంచి నారదుణ్ణి, 3.నాభి నుంచి పులహుణ్ణి, 4.చెవుల నుంచి పులస్త్యుణ్ణి, 5.చర్మం నుంచి భృగువుని, 6.చేతి నుంచి క్రతువుని, 7.ముఖం నుంచి అంగిరసుణ్ణి, 8.ప్రాణం నుంచి వశిష్ఠుణ్ణి, 9.మనస్సు నుంచి మరీచిని, 10.కళ్ళ నుంచి అత్రిని ఆవిర్భవింప చేసాడు. బ్రహ్మ కుడివక్షఃస్థలం నుంచి ధర్మం, వెన్ను నుంచి అధర్మం, మృత్యువు జన్మించాయి. ఆయన ఆత్మ నుంచి మన్మథుడు, కనుబొమల నుంచి క్రోధం, పెదాల నుంచి లోభం, నోటి నుంచి సరస్వతి, పురుషాంగం నుంచి సముద్రాలు, అపానం నుంచి నిరృతి, నీడ నుంచి కర్దముడు జన్మించారు.

బ్రహ్మదేవుడి నాలుగుముఖాల నుంచి నాలుగు వేదాలు పుట్టాయి. వాటితో పాటు నలుగురు హోతలతో చేయబడే 'చాతుర్హోత్రం' అనే కర్మతంత్రం కూడా ఆవిర్భవించింది. అలాగే యాగాన్ని నిర్వహించే హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ అనే నలుగురు ఋత్విక్కులు పఠించాల్సిన 1.శస్త్ర 2.ఇజ్య 3.స్తోమ 4.ప్రాయశ్చిత్త మంత్రాలు కూడా వెలువడ్డాయి. తరువాత ఉపవేదాలుగా ప్రసిద్ధి పొందిన ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, స్థాపత్యం (శిల్పశాస్త్రం) అనే నాలుగు పాదాలు పుట్టాయి. ధర్మపాదాలంటే విద్య, దానం, ధనం, తపస్సు అనేవి. అలాగే బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనే ఆశ్రమధర్మాలు కూడా ఆవిర్భవించాయి.

## 1. బ్రహ్మచర్యం

బ్రహ్మచర్యాన్ని సావిత్రం అంటారు. ఎందుకంటే గాయత్రీ మంత్రోపదేశాన్ని పొంది దాన్ని జపిస్తారు కాబట్టి. ఉపనయనం అయిన తరువాత బ్రహ్మచారి మొదటి మూడురోజులు గాయత్రీ మంత్రాన్ని జపించటాన్ని 'ప్రాజాపత్యం' అంటారు. తరువాత వేదంలో చెప్పిన వాటిని ఆచరించటాన్ని బ్రహ్మమని, వేదాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేసి అనుష్ఠానం చేయటాన్ని నైష్ఠికమనీ అంటారు.

## 2. గృహస్థాశ్రమం

గృహస్థులు నాలుగు రకాలుగా చెప్పబడ్డారు. పొలాన్ని చక్కగా దున్నుకొని పంట పండించుకుని తినేవారిని 'వార్త' అంటారు. యజ్ఞసామాగ్రిని సమకూర్చుకోవటాన్ని 'సంచయం' అంటారు. ఆ గృహస్థు ఇతరుల్ని యాచించకుండా వుండటాన్ని శాలీనం అని, పొలంలో రాలిన గింజల్ని ఏరుకుని తెచ్చి వాటిని శిలపై నూరుకుని తింటూ జీవనం గడపటాన్ని శిలోంఛం అంటారు.

## 3. వానప్రస్థం

వానప్రస్థాశ్రమంలో నాలుగు విధాల వారుంటారు. 1.అడవిలో దుంపల్ని (కందమూలాలు) త్రవ్వుకుని తింటూ జీవనం గడిపేవారిని వైఖానసులంటారు. 2.కొత్తపంట రాగానే ఇంతకు ముందు తమ దగ్గరున్న ధాన్యాన్ని ఇతరులకు వితరణ చేసేవారు వాఖల్యులు. 3.ఉదయం లేవగానే ఏ దిక్కుకు వెళ్ళాలనిపిస్తే ఆ దిక్కువైపు వెళ్ళి అయాచితంగా లభించిన దాన్ని తినేవారు ఔదుంబరులు. కేవలం చెట్టు నుంచి నేలపై రాలిన పళ్ళని, ఆకుల్ని తినేవారు ఫేనవులు.

## 4. సన్న్యాసులు

సన్న్యాసాశ్రమం స్వీకరించిన వారిలో కూడా నాలుగురకాల వారుంటారు. 1.తమకి సొంత కుటీరం వుండి అందులో నివసిస్తూ తగిన కర్మల్ని ఆచరించే వారిని కుటీచకులని 2.కుటీరం లేకుండా కర్మలు చేయకుండా

జ్ఞానంతో సంచరించే వారిని బహూదకులని 3.కేవలం జ్ఞానాన్ని మాత్రమే కలిగి వున్నవారిని హంసలని 4.జ్ఞానం కూడా పొందకుండా, పరబ్రహ్మ తత్త్వంలో లీనమయ్యేవారిని పరమహంసలని అంటారు.

బ్రహ్మదేవుడి నుంచి పైతెలిపిన వాటితో పాటు అన్వీక్షకి, త్రయీ, వార్త, దండనీతి అనే నాలుగురకాల న్యాయవిద్యలు పుట్టాయి. అన్వీక్షకి అంటే ఆత్మ-అనాత్మ వీటి వివేకం ద్వారా మోక్షాన్ని పొందే విద్య. త్రయీ విద్య అంటే = ఋగ్యజు స్సామవేదాలలో చెప్పిన కర్మల్ని ఆచరిస్తూ స్వర్గాది పుణ్యఫలాలను పొందటం. వార్త అంటే మానవుడు తన జీవనోపాధి కోసం చేసే వర్తకం తదితర వృత్తి విశేషాలు. దండనీతి అంటే డబ్బు సంపాదించే విద్య. బ్రహ్మముఖం నుంచి నాలుగు న్యాయవిద్యలతో పాటు భూః, భువః, సువః, మహః అనే నాలుగు హ్యాహృతులు కూడా ఆవిర్భవించాయి. ఆయన హృదయం నుంచి ఓంకారం పుట్టింది. అలాగే ఆరు ప్రధాన ఛందస్సులు, యాభై అక్షరాలు, సప్తస్వరాలు, శబ్దాలు అన్నీ ఆయన నుంచే వచ్చాయి.

ఈవిధంగా బ్రహ్మదేవుడు ఎంతో సృష్టి చేసినప్పటికీ ఆయనకు సంతృప్తికరంగా తగినంత మంది ప్రజల్ని సృష్టించలేదన్న చింత కలిగింది. వెంటనే ఆలోచించి పరమాత్మను ధ్యానించాడు. ఆయన ఇచ్చిన స్ఫురణతో తన శరీరాన్ని రెండు భాగాలుగా చేసాడు. వాటిలో ఒక భాగం నుంచి 'స్వరాట్టు' అనే పురుషుడు, రెండో భాగం నుంచి 'శతరూప' అనే స్త్రీ ఆవిర్భవించారు. బ్రహ్మ వారిద్దరినీ వివాహం చేసుకుని ప్రజల్ని పుట్టించమన్నాడు. వారిద్దరూ బ్రహ్మ ఆజ్ఞని పాటించి తమ మిథునం ద్వారా ప్రజాసృష్టి చేయటం ప్రారంభించారు.

## కపిలుడి సాంఖ్యయోగం

**క**పిలుడిగా అవతరించిన నారాయణుడు తన తల్లి దేవహూతికి సాంఖ్యయోగం గురించి ఇలా బోధించాడు. సత్త్వరజస్తమోగుణాలతో కూడిన ప్రకృతిలో చిక్కుకున్నవాడు జీవుడు. ఆ ప్రకృతిని నియంత్రించేవాడు

పరమేశ్వరుడు. ఈ యథార్థతత్త్వాన్ని తెలుసుకుని సాధకుడైనవాడు తన బుద్ధిని అంతర్ముఖంగా చేసి వేరే ఏ ఇతర వస్తువుల్నీ చూడకుండా కేవలం పరమాత్మ స్వరూపుడైన శ్రీమన్నారాయణ్ణే దర్శించాలి. అలాచేస్తే మిథ్యా స్వరూపంతో వుండే అహంకారం తొలగిపోయి సత్యజ్ఞానం ప్రకాశిస్తుంది. తద్వారా పరబ్రహ్మ ప్రాప్తి జీవుడికి కలుగుతుంది. ఆత్మ గురించి స్పష్టంగా తెలుసుకున్నవాడికే విష్ణుతత్త్వం అవగతమవుతుంది. ఎలాగంటే? ఒక గదిలో వున్న మనిషి, కిటికీ ద్వారా గదిలో వున్న నీటిబిందెలో సూర్యుడి ప్రతిబింబం పడి దాని వెలుగు గోడమీద ప్రసరించినప్పుడు సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు అని తెలుసుకోగలుగుతాడు. తాను సరాసరి సూర్యబింబాన్ని చూడకపోయినప్పటికీ ప్రతిబింబం ఎలా వచ్చిందో పరిశీలిస్తే సూర్యస్వరూపం ఎలా వుందో తెలుస్తుంది. అదేవిధంగా మనస్సు, బుద్ధి, అహంకారాలలో ప్రకాశించే చైతన్యం ద్వారా ఆత్మస్వరూపం ఎలా వుంటుందో తెలుసుకోవచ్చు.

జీవుడు తన సుషుప్తిలో (గాఢనిద్రలో) పరమాత్మతో సంబంధం కలిగి వుంటాడు. ఆ సమయంలో జీవుడిలో వున్న పంచభూతాలు, తత్త్వాలు లీనమైపోయి ప్రకృతిలో అలా పడి వుంటాయి. అప్పుడు జీవుడి ఆత్మ మాత్రమే మేలుకొని వుంటుంది. ఎలాంటి ఇతర ఆలోచన లేకుండా అది పరబ్రహ్మతో ఆత్మానుభవాన్ని పొందుతూంటుంది.

ఉపాసకుడు ఎలాంటి ప్రతిఫలాన్ని ఆశించకుండా, తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలి. తన మనస్సుని ఎప్పుడూ పవిత్రంగా వుంచుకుని నామీదే అచంచలమైన భక్తిప్రపత్తులు కలిగి వుండాలి. నా దివ్యకథల్ని శ్రవణం చేస్తూ వైరాగ్యాన్ని, జ్ఞానాన్ని పెంపొందించుకోవాలి. ఏకాగ్రతతో, తపస్సు, ధ్యానం చేయాలి. ఈవిధంగా సాధన చేస్తే ఉపాసకుడికి ప్రకృతితో వున్న అనుబంధం తొలగిపోతుంది. ప్రకృతి ఆకర్షణ నుంచి తత్త్వం తెలుసుకున్నవాడు బైటపడతాడు. నిద్ర నుంచి మెలకువ రాగానే కలలో తానుపడ్డ బాధలు ఏవీ లేచాక తనని బాధించనట్టు, కర్మసాక్షిగా వున్న ఆత్మకి ప్రకృతి దోషాలేవీ

అంటవు. నిజమైన ఆత్మజ్ఞాన సంపన్నుడు పరబ్రహ్మని చేరుకునే దాకా ఎన్ని జన్మలెత్తినా తనలోని వైరాగ్యాన్ని చెక్కుచెదరనీయడు. అమ్మా! అణిమ, మహిమా, గరిమా, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అనే అష్టసిద్ధులు మోక్షం పొందటానికి అడ్డుగా నిలుస్తాయి. వాటి మాయలో చిక్కుకోకుండా, నా పాదపద్మాల మీదే దృష్టిని నిలిపినవాడు తప్పక మోక్షాన్ని పొందుతాడు.

## ధ్యాన పద్ధతి

**ధ్యా**నాన్ని ఆచరించేవాడు సత్కర్మల్ని చేయాలి. మనసును కలుషితం చేసే పనులు చేయకూడదు. నిత్యం ప్రాణాయామం చేస్తుండాలి. పరిశుభ్రమైన ప్రదేశంలో దర్భాసనం, దానిమీద జింకచర్మాన్ని దానిమీద పరిశుభ్రమైన వస్త్రాన్ని వేసుకుని స్థిరంగా సుఖాసనంలో కూర్చోవాలి. శరీరాన్ని నిటారుగా వుంచి రేచక, కుంభక, పూరకాలతో ప్రాణాయామం చేసి అన్నమయాది కోశాల్ని శుద్ధి చేసుకోవాలి. మనస్సును చంచలం కాకుండా స్థిరంగా వుంచుకొని తీవ్రమైన యమం ద్వారా కాల్చి శుద్ధి చేయబడ్డ బంగారంలాగా మనస్సును పరిశుద్ధం చేసుకోవాలి. ఈవిధంగా వాయువును జయించిన యోగికి ప్రాణాయామం ద్వారా ఉద్భవించిన అగ్నితో వాతపిత్త కఫాది దోషాలు తొలగిపోతాయి. ధారణతో అతడి పాపాలు, ప్రత్యాహారం ఆచరించటం వల్ల పూర్వజన్మ వాసనలు దహించిపోయేలా చేసుకుని రాగద్వేషాల్ని వదిలి త్రిగుణాల ప్రభావం పడకుండా తన దృష్టిని నాసికాగ్రం మీద కేంద్రీకరించాలి. ఆవిధంగా తన దృష్టిని నిలిపి పరిశుద్ధమైన మనసుతో దివ్యపురుషుడైన శ్రీమన్నారాయణుడి దివ్యమంగళ స్వరూపాన్ని దర్శిస్తూ ఆయన గుణగణాల్ని స్మరిస్తూ ధ్యానం చేయాలి.

## భక్తి పద్ధతులు

**అ**మ్మా! మానవులలో వున్న గుణగణాల్ని బట్టి వారిలో వున్న సంకల్పశక్తికి అనుగుణంగా భక్తిభావాలు కలుగుతాయి. ఈ భక్తి అనేది మూడు విధాలుగా వుంటుంది. 1.తామసభక్తి, 2.రాజసభక్తి, 3.సాత్త్వికభక్తి.

ఇతరులందరినీ హింసిస్తూ దంభం, మాత్సర్యం, రోషం, తమోగుణం, భేదబుద్ధి తదితర గుణాలతో కూడిన వ్యక్తి నన్ను ఉపాసించటం తామసభక్తి అనిపించుకుంటుంది. గొప్ప విషయాలను, గొప్ప వస్తువుల్ని, భూముల్ని, ఐశ్వర్యాన్ని, కీర్తి ప్రతిష్టల్ని కోరుకుంటూ అత్యంత ఆర్భాటంగా అధిక వ్యయప్రయాసలతో నన్ను పూజించేవాడిది రాజసిక భక్తి. అన్ని కర్మదోషాలనూ తొలగించేది కేవలం భక్తి మాత్రమేనని గ్రహించి, తాను చేసే అన్ని పనుల్ని భగవదర్పితంగా చేస్తూ నన్ను నిరంతరం శ్రద్ధగా సేవించేవాడి భక్తి సాత్త్వికభక్తి. అమ్మా! నా దివ్య గుణగణాలు వినగానే భక్తి తత్పరతతో నన్ను ఆశ్రయించినవారే నిజభక్తులు. ఈవిధంగా కపిలుడు తన తల్లికి బోధచేసాడు.

## ధ్రువుడి చరిత్ర

**పూ**ర్వం మనుమహారాజుకు ఉత్తానపాదుడనే కుమారుడుండేవాడు. ఆ ఉత్తానపాదుడికి ఇద్దరు భార్యలు సునీతి–సురుచి. ఒకనాడు సునీతి కుమారుడైన ధ్రువుడు తండ్రి దగ్గరకొచ్చి ఆయనతో ఆడుకోసాగాడు. ఆ సమయంలో ధ్రువుడి పిన్ని సురుచి అక్కడికి వచ్చి ధ్రువుణ్ణి అవమానించింది. ఉత్తానపాదుడు చిన్న భార్యమీద మమకారంతో ధ్రువుణ్ణి ఆమె తిడుతున్నా ఏమాత్రం స్పందించలేదు. దాంతో మనసు చివుక్కుమన్న ధ్రువుడు తల్లితో జరిగిన విషయం చెప్పగా ఆమె శ్రీహరిని శరణు వేడుకోమని ధ్రువుడికి బోధించింది. తల్లిమాటను అనుసరించి ధ్రువుడు ఇల్లు విడిచి బయలుదేరాడు. దారిలో నారదమహర్షి అతడికి కనిపించి నారాయణ మంత్రాన్ని ఉపదేశించాడు. వెంటనే ధ్రువుడు తపస్సు చేయటం ప్రారంభించాడు.

ధ్రువుడు చేసే తపస్సుకు లోకాలన్నీ తల్లడిల్లిపోయాయి. దేవతలంతా ఏంచేయాలో దిక్కుతోచక శ్రీహరిని ప్రార్థించారు. విషయం తెలుసుకున్న ఆయన వెంటనే గరుత్మంతుణ్ణి అధిరోహించి ధ్రువుడి ముందు సాక్షాత్కరించాడు. అయితే శ్రీహరి రూపాన్ని మనసులో నింపుకుని ధ్యానిస్తున్న ధ్రువుడు

కళ్ళు తెరవలేదు. ఒక్కసారి ధ్రువుడిలో నిలిచిన తన రూపాన్ని శ్రీహరి ఉపసంహరించుకున్నాడు. అంతే కళ్ళు తెరిచాడు ధ్రువుడు. ఎదురుగా దివ్యమంగళాకారంతో శ్రీ మహావిష్ణువు అతడికి దర్శనమిచ్చాడు. నోటమాట రాక అలా నిశ్చేష్టుడై ఆయన్ని చూస్తూ వుండిపోయాడు. అంతలో శ్రీహరి తన శంఖాన్ని మృదువుగా ధ్రువుడి చెంపల మీద తాకించాడు. వెంటనే ధ్రువుడికి పవిత్రమైన జ్ఞానం కలిగింది. వెంటనే శ్రీమహావిష్ణువును ఘనంగా స్తుతించాడు.

**యోఽంతః ప్రవిశ్య మమవాచ మిమాం ప్రసుప్తామ్ ।**
**సంజీవయత్యఖిల శక్తిధరః స్వధామ్నా**
**అన్యాంశ్చ హస్త చరణ శ్రవణత్వగాదాన్**
**ప్రాణాన్ నమోభగవతే పురుషాయ తుభ్యమే ॥**
**ఏకస్త్వమేవ భగవన్నిదమాత్మ శక్త్యా**
**మాయోఖ్యయోరుగుణయా మహదాద్య శేషమ్**
**సృష్ట్వానువిశ్య పురుషస్తద సద్గుణేషు**
**నానేవ దారుషు విభావసువద్విభాసి ॥**
**భక్తింముహుః ప్రవహతాం త్వయిమే ప్రసంగో**
**భూయాదనంత మహతా మలాశయానామ్**
**యేనాంజసోల్బణ మరువ్యసనం భవాబ్ధిమ్**
**నేష్యే భవద్గుణ కథామృత పానమత్తః** *(చతుర్థస్కంధ శ్లో 6-7-11)*

పురుషోత్తమా నీవు సర్వశక్తి సంపన్నుడివి. నా మనసులో నీవు ప్రవేశించి నిద్రించి వున్న నామాటల్ని మేల్కొలిపావు. అలాగే నా కర్మేంద్రియాలనూ, జ్ఞానేంద్రియాలనూ చైతన్య పరిచావు. సకల ప్రాణులలో అంతర్యామిగా వున్న నీకు నమస్కారం. స్వామీ! త్రిగుణాత్మకమైన నీ మాయాశక్తితో ఈ సకల ప్రపంచాన్నీ సృష్టించావు. అంతర్యామిగా నీవే అందులో ప్రవేశించావు. ఒకే అగ్ని వేరేవేరే కట్టెలలో వేరువేరు రూపాలతో ప్రకాశించినట్టు నీవుకూడా ఒక్కడివే వివిధరకాల ప్రాణుల్లో వివిధ రూపాలతో ప్రకాశిస్తుంటావు.

పరంధామా! నిర్మలమైనవారు, నీమీద భక్తి ప్రపత్తులు కలిగిన సత్పురుషులతో నాకు సాంగత్యాన్ని ప్రసాదించు. దానివల్ల నేను నిత్యం నీ గుణాల్ని లీలల్ని వింటూ పరవశించిపోతాను. తద్వారా దుఃఖభూయిష్టమైన సంసారసాగరాన్ని అవలీలగా దాటుతాను.

ఈవిధంగా ధ్రువుడు చేసిన స్తుతి విని శ్రీహరి ఎంతో సంతోషించి "ఓ ధ్రువా నీభక్తి అనన్య సామాన్యం. నీవు చాలాకాలం రాజ్యపాలన చేసి చివరికి సర్వోత్తమమైన ధ్రువపదానికి చేరుకుంటావు" అని వరమిచ్చి అదృశ్యుడయ్యాడు. వరాన్ని పొందిన ధ్రువుడు తిరిగి నగరానికి వచ్చాడు. ప్రజలంతా అతన్ని ఘనంగా స్వాగతించారు. ఉత్తానపాదుడు ధ్రువుడికి రాజ్యభారం అప్పగించి వానప్రస్థాశ్రమం స్వీకరించాడు. ధ్రువుడు సుభిక్షంగా రాజ్యపాలన చేసి చివరికి శ్రీహరి వరప్రభావంతో ధ్రువపదానికి చేరుకున్నాడు.

## ప్రాచేతసుల కథ

**పృ**థుమహారాజు కుమారుడి పేరు ప్రాచీన 'బర్హి'. ఆయన భార్యపేరు శతద్రుతి. ఆ పుణ్యదంపతులు ఎంతో శ్రద్ధగా యజ్ఞయాగాలు చేసారు. కొన్నాళ్ళకు శ్రీహరి అనుగ్రహంతో వారికి 'ప్రచేతసులు' అనే పదిమంది కుమారులు జన్మించారు. వారందరి పేరూ ఒకటే ప్రచేతసులు. ప్రాచీన బర్హి తన పదిమంది కుమారులతో సంతానాన్ని వృద్ధి చేయండి అని ఆజ్ఞాపించాడు. తండ్రి ఆజ్ఞను పాటించాలని భావించిన ఆ ప్రచేతసులు శ్రీహరి అనుగ్రహం కోసం తపస్సు చేయాలని నిశ్చయించుకుని పశ్చిమ సముద్రతీరానికి చేరారు. ఆ తీరంలో వారికి ఒక అందమైన సరోవరం కనిపించింది. అక్కడే వారు తపస్సు చేయటం ప్రారంభించారు. ఒకనాడు మహాతపస్వులైన ప్రచేతసుల్ని చూద్దామని శంకరుడు అక్కడికి వచ్చాడు. వారిని చూసి వారికి శ్రీహరి దివ్యస్తోత్రాన్ని ఉపదేశించాడు.

శంకరుడు ఉపదేశించిన దివ్యస్తోత్రాన్ని శ్రద్ధగా పఠిస్తూ పదివేల సంవత్సరాలు ప్రచేతసులు సముద్రతీరంలో తపస్సు చేసారు. చివరికి శ్రీహరి

వారికి ప్రత్యక్షమై "ప్రచేతసులారా! మీ తపస్సుకి సంతోషించాను. మీకు వరాన్ని ప్రసాదిస్తున్నాను. మీరంతా ఒకే ధర్మాన్ని ఆచరిస్తున్నారు. మీ అందరి ఐక్యత ఆదర్శప్రాయం. సంధ్యా సమయంలో నిత్యం మిమ్మల్ని స్మరించేవారికి సర్వభూతదయ, సాదర ప్రేమ పెంపొందుతాయి. మీకు శంకరుడు చెప్పిన దివ్యస్తోత్రాన్ని పఠించినా నేను సంతృప్తి చెందుతాను. మీకు మహీరుహుడి కుమార్తె మారిషతో వివాహం జరుగుతుంది. మీకు ఎంతో కీర్తిప్రతిష్ఠలు సంపాదించిపెట్టే కుమారుడు పుడతాడు. అతడే దక్షుడు. అతడు జన్మించిన తరువాత చివరికి మీరు నా సన్నిధికి చేరుకుంటారు" అని పలుకగా ప్రచేతసులు శ్రీహరిని పరిపరి విధాలుగా స్తుతించి తమకి ఎప్పుడూ భగవద్భక్తులతో సాంగత్యం కలిగి వుండే భాగ్యాన్ని ప్రసాదించమని కోరుకున్నారు. శ్రీహరి తథాస్తు అని ఆశీర్వదించి అదృశ్యమయ్యాడు.

ప్రచేతసులు ఆనందంగా సముద్రతీరం నుంచి తపస్సు చాలించి లేచిచూడగా, అంతా దట్టంగా పెద్ద అరణ్యంలా మారిపోయింది. కాలు పెట్టటానికి కూడా తగిన స్థలం లేదు. వెంటనే వారికి ఆగ్రహం కలిగింది. వారి ఆగ్రహానికి ఆ వృక్షాలన్నీ దగ్ధం అయిపోసాగాయి. వెంటనే బ్రహ్మదేవుడు అక్కడికి వచ్చి వారిని వారించాడు. దాంతో వారి ఆగ్రహం చల్లారి చెట్లు తగలబడటం ఆగిపోయింది. ఆవిధంగా తమని పూర్తిగా నాశనం చేయకుండా ఆగిన ప్రచేతసులకి ఆ వృక్షాలు 'మారిష' అనే తమ కన్యనిచ్చి వివాహం చేసాయి. విష్ణువు చెప్పిన ప్రకారం ప్రచేతసులు ఆమెతో సుఖంగా సంసారం చేసి దక్షుడనే కుమారుణ్ణి పొందారు. తరువాత నారదమహర్షి ప్రచేతసులకి జ్ఞానబోధ చేయగా వారు శ్రీహరిని ఉపాసించి ఆయన దివ్యధామాన్ని చేరుకున్నారు.

## సప్తద్వీపాలు

**ఈ** భూమండలమంతా ఒక పద్మాకారంగా వుంటుంది. ఈ భూమిమీద మొత్తం ఏడుద్వీపాలున్నాయి. 1.జంబూద్వీపం, 2.ప్లక్షద్వీపం, 3.శాల్మలీద్వీపం, 4.కుశద్వీపం, 5.క్రౌంచద్వీపం, 6.శౌకద్వీపం, 7.పుష్కరద్వీపం.

**1. జంబూద్వీపం**

భూమండలంలో ఈ ద్వీపం ఒక లక్షయోజనాల పొడవు వెడల్పులతో వర్తులాకారంగా వుంటుంది. ఇందులో మొత్తం తొమ్మిది వర్షాలు (భాగాలు) వుంటాయి. ఈ వర్షాల్ని విభజించే సరిహద్దులుగా ఎనిమిది కులపర్వతాలున్నాయి. ఈ తొమ్మిది వర్షాల మధ్యలో ఇలావృతవర్షం వున్నది. ఆ ఇలావృతానికి మధ్యలో లక్షయోజనాల ఎత్తులో మేరు పర్వతం వుంటుంది.

**1. ఇలావృతవర్షం**

ఇలావృతవర్షంలో పరమాత్మ రుద్రుడిచేత ఆరాధించబడతాడు. పార్వతితో సహా రుద్రుడు సంకర్షణుడి రూపంలో వున్న పరమాత్మని "ఓం నమో భగవతే మహాపురుషాయ; సర్వగుణ సాంఖ్యానాయ అనంతాయ అవ్యక్తాయచ" అని ఆరాధిస్తాడు.

**2. భద్రాశ్వవర్షం**

ఇలావృతానికి తూర్పుదిశగా భద్రాశ్వవర్షం వుంది. అక్కడ భద్రాశ్వులనే మహర్షులు నివసిస్తుంటారు. వారంతా వేదాల్ని ఉద్ధరించిన హయగ్రీవుణ్ణి "ఓం నమో భగవతే ధర్మాయ ఆత్మ విశోధనాయ నమః" అని ధ్యానిస్తారు.

**3. హరివర్షం**

ఇలావృతానికి దక్షిణదిక్కులో హరివర్షం వుంది. అక్కడ తెల్లనివర్ణంతో ప్రకాశిస్తూ నరసింహమూర్తి నివసిస్తుంటాడు. శుద్ధజ్ఞానాన్ని ప్రసాదించే ఆయన్ని ప్రహ్లాదుడు వంటివారు "ఓం నమో భగవతే నరసింహాయ నమః తేజస్తే జసే ఆవిరావిరావిర్భవ తమోగ్రసగ్రస ఓం స్వాహా అభయం అభయం ఆత్మని భూయిష్ఠ్యాక్ష్రౌం" అని ధ్యానిస్తారు.

**4. కేతుమాలవర్షం**

ఇలావృతానికి పడమర ప్రాంతంలో కేతుమాల వర్షం వుంది. అక్కడ పరమాత్మ ప్రద్యుమ్నుడి రూపంలో వుంటాడు. ప్రజాపతి కుమారులు, లక్ష్మీదేవి "ఓం హ్రాం హ్రీం హ్రూం ఓం నమోభగవతే హృషీకేశాయ, సర్వగుణ విశేషైః

విలక్షితాత్మనే, ఆకూతినాం, చిత్తానాం, చేతనానాంచ, విశేషాధిపతయే, షోడశకళాయ, ఛందోమయాయ, అన్నమయాయ, అమృతమయాయ, సర్వమయాయ, సహసే, ఓజసే, బలాయ, కాంతాయ, కామాయ, నమస్తే ఉభయత్ర భూయాత్" అనే మంత్రంతో నిత్యం ప్రద్యుమ్నుణ్ణి ఉపాసిస్తుంటారు.

**5. రమ్యకవర్షం**

ఇలావృతానికి ఉత్తరదిశలో రమ్యకవర్షం వుంది. ఈ వర్షానికి అధిపతి మనువు. శ్రీహరి ఈ వర్షంలో మత్స్యావతార రూపం ధరించి వుంటాడు. మనువు అతడి సంతానం, అక్కడి ప్రజలు శ్రీహరిని "ఓం నమో భగవతే ముఖ్య తమాయ నమః సత్త్వాయ, ప్రాణాయ ఓజసే సహసే బలాయ మహామత్స్యాయ నమః" అనే మంత్రంతో ఉపాసిస్తారు.

**6. హిరణ్మయవర్షం**

రమ్యకవర్షానికి ఉత్తరభాగంలో వున్నదే హిరణ్మయవర్షం. ఆ వర్షానికి అధిపతి అర్యముడు. ఆయన కూర్మావతారాన్ని ధరించి అక్కడ కొలువున్న శ్రీహరిని భక్తిగా "ఓం నమో భగవతే అకూపారాయ సర్వ సత్త్వగుణ విశేషణాయ, అనుపలక్షిత స్థానాయ, నమోవర్ష్మణే నమో భూమ్నే నమోనమో అవస్థానాయ నమస్తే" అనే మంత్రాన్ని పఠిస్తూ ఉపాసిస్తారు.

**7. ఉత్తరకురువర్షం**

ఉత్తర కురువర్షంలో శ్రీహరి వరాహరూపం ధరించి కొలువుంటాడు. స్వామిని భూదేవితో సహా అక్కడున్న వారంతా "ఓం నమో భగవతే మంత్ర తత్త్వలింగాయ యజ్ఞక్రతవే, మహాధ్వర అవయవాయ మహాపురుషాయ నమః కర్మ శుక్లాయ త్రిగుణాయ నమః" అనే మంత్రంతో ఉపాసిస్తారు.

**8. కింపురుష వర్షం**

శ్రీహరి శ్రీరాముడి అవతారంలో సీతాసమేతుడై నివసిస్తుంటాడు. ఇది ఇలావృతానికి దక్షిణదిక్కులో వుంది. మహాభక్తుడైన హనుమంతుడు, అక్కడున్న

కింపురుషులతో కలిసి "ఓం నమో భగవతే ఉత్తమ శ్లోకాయనమో ఆర్యలక్షణ శీలవ్రతాయ నమః, ఉపశిక్షితాత్మనే ఉపాసిత లోకాయనమః. సాధువాద నికషణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహాపురుషాయ మహారాజ్ఞా నమః" అనే మంత్రంతో ఉపాసిస్తుంటారు.

## 9. భారతవర్షం

భారతవర్షంలో నరనారాయణుల అవతారాన్ని ధరించిన శ్రీహరి బదరికాశ్రమంలో కల్పాంతం వరకూ తపస్సు చేస్తుంటాడు. ఈ వర్షానికి 'ఆరాధ్యుడు' అధిపతి. నారదుడితో సహా సకలమునులు, ఋషులు "ఓం నమో భగవతే ఉపశమ లీలాయ ఉపరతనాత్మ్యాయ, నమో ఆకించన విత్తాయ, ఋషివృషభాయ, నరనారాయణాయ పరమహంస పరమగురవే, ఆత్మారామాధిపతయే నమోనమః" అనే మంత్రంతో ఉపాసిస్తుంటారు.

**ఉపద్వీపాలు :** జంబూద్వీపంలో అశ్వమేధ యాగాశ్వాన్ని అన్వేషిస్తూ సగరుడి కుమారులు అన్నివైపుల నించి భూమిని తవ్వేసారు. అప్పుడు వరుసగా 1.స్వర్ణప్రస్థం, 2.చంద్రశుక్లం, 3.ఆవర్తనం, 4.రమణకం, 5.మందేహారుణం, 6.పాంచజన్యం, 7.సింహళం, 8.లంక అనే ఉపద్వీపాలేర్పడ్డాయి.

జంబూద్వీపం తరువాత వరుసగా 2.ప్లక్షద్వీపం, 3.శాల్మలద్వీపం, 4.కుశద్వీపం, 5.క్రౌంచద్వీపం, 6.శాకద్వీపం, 7.పుష్కరద్వీపం ఏర్పడ్డాయి.

శ్రీమన్నారాయణుడు ప్లక్షద్వీపంలో సూర్యుడిగా, శాల్మలద్వీపంలో సోముడిగా, కుశద్వీపంలో అగ్నిగా, క్రౌంచద్వీపంలో జలంగా, శాకద్వీపంలో వాయురూపుడుగా, పుష్కరద్వీపంలో బ్రహ్మగా కొలువున్నాడు. ఈ పుష్కర ద్వీపంలోనే మధ్యభాగంలో పదివేల యోజనాల ఎత్తుగల 'మానసోత్తరం' అనే పర్వతం వుంది. ఆ ద్వీపం ఆవల లోకాలోక (వెలుగు చీకటి) పర్వతం వుంది. ఆ పర్వతం మీద ఏ జీవరాశి వుండదు. ఒకవైపు వెలుగు, ఒకవైపు దట్టమైన చీకటి వుంటాయి. అది సూర్యుడి నుంచి ధ్రువడి దాకా వ్యాపించి వుంది.

ఈవిధంగా మొత్తం భూమండలమంతా ఏభైకోట్ల యోజనాల విస్తీర్ణంతో వుంది. లోకాలోక పర్వతం ఒక్కటే పన్నెండుకోట్ల యోజనాల విస్తీర్ణం కలది. ఈ లోకాలక పర్వతం మీద పైభాగంలో బ్రహ్మ దేవుడు 1.ఋషభుడు, 2.పుష్కరచూడు, 3.వామనం, 4.అపరాజితం అనే పేర్లున్న నాలుగు దిగ్గజాల్ని నిలిపాడు. వాటివల్లే అన్నిలోకాలూ స్థిరంగా వుంటున్నాయి. అక్కడే శ్రీమన్నారాయణుడు మాయతో కలిసి కల్పాంతం దాకా అందర్నీ పాలిస్తాడు.

## ఇతర లోకాలు

**న**క్షత్రాలు, తేజోరాసులు సంచరించే ప్రదేశమే ద్యులోకం. భూలోకానికీ ద్యులోకానికీ మధ్యలో సూర్యుడుంటాడు. సూర్యుడున్న స్థానం నుంచే అష్టదిక్కులు, అంతరిక్షం, ద్యులోకం, భూలోకం, స్వర్గం, నరకం, అతలాది అధోలోకాలు నిర్దేశించబడ్డాయి. భూమండలానికి ద్యుమండలానికీ మధ్య వున్నదే అంతరిక్షం. ఈ అంతరిక్షం మధ్యలో వున్న సూర్యుడు ఉత్తరాయణ, దక్షిణాయానాల మధ్య సంచరిస్తుంటాడు. పరమాత్మ శ్రీమన్నారాయణుడే లోకక్షేమం కోసం సూర్యుడి రూపాన్ని ధరించాడు. సూర్యుడు వేదస్వరూపుడు. కాలాన్ని నియంత్రించేవాడు. నారాయణుడు అంతరిక్షంలో వున్న శింశుమార అనే కాలచక్రంలో కొలువుంటాడు.

సప్తర్షి మండలానికి పదమూడు లక్షల యోజనాల దూరంలో ధ్రువమండలం వుంది. ఇది విష్ణుస్థానం. ఈ ధృవమండలాన్ని కేంద్రంగా చేసుకుని గ్రహాలు, నక్షత్రాలు అన్నీ కల్పాంతం దాకా పరిభ్రమిస్తుంటాయి. సూర్యుడికి పదివేల యోజనాల క్రింద రాహుగ్రహముంది. సూర్యుడికి పన్నెండువేల యోజనాల పైన చంద్రమండలం వుంది.

భూలోకానికి క్రిందభాగంలో వరుసగా ఏడు అధోలోకాలున్నాయి. 1.అతలలోకం, 2. వితలలోకం, 3.సుతలలోకం, 4.తలాతలలోకం, 5.మహాతల లోకం, 6.రసాతలలోకం, 7.పాతాళలోకం అనేవి.

## నరకలోక విశేషాలు

**భూ**మండలానికి దక్షిణదిక్కులో భూమికి అంతరిక్షానికి మధ్య భయంకరమైన ఇరవై ఎనిమిది రకాల నరకాలున్నాయి.

1.తామిస్రం 2.అంధతామిస్రం 3.రౌరవం 4.మహారౌరవం 5.కుంభీపాకం 6.కాలసూత్రం 7.అసిపత్రవనం 8.సూకరముఖం 9.అంధకూపం 10.క్రిమిభోజనం 11.సందంశం 12.తప్తసూర్మి 13.వజ్రకంటక శాల్మలి 14.వైతరణి 15.పుయోదం 16.ప్రాణవిరోధం 17.విశసనం 18.లాలాభక్షం 19.సారమేయాదనం 20.అవీచి 21.అయఃపానం 22.క్షారకర్దమం 23.రక్షోగణ భోజనం 24.శూలప్రోతం 25.దండశూకం 26.అవటనిరోధం 27.అపర్యావర్తనం 28.సూచీముఖం అనేవి.

## అజామిళోపాఖ్యానం

**పూ**ర్వం అజామిళుడనే బ్రాహ్మణుడు విధిగా వివాహం చేసుకుని, ఎంతో ధర్మబద్ధంగా గృహస్థాశ్రమ ధర్మాన్ని నిర్వర్తిస్తున్నాడు. ఒకనాడు అజామిళుడు కందమూలాల కోసం అడవికి వెళ్ళి అక్కడ బాగా మదించిన అందమైన స్త్రీని చూసాడు. స్వతహాగా ధర్మపురుషుడే అయినప్పటికీ అజామిళుడికి ప్రారబ్ధవశాన ఆ కులట స్త్రీ మీద మనసు కలిగింది. తన భార్యని పిల్లల్ని మరిచిపోయి, ఆ స్త్రీతోనే సంసారం చేయటం ప్రారంభించాడు. క్రమంగా అజామిళుడికి వార్ధక్యం వచ్చింది. కులట స్త్రీ వల్ల అతడికి ఒక కుమారుడు జన్మించాడు. వాడికి 'నారాయణ' అనే పేరుపెట్టి ఎంతో గారాబంగా పెంచి పెద్దచేసాడు.

కొంతకాలానికి అజామిళుడికి ఆయువు తీరే సమయం బాగా దగ్గర పడింది. అతన్ని నరకానికి తీసుకుపోవటానికి యమదూతలు వచ్చారు. వారిని చూసేసరికి భయంతో ఒక్కసారిగా 'నారాయణా' అని తన కుమారుణ్ణి పిలిచి చటుక్కున ప్రాణం వదిలాడు. నారాయణ నామాన్ని ఉచ్చరించటంతోనే పట్టు పీతాంబరాలు ధరించిన విష్ణుదూతలు అతన్ని తీసుకుపోవటానికి వచ్చారు.

ముందువచ్చిన యమభటులు అజామిళుణ్ణి తమ పాశాలతో లాగటం ప్రారంభించగా విష్ణుదూతలు వారిని వారించారు. అప్పుడు యమదూతలు అతడు చేసిన పాపాలన్నిటినీ వారిముందు ఏకరువు పెట్టారు. అంతా విన్న విష్ణుదూతలు వారితో "యమదూతలారా ఈ అజామిళుడు పూర్వం ఎన్నో పాపాలు చేసుండవచ్చు. తన పాపానికి తగిన ప్రాయశ్చిత్తాన్ని ఇతడు చేసుకున్నాడు. ధర్మశాస్త్రాలలో, పురాణాలలో చెప్పిన వ్రతాలు, నోములు ఆచరిస్తే అవి జీవుల పాపాల్ని పోగొడతాయేగానీ పూర్తిగా పాపవాసనని తొలగించలేవు. కేవలం శ్రీమన్నారాయణుడి సేవ, ఆయన నామోచ్చరణ మాత్రమే పాపపు వాసనల్ని సైతం సమూలంగా తొలగించగలవు. ఈ అజామిళుడు అంత్యకాలంలో నారాయణ నామస్మరణ చేసాడు. అందుకే ఇతడి పాపాలన్నీ నశించిపోయాయి. కనుక ఇతడు మీచేత దండించతగ్గవాడు కాదు. విడిచిపెట్టండి. ఇతన్ని మేము విష్ణులోకానికి తీసుకుపోతాం" అని వారితో అన్నారు. అదివిన్న యమదూతలు మారుమాట్లాడకుండా అజామిళుణ్ణి వారికే అప్పగించి తమలోకానికి వెళ్ళిపోయారు.

యమదూతలు తమలోకానికి వెళ్ళి జరిగిన వృత్తాంతమంతా యమధర్మ రాజుకి విన్నవించారు. వారి మాటలు విని "యమదూతలారా! మీరెప్పుడూ విష్ణుభక్తుల జోలికి, విష్ణుదూతల జోలికి పోకండి అని హెచ్చరించాడు.

## ప్రహ్లాద చరిత్ర

**శ్రీ**హరి పూర్వం యజ్ఞవరాహ అవతారాన్ని ధరించి భూదేవిని చాపలాచుట్టిన హిరణ్యాక్షుణ్ణి ఘోరంగా సంహరించాడు. తన సోదరుడి మరణానికి కారకుడైన శ్రీహరి మీద హిరణ్యకశిపుడు ఎంతో వైరాన్ని పెంచుకున్నాడు. శ్రీహరిని సంహరించే శక్తికోసం బ్రహ్మదేవుడి గురించి ఘోరమైన తపస్సు చేసాడు. బ్రహ్మ అతన్ని అనుగ్రహించి అపూర్వమైన వరాల్ని ప్రసాదించాడు. బ్రహ్మ వరగర్వంతో మదమెక్కిన హిరణ్యకశిపుడు అన్ని లోకాలవారినీ బాధలకి గురిచేస్తూ లోక కంటకుడుగా మారాడు. శ్రీహరిని

ఎలాగైనా వధించాలని పద్నాలుగు లోకాలూ వెతికాడు. అయితే శ్రీహరి అతడికి కనిపించలేదు. దుష్టుడైన ఆ హిరణ్యకశిపుడికి ఎంతో చిత్రంగా హరిభక్తుడైన ప్రహ్లాదుడు కుమారుడుగా జన్మించాడు. ఆ బాలుడు తల్లి గర్భంలో వున్నప్పుడే నారదుడి వల్ల శ్రీహరి లీలల్ని విని ఆయన మీద గాఢమైన భక్తిప్రపత్తులు పెంచుకున్నాడు. ప్రహ్లాదుడు హరిభక్తుడుగా వుండటం చూసిన హిరణ్యకశిపుడు, రాక్షసలోకంలో తనకి అవమానం జరుగుతుందని భావించి వెంటనే తన కుమారుణ్ణి విద్యాభ్యాసం కోసం గురుకులానికి పంపించేశాడు.

గురుకులానికి వెళ్ళినప్పటికీ అక్కడున్న గురువులకూ, తోటిపిల్లలకూ హరిభక్తి మహిమ గురించి వివరించేవాడు ప్రహ్లాదుడు. కొన్నాళ్ళకు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి ఇంటికి పిలిపించి "నాయనా! గురువుల దగ్గర ఏమేమి నేర్చుకున్నావు? చెప్పు అని గారాబంగా అడిగాడు. అప్పుడు ప్రహ్లాదుడు శ్రీహరి భక్తి, మహిమ గురించి, శ్రీహరి పాదసేవ గురించి తండ్రికి బోధించాడు. నారాయణ నామస్మరణే అన్నిటికన్నా గొప్పదని వివరించాడు.

ప్రహ్లాదుడి మాటలు విన్న హిరణ్యకశిపుడికి ఎంతో ఆగ్రహం కలిగింది. వెంటనే అతణ్ణి శిక్షించమని భటుల్ని పురమాయించాడు. భటులు ప్రహ్లాదుణ్ణి శూలాలతో పొడిచి, మంటల్లోకి తోసి, ఏనుగులతో తొక్కించి హింసించారు. అయితే శ్రీహరి నామస్మరణ చేస్తున్న ప్రహ్లాదుడికి ఏమాత్రం చిన్నగాయం కూడా కాలేదు. సహనం నశించిన హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి పిలిచి "ఓరీ కులనాశకా ఎంత చెప్పినా నీవు హరినామస్మరణ ఆపటంలేదు.

అసలా శ్రీహరి ఎక్కడున్నాడురా! అక్కడా, ఇక్కడా, ఎక్కడో చెప్పు ఈరోజు ఆ శ్రీహరికి నా చేతిలో చావు తప్పదు. చూపించు నిజంగా శ్రీహరే వుంటే నాకు చూపించు అని గట్టిగా గద్దించి భయపెట్టాడు. అతడి గర్జనలకు ఏమాత్రం చలించని ప్రహ్లాదుడు మహావిష్ణువు సర్వాంతర్యామి అని, ఇక్కడున్నాడు అక్కడలేడని కాదని ఎక్కడ చూడాలనుకుంటే అక్కడే వుంటాడని బదులిచ్చాడు. అదివిని ఆగ్రహంతో ఏదీ ఈ స్తంభంలో వున్నాడా అని అరుస్తూ

గట్టిగా తన చేతిలోని గదతో స్తంభాన్ని పగలగొట్టాడు. వెంటనే ఆ స్తంభంలోనుంచి నరసింహావతారాన్ని ధరించిన శ్రీమహావిష్ణువు ప్రళయభీకరంగా గర్జిస్తూ ఆవిర్భవించాడు. హిరణ్యకశిపుడు ఆ భీకరమూర్తిని ఆశ్చర్యంగా చూస్తూ నిశ్చేష్టుడైపోయాడు. నరసింహస్వామి ఒక్కసారిగా హిరణ్యకశిపుణ్ణి ఎత్తి తన తొడలమీదికి చేర్చి, అతడి కడుపుచీల్చి ప్రేగులు బైటికితీసి మహాఘోరంగా సంహరించాడు. ఆ తరువాత మహాభీకరంగా ఒక్కసారి గర్జించటంతో లోకాలన్నీ తల్లడిల్లిపోయాయి.

మహెూగ్రరూపంతో వున్న స్వామిని ఎవరూ చేరలేకపోయారు. దేవతలందరూ ఆయన్ని శాంతపరచటానికి స్తుతించటం ప్రారంభించారు. అయినా ఆయనలోని ఉగ్రత్వం ఏమాత్రం తగ్గలేదు. అప్పుడు బ్రహ్మదేవుడి సూచనతో భక్తప్రహ్లాదుడు నెమ్మదిగా స్వామి దగ్గరకి వెళ్ళి ఆయన పాదాలకి నమస్కరించాడు. అప్పుడు శాంతించాడు నరసింహస్వామి. నెమ్మదిగా తన మంగళకరమైన హస్తాన్ని ప్రహ్లాదుడి తలమీదుంచి ఆశీర్వదించాడు. ఎంతో సంతోషంతో ప్రహ్లాదుడు నరసింహస్వామిని గొప్పగా స్తుతించగా, ఆయన ఎన్నో వరాల్ని ప్రహ్లాదుడికి ప్రసాదించాడు.

## గజేంద్ర మోక్షణం

**పూ**ర్వం ఇంద్రద్యుమ్నుడనే మహారాజు పాండ్యదేశాన్ని పాలిస్తుండేవాడు. ఆయన పరమ భాగవతోత్తముడు. ఆ రాజు ఒకనాడు చందన పర్వతం మీద కూర్చుని శ్రీమన్నారాయణుడి గురించి తపస్సు చేయసాగాడు. ఆ సమయంలో అగస్త్యమహర్షి అక్కడికి వచ్చాడు. తీవ్రంగా తపోదీక్షలో మునిగిపోయిన ఇంద్రద్యుమ్నుడు మహర్షిరాకను గమనించలేదు. అగస్త్యుడికి కోపం వచ్చింది. తను వచ్చినప్పటికీ ఏమాత్రం పట్టించుకోకుండా నిర్లక్ష్యంగా వ్యవహరించిన ఇంద్రద్యుమ్నుణ్ణి 'ఏనుగుగా మారు' అని శపించి వెళ్ళిపోయాడు. తరువాత జన్మలో ఇంద్రద్యుమ్నుడు గజేంద్రుడుగా జన్మించి పాలసముద్రం మధ్యలో వున్న త్రికూట పర్వతం మీద హాయిగా తన ఆడఏనుగులతో కలిసి విహరించ సాగాడు. గజేంద్రుడు ఆ ప్రాంతంలో వున్న అన్ని ఏనుగులకన్నా గొప్పవాడు.

ఒకనాడు ఎండతీవ్రత తట్టుకోలేక గజేంద్రుడు త్రికూట పర్వతం మీదున్న ఒక పెద్ద సరోవరం దగ్గరకు వెళ్ళాడు. తన ప్రియురాళ్ళతో కలిసి ఆ సరోవరంలోకి దిగి హాయిగా తాపాన్ని చల్లార్చుకుంటున్నాడు. అదే సరోవరంలో హూహూ అనే ఒక గంధర్వుడు దేవలుడనే మహర్షి శాపంతో పెద్దమొసలిగా మారి నివసిస్తున్నాడు.

గజేంద్రుడు సరస్సులో విహరిస్తుండగా అందులో వున్న మొసలి ఒక్కసారిగా అతడి కాలు పట్టుకుంది. దాంతో గజేంద్రుడు భీకరంగా అరిచాడు. అతనితో వచ్చిన ఆడ ఏనుగులన్నీ పారిపోయాయి. గజేంద్రుడు మొసలి పట్టుకి చిక్కి ఏమాత్రం కదల్లేక తన శక్తినంతా కూడ దీసుకుని దానితో ఎన్నో వేలసంవత్సరాలు పోరాడాడు. ఏమాత్రం ఫలితం లభించలేదు. ఇక తనశక్తి చాలదని గ్రహించిన గజేంద్రుడు అన్యధాశరణం నాస్తి త్వమేవ శరణం మమ అంటూ పరమాత్మను దీనాతి దీనంగా ప్రార్థించాడు.

గజేంద్రుడు చేసిన నిర్గుణ పరబ్రహ్మ స్తోత్రాన్ని విని దేవతలందరూ అది తమ గురించి చేసిందికాదని భావించి ఎవరూ అతన్ని రక్షించటానికి వెళ్ళలేదు. అయితే సకలప్రాణులలో ఆత్మస్వరూపుడిగా వున్న శ్రీహరి తానే సగుణ నిర్గుణ పరబ్రహ్మ కాబట్టి గజేంద్రుడి మొర ఆలకించి హుటాహుటిన అతడి దగ్గరకి వచ్చాడు. తన దివ్య సుదర్శన చక్రాన్ని ప్రయోగించి గజేంద్రుణ్ణి పట్టుకున్న మొసలిని సంహరించగా, శాపవశాత్తు మొసలిరూపంలో వున్న గంధర్వుడికి శాపవిమోచనం జరిగింది. యథారూపాన్ని పొందిన గంధర్వుడు శ్రీహరికి నమస్కరించి తన లోకానికి వెళ్ళిపోయాడు.

ఇక్కడ మొసలిపట్టు నుంచి విడిచిపెట్టబడ్డ గజేంద్రుణ్ణి సరస్సులోనుంచి ఒడ్డుమీదకు లాగి, ప్రేమగా అతన్ని నిమిరాడు శ్రీహరి. ఆయన కరస్పర్శతో గజేంద్రుడికి సకలబాధలు ఉపశమించాయి. ఆనందంగా ఘీంకరిస్తూ శ్రీహరికి తన కృతజ్ఞతలు తెలిపి, తన పాపాలన్నీ తొలగిపోగా చివరికి

సారూప్యముక్తిని పొందాడు. ఈ గజేంద్రమోక్షం గాథని ప్రతిరోజూ వినేవారికి, సకలబాధలు తొలగిపోయి సుఖసంతోషాలు లభిస్తాయి. ఈ ఐతిహ్యమంతా చతుర్ధ మన్వంతరంలో జరిగింది.

## అంబరీషోపాఖ్యానం

**వై**వస్వతమనువుకు నభగుడనే కుమారుడున్నాడు. ఆ నభగుడి కుమారుడు 'నాభాగుడు'. ఆ నాభాగుడికి అంబరీషుడనే పుత్రుడు జన్మించాడు. అతడు పరమ భాగవతుడు. సప్తద్వీపాలతో వున్న ఈ సమస్త భూమండలాన్నీ జనరంజకంగా పాలిస్తున్నాడు. తన రాజ్యంలో విష్ణు భక్తులందర్నీ ఎంతో ప్రేమగా చూస్తూ, సాధువుల మీద, సత్పురుషుల మీద ఎంతో భక్తిశ్రద్ధలు కనబరిచేవాడు. అంబరీషుడు ఎప్పుడూ శ్రీహరి కథల్ని శ్రవణం చేస్తూ ఆయన లీలల్ని గానంచేస్తూ ఎన్నో వైష్ణవ యజ్ఞయాగాల్ని నిర్వహించాడు. అతడి అచంచలమైన భక్తిశ్రద్ధలకి ఎంతో సంతోషించిన శ్రీహరి తన దివ్య సుదర్శనచక్రాన్ని అంబరీషుడికి రక్షణగా వుంచాడు.

ఒకనాడు అంబరీషుడు ద్వాదశి ఘడియల్లో విష్ణువును పూజిస్తుండగా, దుర్వాస మహర్షి అక్కడికి అతిథిగా వచ్చాడు. అంబరీషుడు ఆయనకి సకలమర్యాదలూ చేసి భోజనాన్ని సిద్ధపరిచాడు. అయితే దుర్వాసుడు తన నిత్యకర్మల్ని ఆచరించి వస్తానని చెప్పి దగ్గర్లో వున్న యమునానది దగ్గరకు వెళ్ళాడు. వెళ్ళిన దుర్వాసుడు ఎంతసేపటికీ తిరిగి రావటంలేదు. ఇక్కడ ద్వాదశిఘడియలు సమీపిస్తున్నాయి. ఉపవాసదీక్షలో వున్న అంబరీషుడు వ్రతనియమంలో భాగంగా అక్కడున్న బ్రాహ్మణుల సూచనమేరకు శ్రీహరి పాదతీర్థాన్ని పుచ్చుకున్నాడు. సరిగ్గా అదే సమయానికి అనుష్ఠానాన్ని ముగించుకుని తిరిగి వచ్చిన దుర్వాసుడు, అంబరీషుడు తాను రాకుండా తీర్థం స్వీకరించి తనని అవమానపరిచాడని ఆగ్రహించాడు. వెంటనే తన జటను లాగి దానినుంచి ఒక 'కృత్య' అనే శక్తిని సృష్టించి అంబరీషుడి మీదకి ప్రయోగించాడు.

మహాభయంకర రూపంతో అగ్నిజ్వాలలు వెదజల్లుతూ అంబరీషుడి ముందుకు వచ్చింది కృత్య. అయితే అంబరీషుడు దాన్ని చూసి ఏమాత్రం చలించలేదు. శ్రీహరి అతడికి రక్షణగా వుంచిన సుదర్శనచక్రం ఈ విషయాన్ని గమనించింది. వెంటనే ఆ కృత్యని దహించి, దాన్ని ప్రయోగించిన దుర్వాసుడి వెంటపడింది. దాంతో భయపడ్డ దుర్వాసుడు సుదర్శనచక్రం బారినుంచి తప్పించుకోవటానికి పరుగెత్తాడు. అన్ని లోకాలూ తిరిగాడు. చక్రం అతన్ని వదలలేదు. తరుముతూనే వుంది. దుర్వాసుడు బ్రహ్మలోకానికీ, కైలాసానికి వెళ్ళి బ్రహ్మ ఈశ్వరులకు మొరపెట్టుకోగా వారు తామేమీ చేయలేమని, వెళ్ళి శ్రీహరినే శరణువేడుకోమని చెప్పి పంపేశారు. అక్కణ్ణుంచి సరాసరి వైకుంఠానికి చేరి మహావిష్ణువుని శరణు వేడుకున్నాడు.

శ్రీహరి దుర్వాసుడితో "మహర్షీ! నేను భక్తులకు దాసుణ్ణి. ఎలాంటి తపస్వికైనా శాంతగుణమే అలంకారంగా వుంటుంది. ఈ చక్రాన్ని నేను కూడా ఉపసంహరించలేను. నీవు వెళ్ళి అకారణంగా కృత్యను ప్రయోగించడం వల్ల ఇబ్బందిపడిన ఆ అంబరీషుణ్ణే శరణువేడుకో" అని చెప్పి పంపాడు. అది విని దుర్వాసుడు పరుగుపరుగున అంబరీషుడి దగ్గరకి వచ్చి క్షమించమని ప్రార్థించాడు. ఎంతో శాంతిమంతుడైన అంబరీషుడు భక్తితో ఒక్కసారి సుదర్శనచక్రాన్ని ప్రార్థించాడు. అంతే సుదర్శనచక్రం పూర్తిగా శాంతించి దుర్వాసుణ్ణి వదిలి వెళ్ళిపోయింది. హమ్మయ్య! గండం గడిచింది అని ఎంతో సంతోషంతో దుర్వాసుడు అంబరీషుడి గొప్పతనాన్ని పొగిడి ఘనంగా ఆశీర్వదించి తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళిపోయాడు. అంబరీషుడు యథావిధిగా విష్ణు నామస్మరణ చేస్తూ నారాయణుడినే ఉపాసిస్తూ చివరికి ముక్తిని పొందాడు.

## శ్రీకృష్ణావతారం

**శ్రీ**మహావిష్ణువు దేవాసుర సంగ్రామాలలో ఎంతోమంది అసురుల్ని సంహరించాడు. వారిలో కొంతమంది అసురులు కర్మశేషం అనుభవించటానికి భూలోకంలో జన్మించి ఎన్నో అకృత్యాలు చేస్తున్నారు. వారి బాధలు భరించలేక

భూదేవి బ్రహ్మ దగ్గరకు వెళ్ళి మొరపెట్టుకుంది. బ్రహ్మ భూదేవిని, ఇతర దేవతలందరినీ తీసుకుని క్షీరసాగరంలో శేషతల్పం మీద శయినించిన నారాయణుడి దగ్గరకు వెళ్ళాడు. అందరూ వచ్చిన విషయాన్ని ఆయనకి విన్నవించారు. అంతా విన్న శ్రీహరి వారిని ఊరడించి "దేవతలారా భూలోకంలో రాక్షసాంశతో జన్మించిన వారి అకృత్యాలు పెరిగిపోయాయని గ్రహించాను. వారందరినీ సంహరించటానికి నేను యదువంశంలో అవతరిస్తాను. మీరు కూడా మీ మీ అంశలతో యాదవకులంలో జన్మించండి" అని పలికాడు. అందరూ అలాగే చేస్తాం అని బదులిచ్చి తమతమ స్థానాలకు వెళ్ళిపోయారు.

శూరసేన మహారాజు కుమారుడైన వసుదేవుడు, మధురానగరంలో వున్న దేవకుడి కుమార్తె దేవకీదేవిని వివాహం చేసుకున్నాడు. దేవకీదేవికి అన్న కంసుడు. తొలిరోజుల్లో కంసుడు తన చెల్లెల్ని బావగారినీ ఎంతో గౌరవంగా చూసుకునేవాడు. అయితే ఒకనాడు ఆకాశవాణి అతన్ని ఇలా హెచ్చరించింది. "ఓయీ కంసా" నీ సోదరికి ఎనిమిదోగర్భాన ఉదయించిన శిశువు చేతిలో నీవు మరణిస్తావు జాగ్రత్త" అంది. ఆ మాట వినగానే ఆగ్రహంగా దేవకీదేవిని చంపబోయాడు కంసుడు. అదిచూసి కంసుడి కాళ్ళమీద పడ్డాడు వసుదేవుడు. అయినా కంసుడికి కనికరం కలగలేదు.

అప్పుడు వసుదేవుడు దీనంగా "మహారాజా నాకు పుట్టిన ప్రతిశిశువునీ నీకు తెచ్చి అప్పగిస్తాను" అని చెప్పటంతో శాంతించి చెల్లెల్ని వదిలిపెట్టాడు. కొంతకాలానికి దేవకీదేవికి మొదటి సంతానం కలిగింది. అన్నమాట ప్రకారం ఆ శిశువుని తీసుకెళ్ళి కంసుడికి అప్పగించాడు వసుదేవుడు. అయితే ఎనిమిదో శిశువు వల్ల కదా తనకు ప్రమాదం అని అనుకున్న కంసుడు దయతో ఆ పిల్లవాణ్ణి చంపకుండా వదిలిపెట్టాడు. కాలం అలా సాగుతోంది.

ఒకనాడు నారదమహర్షి కంసుడి దగ్గరకొచ్చి "కంసా! నీ కులంలో అందరూ రాక్షసాంశతోనే జన్మించారు. యాదవకులంలోని వాళ్ళంతా దైవాంశతో ఆవిర్భవించారు. నీకు తెలియని విషయమేమిటంటే? పూర్వం దేవతల ప్రార్థన

విని శ్రీమహావిష్ణువు యాదవకులంలో అవతరించి నిన్ను సంహరిస్తానని వారికి మాటిచ్చాడు జాగ్రత్త" అని చెప్పాడు. నారదుడి మాటవిని కంసుడికి భయం కలిగింది. తన చెల్లెలు దేవకీదేవికి పుట్టిన శిశువులందరినీ పుట్టినవారిని పుట్టినట్టే చంపేశాడు. దేవకీదేవి ఏడోసారి గర్భాన్ని ధరించింది. శ్రీహరి యోగమాయను పిలిచి దేవకి గర్భంలోని శిశువును తీసుకెళ్ళి యమునానదికి అవతల నందవ్రజంలో వున్న రోహిణీదేవి గర్భంలో ప్రవేశపెట్టమని చెప్పాడు. రోహిణీదేవి వసుదేవుడి మరోభార్య. రోహిణీ గర్భాన జన్మించినవాడు బలరాముడు. తరువాత దేవకీదేవి తిరిగి ఎనిమిదోసారి గర్భాన్ని ధరించింది. శ్రీహరి తాను దేవకీగర్భాన జన్మించాలని భావించి ఆమె గర్భంలో ప్రవేశించాడు. అంతకుముందే యోగమాయను పిలిచి నందుడి భార్య యశోదాదేవి గర్భంలో ఆమెను ప్రవేశించమని ఆజ్ఞాపించాడు.

పరమాత్మ గర్భంలో వుండటంతో దేవకీదేవి ఎంతో దివ్యంగా ప్రకాశించ సాగింది. ఒకనాడు కంసుడు చెరసాలకి వచ్చి దేవకీదేవి వెలిగిపోతుండటాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. ఇప్పుడీమెకి ఎనిమిదో గర్భం. తప్పకుండా ఇప్పుడు పుట్టేవాడు నన్ను సంహరిస్తాడని తలచాడు. వెంటనే ఆమెని చంపుదామని అనుకున్నాడు. అంతలోనే తమాయించుకుని పోనీలే దేవకీదేవి తన చెల్లెలే కదా! ఆమెతో ప్రమాదమేముంది ఆమె బిడ్డతోనే కదా! పుట్టనీ! అప్పుడా బిడ్డనే చంపి నా భయాన్ని పోగొట్టుకుంటా! అని భావించి ఆ ప్రయత్నాన్ని విరమించాడు. దేవకీదేవి గర్భాన పరమాత్మ ఉదయించబోతున్నాడని తెలిసి దేవతలంతా ఆ దంపతులుండే చెరసాలకి వచ్చి నారాయణుణ్ణి ఎంతో భక్తిగా ప్రార్థించారు. ఆ దంపతుల్ని ఆశీర్వదించి తమ లోకాలకి వెళ్ళిపోయారు.

జన్మ అన్నదే లేని పరమాత్మ భూమి మీద అవతరించే సమయం ఆసన్నమైంది. గ్రహాలు నక్షత్రాలన్నీ సమస్థితిలో వున్నాయి. అది అష్టమి తిథి. గంధర్వులు మంగళకరంగా గానం చేస్తుండగా, అప్సరసలు ఆనందంగా నృత్యాలు చేస్తుండగా, దేవకీదేవి గర్భం నుంచి పరమాత్మ కోటిసూర్యుల

కాంతితో ఉదయించాడు. అప్పుడే పుట్టిన ఆ శిశువు చతుర్భుజాలతో, శంఖ, చక్ర, గదా, పద్మాలతో కిరీటకుండల కౌస్తుభ మణిహారాలు ధరించి దివ్యతేజస్సుతో వెలిగిపోతూ నీలమేఘ ఛాయతో ఆ దంపతులకి దర్శనమిచ్చాడు. ఆ దివ్యమంగళాకారాన్ని దర్శించి తన్మయుడైపోయిన వసుదేవుడు భక్తిగా ఆ శిశువుకి నమస్కరించాడు. ఎన్నో విధాలుగా స్వామిని స్తుతించి, "స్వామీ! నీ దివ్యరూపాన్ని ఉపసంహరించుకో, కంసుడు నీ అన్నలందరినీ సంహరించాడు. అందుకే నేనిలా కోరుతున్నా అని ప్రార్థించాడు.

దేవకీదేవి కూడా తన కుమారుడి దివ్యలక్షణాలు చూసి ఎంతో ఆనందించి భక్తితో స్తుతించింది. "నాయనా! నాకు పుట్టిన బిడ్డలందరినీ కంసుడు సంహరించాడు. నీవైనా ఎలాగో తప్పించుకో తండ్రీ అని కోరింది. అప్పుడు పరమాత్మ వారితో "పుణ్యదంపతులారా మీకు నేను పూర్వజన్మలో పృశ్నిగర్భుడుగా, వామనుడుగా జన్మించాను. ఇప్పుడు మీ కోరిక మేరకు తిరిగి మీ కుమారుడుగా పుట్టాను. నన్ను కేవలం మీ పుత్రుడిగా కాకుండా పరబ్రహ్మగా భావించి ధ్యానించండి. ఇక మీకు జన్మలుండవు మోక్షం లభిస్తుంది" అని చెప్పి తిరిగి సాధారణ బాలుడిలా మారిపోయాడు.

తరువాత శ్రీహరి ప్రేరణతో వసుదేవుడు తన కుమారుణ్ణి నందగోపుడి ఇంటికి తీసుకువెళ్ళి యశోదాదేవి పక్కలో పడుకోబెట్టాడు. అలాగే యశోదాదేవి పక్కలో వున్న స్త్రీ శిశువుని (యోగమాయ) తీసుకొచ్చి దేవకీదేవి పక్కలో వుంచాడు. ఈ తతంగమంతా జరుగుతున్నప్పుడు యోగమాయా ప్రభావంతో అందరూ గాఢనిద్రలో వున్నారు. వసుదేవుడున్న చెరసాల తలుపులు తమంత తామే తెరుచుకున్నాయి. యమునానది కూడా దారిచ్చింది. స్వామిని గోకులానికి రహస్యంగా తీసుకు వెళ్తున్నప్పుడు దారిలో కురిసిన వర్షానికి అడ్డుగా ఆదిశేషుడు తన వేయి పడగల్నీ గొడుగులా వుంచాడు.

మర్నాడు ఉదయం కంసుడికి దేవకీదేవి ప్రసవించిందన్న వార్త తెలిసింది. వెంటనే చెరసాల దగ్గరకి వచ్చాడు. చూస్తే ఆడశిశువు ఎంతో ఆందోళనతో వెంటనే ఆ శిశువుని లాక్కుని బలంగా నేలకేసి కొట్టాడు. అయితే

ఆ శిశువుకి ఏమీ కాలేదు. ఒక్కసారి నేలమీద నుంచి పైకి ఎగిరి ఆకాశంలో నుంచుని ఎనిమిది భుజాలతో ఎనిమిది ఆయుధాల్ని ధరించి యోగమాయగా ప్రకాశించింది. "ఓయీ కంసా! నన్ను చంపటం వల్ల నీకేం ప్రయోజనం లేదు. నీ చావు నా చేతిలో లేదు. నిన్ను చంపేవాడు ఎక్కడో వుంటాడు" అని హెచ్చరించి అదృశ్యమైపోయింది. ఆనాటి ఆ యోగమాయ తరువాత భూలోకంలోని ఎన్నో దివ్యక్షేత్రాల్లో శక్తిస్వరూపిణిగా వెలసింది.

అక్కడ గోకులంలో నందగోపుడి ఇంట్లో యశోదాదేవికి మగపిల్లాడు పుట్టాడని అందరూ ఆనందించారు. సంబరాలు చేసుకున్నారు. గోకులమంతా సంతోషంతో చిందులేసింది. నల్లకలువలా ముగ్ధమనోహరంగా వున్న శిశువుని చూసి యశోదాదేవి ఎంతో ఆనందించి తన్మయత్వంతో తన స్తన్యమిచ్చింది. ఆమె జన్మ ధన్యమయ్యింది. నందగోపుడు తనకు కుమారుడు కలిగాడని ఆనందించి ఎన్నో దానధర్మాలు చేసాడు.

## శ్రీకృష్ణ నామకరణం

**గో**కులంలో యశోదా నందనుడుగా పెరుగుతున్న పరమాత్మకు నామకరణ మహోత్సవం చేయటం కోసం గర్గమహర్షి వచ్చాడు. నందుడు ఆయన్ని సాదరంగా ఆహ్వానించి సముచితమైన మర్యాదలు చేసి, తన కుమారుడికి నామకరణ చేయమని కోరాడు. నందుడి సత్కారాలు అందుకున్న గర్గమహర్షి "నాయనా! నందగోపా! నేను మీ యదువంశానికి కులగురువును. నీ కుమారుడికి జాతకర్మ తప్పకుండా జరిపిస్తా. ఇది నా బాధ్యత. అయితే ఇదిచాలా రహస్యంగా జరగాలి సుమా! తగిన ఏర్పాట్లు చేయి" అని పనులు పురమాయించాడు.

ఎలాంటి ఆడంబరం లేకుండా నందగోపుడు గర్గుడు పెట్టిన ముహూర్తానికి అన్ని ఏర్పాట్లూ చేసాడు. అప్పుడు గర్గమహర్షి అనంతమైన నామాలున్న పరమాత్మకు ఏపేరు పెట్టాలి అని ఆలోచించి 'కృష్ణ' అనే పేరుపెట్టాడు. కృష్ణ అంటే? 'కృష్' అనే ధాతువు మీద 'ణ' అనే ప్రత్యయం

చేరిస్తే కృష్ణ అవుతుంది. ఈ కృష్ణ శబ్దానికి పరిపూర్ణమైన ఉనికి, సంపూర్ణమైన ఆనందం అని అర్థం. అలాగే లోకంలోని సకలజీవుల పాపాల్ని నశింప చేసేవాడని మరొక అర్థం. అలాగే గర్గమహర్షి కృష్ణుడి అన్నకి (రోహిణీ కుమారుడికి) బలరాముడనే పేరుపెట్టాడు. ఆయనకు శ్రీకృష్ణుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అని తెలుసు. అయినప్పటికీ ఆ రహస్యాన్ని దాచివుంచి నందగోపుడికి కృష్ణుడు మానవాతీత శక్తి కలిగినవాడని సూచన ప్రాయంగా తెలియచేసాడు.

## విశ్వరూప దర్శనం

**ఒ**కసారి కృష్ణుడు యశోదాదేవి ఒడిలో పడుకుని పాలు తాగుతూ నెమ్మదిగా ఆవులించాడు. అప్పుడు యశోద కృష్ణుడి నోటిలో సకల విశ్వాన్నీ దర్శించింది. అయితే అదేదో భ్రమ అని భావించి మరిచిపోయింది. మరి కొన్నాళ్ళు గడిచాక కృష్ణుడు సహచరులతో కలిసి ఆడుకుంటూ వారు తెచ్చుకున్న పళ్ళలో కొన్ని పళ్ళని రహస్యంగా దాచిపెట్టాడు. కృష్ణుడు సరదాగా చేసిన ఆ పనికి కోపం వచ్చిన బాలకులు యశోదాదేవి దగ్గరకి వెళ్ళి "అమ్మా నీ కృష్ణుడు మట్టి తింటున్నాడు. మా పళ్ళు దొంగతనం చేసాడు" అని చాడీలు చెప్పారు. యదార్థం తెలియని యశోదాదేవి కృష్ణుడు మట్టి తిన్నాడని వినేసరికి భయంతో కృష్ణుణ్ణి పిలిచి "కన్నయ్యా! మట్టితిన్నావా నిజమేనా! అని ప్రశ్నించింది. 'లేదమ్మా వాళ్ళంతా నీకు అబద్ధం చెప్పారు" అన్నాడు అమాయకంగా కృష్ణుడు.

ఏదీ నోరుతెరు చూపించు అని అడిగింది యశోద. కృష్ణుడు నెమ్మదిగా నోరు తెరిచాడు. లోపలికి చూసిన యశోదాదేవికి ఒక్కసారిగా ఒళ్ళు జలదరించింది. పద్నాలుగు లోకాలూ ఆమెకి కనిపించాయి. దేవతలు, దానవులు, పశువులు, పక్షులు, సముద్రాలు, నక్షత్రాలు, సూర్యచంద్రులు, మహాపర్వతాలు ఇలా సకల ప్రపంచం ఆమెకి కనిపించింది. అంతేకాదు క్షీరసాగరంలో శేషతల్పం మీద శయనించిన నారాయణుడు దర్శనమిచ్చాడు. ఆ ప్రపంచంలోనే కృష్ణుడు కూడా నోరు తెరుచుకుని నుంచున్నట్టుగా ఆమెకి కనిపించాడు. ఇలా కృష్ణుడి నోటిలో సమస్తాన్నీ యశోదాదేవి దర్శించి

తరించింది. ఆమెకు తన కుమారుడు సాక్షాత్తు భగవంతుడే అని అనిపించింది. అంతే ఒక్క క్షణంలో ఆమెకి మాయ కమ్మేసింది. కృష్ణుడు అమ్మా! పాలివ్వవా అన్న మాటతో ఈ లోకంలోకి వచ్చింది. తాను చూసిందంతా మర్చిపోయింది. ఆవిధంగా కృష్ణపరమాత్మ తన విశ్వరూపాన్ని యశోదాదేవికి చూపి ఆమె జన్మను చరితార్థం చేసాడు.

## బాలకృష్ణుడు - దుష్టశిక్షణ

**కృ**ష్ణుడు బాలుడుగా వున్నప్పుడు ఎందరో రాక్షసులు ఆయన్ని సంహరించాలని చూసారు. అయితే లీలామానుష విగ్రహుడైన కృష్ణుడి చేతిలోనే వారందరూ చచ్చి మోక్షాన్ని పొందారు. పూతన సంహారంతో కృష్ణుడి దుష్టశిక్షణా కార్యక్రమం మొదలయ్యింది. తరువాత బండిరూపంలో తనను చంపటానికి వచ్చిన శకటాసురుణ్ణి పరిమార్చాడు. సుడిగాలి రూపంలో వచ్చి మట్టుబెట్టాలని ప్రయత్నించిన 'తృణావర్తుణ్ణి' చంపేశాడు. ఒకనాడు తాను పశువుల్ని మేపుతూ సంచరిస్తుండగా గోవు రూపంలో వచ్చిన వత్సాసురుణ్ణి, కొంగ రూపం ధరించి తనను చంపాలని ప్రయత్నించిన బకాసురుణ్ణి అవలీలగా వధించాడు. తరువాత కొండచిలువ రూపంతో తనను కబళించబోయిన అఘాసురుణ్ణి సంహరించి తనలో కలిపేసుకున్నాడు. తాళవనంలో ధేనుకాసురుడనే రాక్షసుణ్ణి, గోపబాలకుడి వేషంలో వచ్చిన ప్రలంబాసురుడనే వాణ్ణి అన్న బలరాముడితో చంపించాడు.

## కాళీయ మర్దనం

**పూ**ర్వం, 'సౌభరి' అనే మహర్షి యమునానదిలో కూర్చుని 12 సంవత్సరాలు తపస్సు చేసాడు. మహర్షికి ఆ నదిలో వున్న అందమైన చేపలతో సాన్నిహిత్యం ఏర్పడింది. ఒకనాడు గరుత్మంతుడు యమునానదిలో సంచరిస్తున్న చేపల్ని చూసి ఆకలిగా వుండటంతో వాటిని తీసి తినటం ప్రారంభించాడు. అవి సౌభరి మహర్షితో సాన్నిహిత్యం వున్న చేపలు. మహర్షి గరుత్మంతుడు చేపల్ని తినటం చూసి ఎంతో ఆగ్రహించి "ఓయీ! గరుత్మంతా! ఇక నుంచి నీవు ఈ నదిలో వున్న చేపల్నిగానీ మరే జీవినిగానీ చంపితే చస్తావు" అని

శపించాడు. ఆ కాలంలో కాళీయుడనే గొప్ప సర్పరాజుండేవాడు. ఒకనాడు గరుత్మంతుడికి ఎవరో బలిగా సమర్పించిన ఆహారాన్ని కాళీయుడు తినేశాడు. అది తెలిసి కోపం వచ్చిన గరుత్మంతుడు ఒక్కసారి గట్టిగా తన రెక్కల్ని అల్లార్చగా కాళీయుడు ఎగిరి గరుత్మంతుడు ప్రవేశించలేని యమునా నదిలోకి వచ్చిపడ్డాడు.

మహా కాలకూట విషంతో సంచరించే కాళీయుడు యమునలో చేరటంతో అతడి విషప్రభావానికి నదిలో నీళ్ళన్నీ నల్లగా మారిపోయాయి. తీరంలో వున్న చెట్లన్నీ ఎండిపోయాయి. ఆ నది మీద సంచరించే పక్షులన్నీ విలవిలలాడుతూ కిందపడి చచ్చిపోయాయి. ఆ సమయంలో శ్రీకృష్ణ బలరాములు గోపబాలకులతో కలిసి ఆవుల్ని వేపటానికి యమునాతీరంలో వున్న పెద్దపెద్ద తోటల్లోకి వచ్చారు. అది వేసవికాలం దాహం పెరిగిపోవటంతో కొంతమంది గోపబాలకులు, కొన్ని గోవుల్ని తీసుకుని యమునానదికి వెళ్ళి నీళ్ళు తాగారు. అంతే కళ్ళు తిరిగి ప్రాణాలు కోల్పోయి నేలమీద పడిపోయారు. ఆ విషయం గమనించిన కృష్ణుడు వారిమీద తన అమృతమయమైన చూపుల్ని ఒక్కసారి ప్రసరింపచేసాడు. అంతే గోవులు, గోపబాలకులు నిద్ర నుంచి లేచినట్టు పైకి లేచారు.

గోపాలురు గోవులు మృత్యువాత పడటానికి కాళీయుడే కారణమని తెలుసుకున్నాడు కృష్ణుడు. అతడి గర్వాన్ని అణచాలని నిశ్చయించుకుని ఒకనాడు యమునానది దగ్గరకి వచ్చాడు. ఒడ్డున వున్న కడిమి చెట్టుపైకి ఎక్కి సుడులు తిరుగుతున్న యమునానదిలోకి ఒక్కసారిగా దూకాడు. మహావేగంతో కృష్ణుడు దూకగానే ఆ నదిలో నీళ్ళన్నీ చెల్లాచెదురైపోయాయి. భయంకరమైన శబ్దం వినిపించింది. ఆ శబ్దం విని రెచ్చిపోయిన కాళీయుడు నీటిఅడుగు నుంచి హఠాత్తుగా పైకి వచ్చాడు. వేలకొద్దీ వున్న తన పడగలతో విషజ్వాలలు వెళ్ళగక్కుతూ శ్రీకృష్ణుణ్ణి సమీపించాడు.

భయంకరమైన శిఖరాలతో ఎత్తుగా కాటుక పర్వతంలా వున్న కాళీయుణ్ణి చూసాడు శ్రీకృష్ణుడు. కాళీయుడు తన భయంకరమైన కోరలతో

శ్రీకృష్ణుణ్ణి కాటేసాడు. అయినా ఆయనకి ఏంకాలేదు. దాంతో కోపం వచ్చిన కాళీయుడు కృష్ణుణ్ణి గట్టిగా చుట్టుకున్నాడు. కృష్ణుడితో బాటు నదీతీరానికి వచ్చిన గోవులకు గోపబాలకులకు కృష్ణుడు కనిపించలేదు. వారంతా ఘొల్లున విలపించసాగారు. అక్కడ రేపల్లెలో కూడా ఎన్నో దుశ్శకునాలు కనిపించాయి. అవి చూసి నందుడు మిగిలిన గోపకుల పెద్దలూ పరుగున యమునాతీరానికి వచ్చారు. అందరూ కృష్ణుడు కనపడక ఆందోళన చెందుతున్నారు. అంతలో చిరునవ్వులు చిందిస్తూ కాళీయుడి పడగమీదకెక్కిన కృష్ణుడు వారికి కనిపించాడు.

తన మృదువైన పాదాలతో కృష్ణుడు కాళీయుడి పడగల మీద నృత్యం చేయటం ప్రారంభించాడు. ఆ నృత్య విన్యాసాల్ని చూసి ఒడ్డున వున్న వారంతా ఎంతో ఆశ్చర్యపోయారు. తీవ్రంగా నృత్యం చేస్తున్న కృష్ణుడి పదఘట్టనలకు కాళీయుడు తట్టుకోలేకపోయాడు. క్రమక్రమంగా పైకిలేపిన తన ఒక్కొక్క పడగనూ క్రిందకు దించటం ప్రారంభించాడు కాళీయుడు. వాలిన పడగల నుంచి రక్తం ధారలుగా కారటం ప్రారంభమైంది. ఆ రక్తంతో నదిలో నీరంతా ఎర్రగా మారిపోయింది.

అలా కాళీయుడు ప్రాణాపాయ స్థితికి చేరుకోవటంతో అతడి భార్యలు కృష్ణుడి పాదాలమీద పడి శరణు వేడుకున్నారు. తప్పు తెలుసుకున్న కాళీయుడు కూడా శరణు కోరుకోవటంతో కృష్ణుడు అతణ్ణి మన్నించాడు. “ఓ కాళీయా! నీవు ఈ యమునానదిని వదిలి సముద్రం మధ్యలో వున్న రమణకద్వీపానికి వెళ్ళి నివసించు. నీవక్కడ వుంటే గరుత్మంతుడు నిన్నేమీ చేయడు” అని అనటంతో కాళీయుడు తన భార్యల్ని తీసుకుని రమణక ద్వీపానికి వెళ్ళిపోయాడు.

## గోపికా వస్త్రాపహరణం

**శ్రీ**కృష్ణుడి మీద గోకులంలో వున్న గోపికలందరికీ వల్లమాలిన ప్రేమ, ఆరాధన. ఆ గోపికలంతా నిత్యం శ్రీకృష్ణుణ్ణి సేవించాలని, ఆయనతో కలిసి ఆనందించాలని కోరుకునేవారు. తమ కోరిక తీరటానికి వారంతా యమునా నదీతీరానికి చేరుకుని ఇసుకతో కాత్యాయనీ దేవి ప్రతిమను తయారు చేసుకుని

రోజూ ఆమెను ఆరాధించసాగారు. 'నీవే భర్త కావాలని నీతోనే నిత్యం గడపాలని', దృఢమైన దీక్షతో నియమనిష్ఠలతో నెలరోజులు కాత్యాయనీ వ్రతాన్ని చేసారు. దానితో శ్రీకృష్ణుడికి వారిమీద దయ కలిగింది. వారిని అనుగ్రహించాలని యమునాతీరానికి వచ్చాడు. ఆ సమయంలో కాత్యాయనీ వ్రతాన్ని ముగించిన గోపికలు తమ వస్త్రాలన్నీ ఒక గట్టుమీద వేసి నగ్నంగా నదిలోకి దిగి స్నానం చేస్తున్నారు. అదే సమయంలో కృష్ణుడు తమ ముందు ప్రత్యక్షం కావటంతో వారంతా సిగ్గుతో తలవంచుకున్నారు.

గోపికలు గట్టుమీద వేసిన వస్త్రాలన్నీ తీసుకుని ఆ పక్కనున్న చెట్టుమీద కెక్కాడు శ్రీకృష్ణుడు. గోపికలంతా తమ వస్త్రాలు తమకివ్వమని కోరారు. అప్పుడు కృష్ణుడు “ఓ గోపికలారా! ఒక్కొక్కరుగా మీరు నా దగ్గరకి వచ్చి మీమీ వస్త్రాలేవో తీసుకెళ్ళండి” అన్నాడు. తామంతా నగ్నంగా వున్నందు వల్ల ఎలా పైకి వెళ్ళాలో తెలియక తికమక పడ్డారు. చివరికి చేసేదేమీ లేక ఆ గోపికలంతా సిగ్గువిడిచి అలాగే వివస్త్రలుగా నదిలోంచి తీరానికి వచ్చి రెండుచేతులూ ఎత్తి కృష్ణుడికి నమస్కరించారు. వారి నిష్కళంకమైన భక్తికి శ్రీకృష్ణుడు ఎంతో మెచ్చుకుని వారికి వారివారి వస్త్రాల్ని ప్రసాదించి “ఓ గోపికలారా! మీ మనసులో వున్న కోరికేమిటో నాకు తెలుసు. మీ అందరి కోరికనీ త్వరలో యమునాతీరంలో వెన్నెల రాత్రిలో తీరుస్తాను వెళ్ళండి” అని చెప్పి పంపాడు. గోపికలంతా తమతమ వస్త్రాల్ని తీసుకుని శ్రీకృష్ణుడితో తమకి త్వరలో సంగమం కలగబోతోందని ఆనందిస్తూ తమతమ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

## గోవర్ధనోద్ధరణం

**ఒ**కప్పుడు గోకులంలో వారంతా ఇంద్రుడి కోసం యాగం చేయటానికి సన్నాహాలు ప్రారంభించారు. ఆ తతంగమంతా చూసిన శ్రీకృష్ణుడు, ఇంద్రుడి గర్వాన్ని అణచాలని భావించి వారితో “ఎందుకు మీరంతా ఈ సన్నాహాలు చేస్తున్నారు అని అడిగాడు. నాయనా! ఇంద్రుడు మనకు దేవుడు. ఆయన్ని పూజిస్తే అనుగ్రహించి వర్షాలు కురిపిస్తాడు. మనకు మన పశువులకూ

ఆహారం లభిస్తుంది. అందుకే ఈ ఏర్పాట్లు" అని పెద్దలు చెప్పారు. అప్పుడు కృష్ణుడు నందగోపుడితో తండ్రీ! వర్షానికి కారకుడు ఇంద్రుడుకాడు. జీవుల అదృష్టాన్ని అనుసరించి భూమిమీద వర్షాలు పడుతుంటాయి. అడవిలో వున్న ఏ చెట్టూపుట్టా ఇంద్రుడి కోసం యాగం చేయటంలేదు కదా! మనందరికీ ఆహారాన్ని అందిస్తూ ఆశ్రయమిచ్చేది ఈ గోవర్ధనగిరి. ఇక్కడి పచ్చికమేస్తూ ఆవులన్నీ ఎంతో ఆనందంగా సంచరిస్తున్నాయి. కనుక ఈ గోవర్ధనగిరిని పూజించటం సమంజసం ధర్మం" అని ప్రబోధించాడు.

కృష్ణుడి మాటలు విన్న పెద్దలందరికీ అది చాలా నిజమనిపించింది. అందరూ ఆ సంవత్సరం ఇంద్రయాగం మానేసి గోవర్ధనగిరిని భక్తిగా పూజించి ఎన్నో నైవేద్యాలు సమర్పించారు. శ్రీకృష్ణుడే గోవర్ధనగిరి రూపంలో ఆ నైవేద్యాలు స్వీకరించాడు. గోకులం వారంతా తమ మనోరథం నెరవేరిందని ఆనందించి తిరిగి తమ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

ప్రతి సంవత్సరం తనకోసం యాగం చేసే గోపకులం వారు, యాగం చేయకపోవటంతో ఇంద్రుడికి ఎంతో ఆగ్రహం కలిగింది. తనని అవమానించిన వారిమీద ఎలాగైనా ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాడు. వెంటనే వెనకాముందూ ఆలోచించక ఆ గోకులాన్నంతా నాశనం చేయాలని ప్రళయకాల మేఘాలను పంపించాడు. నందవ్రజం మీద ఇంద్రుడు పంపిన కాలమేఘాలు భయంకరంగా వర్షాన్ని కురిపించటం ప్రారంభించాయి. పెద్దపెద్ద వడగళ్ళ వాన కురుస్తోంది. ఆ వానధాటికి తట్టుకోలేక పశువులు, గోపాలురు అటుఇటూ పరుగెత్తసాగారు. అందరూ ముక్తకంఠంతో కృష్ణా! మమ్మల్ని రక్షించు రక్షించు అని కేకలు వేశారు.

గోకులం వారందరినీ ఏమాత్రం భయపడవద్దని చెప్పి నెమ్మదిగా తన చేత్తో గోవర్ధనగిరిని పైకి ఎత్తి చిటికెన వేలుమీద నిలిపాడు శ్రీకృష్ణుడు. ఆ దివ్యలీలా విలాసాన్ని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. గోవులు, గోపబాలకులు ఆ పర్వతం క్రిందకి వచ్చి ఏడుపగళ్ళు ఏడురాత్రుళ్ళు ఎడతెరిపి

లేకుండా వర్షాన్ని అలానే కురిపించాడు. అయినా కృష్ణుడు చలించలేదు. ఏడురోజులూ అలానే నుంచున్నాడు. ఏడురోజులు దాటేసరికి ఇంద్రుడు పంపిన మేఘాలన్నీ దూదిపింజల్లాగా తేలిపోయాయి. ఇదంతా గమనించిన ఇంద్రుడు కృష్ణుడి గొప్పతనాన్ని తెలుసుకుని పశ్చాత్తాపంతో ఆయన్ని శరణు వేడాడు. కృష్ణుడు గోవర్ధనగిరిని తిరిగి యథాస్థానంలో వుంచాడు. అందరూ తమతమ స్థానాలకు తిరిగి వెళ్ళారు. ఇంద్రుడు స్వర్గలోకం నుంచి కామధేనువును తీసుకొచ్చి దాని పాలతో శ్రీకృష్ణుణ్ణి అభిషేకించాడు. తన ఐరావతం తొండంతో తెచ్చిన ఆకాశగంగా జలాలతో ఆయన పాదాలు కడిగాడు. గోకులవాసులంతా ఎంతో సంతోషించారు.

## కంసుడి వధ

**ఒ**కనాడు కంసుడి దగ్గరకు నారదుడు వచ్చి కంసా! నిన్ను చంపే శ్రీకృష్ణుడు గోకులంలో వున్నాడు. అతడు వసుదేవుడి కుమారుడే అని చెప్పి వెళ్ళాడు. కంసుడికి భయం పట్టుకుంది. శ్రీకృష్ణుణ్ణి ఎలాగైనా మట్టుబెట్టాలని అక్రూరుణ్ణి పిలిచి, ధనుర్యాగం జరగబోతోంది అది చూడటానికి శ్రీకృష్ణుణ్ణి పరివారంతో తన నగరానికి తీసుకురమ్మని చెప్పి పంపాడు. శ్రీకృష్ణుణ్ణి ఎప్పుడెప్పుడు చూద్దామా అని తహతహలాడుతున్న అక్రూరుడు ఎంతో ఆనందంగా గోకులానికి బయలుదేరాడు.

తనకోసం వచ్చిన అక్రూరుణ్ణి సాదరంగా ఆహ్వానించాడు శ్రీకృష్ణుడు. అతడితో మధురానగరానికి బయలుదేరటానికి సంసిద్ధుడయ్యాడు. కృష్ణుడు తమను విడిచి వెళ్తున్నందుకు గోకులంలోని గోపికలంతా ఎంతో బాధపడ్డారు. కృష్ణుడు బలరాముడు తదితర గోపకుల పెద్దలతో కలిసి మధురకి ప్రయాణమయ్యాడు. అక్రూరుడితో సహా మధురలోకి ప్రవేశించిన శ్రీకృష్ణునికి పురప్రజలంతా ఘనస్వాగతం పలికారు. జనులందరి కోలాహలం విని మధురలోనే వున్న దేవకీదేవి ఎంతో సంతోషించింది. కృష్ణుడు సరాసరి రాచనగరిలోకి ప్రవేశించి ధనుస్సు వున్న మందిరంలోకి వెళ్ళాడు. అక్కడున్న భటులు వారిస్తున్నా వినకుండా ఆ ధనుస్సుని విరిచి రెండుముక్కలుగా చేసాడు.

ఆ ధనుస్సు విరగగానే భయంకరమైన ధ్వని వెలువడింది. అదివిని కంసుడు ఎంతో భయపడ్డాడు. విరిగిన ఆ ధనుస్సుతో అక్కడున్న భటులందరినీ శ్రీకృష్ణుడు దండించాడు.

మర్నాడు ఉదయం మల్లయుద్ధ పోటీలు ప్రారంభమయ్యాయి. ప్రత్యేక ఆహ్వానితులుగా వచ్చిన నందగోపుడు తదితర యాదవ ప్రముఖులు వేదిక మీద కంసుడితో పాటు ఆసీనులయ్యారు. కృష్ణుడు బలరాముడితో కలిసి మల్ల యుద్ధరంగం ప్రవేశద్వారం దగ్గరకి చేరుకున్నాడు. అప్పుడు వారి దారికి అడ్డంగా కువలయాశ్వం అనే పెద్ద ఏనుగుని ఉంచి, వారిమీదకి దూకించాడు మావటివాడు. శ్రీకృష్ణుడు ఎంతో చాకచక్యంగా ఏనుగు నుంచి తప్పించుకుని, పైకి ఎగిరి మావటివాణ్ణి తన్ని ఆ ఏనుగు కుంభస్థలం మీద గట్టిగా మోదాడు. ఆ దెబ్బతో ఏనుగు నేల కరిచింది. బ్రతికుండగానే దాని దంతాల్ని పెకలించి అందులోని ముత్యాలు తీసి రాధాదేవికి కానుకగా పంపాడు కృష్ణుడు.

బలరామకృష్ణులు మల్ల యుద్ధరంగంలోకి ప్రవేశించారు. కంసుడి ఆజ్ఞతో చాణూరుడు శ్రీకృష్ణుణ్ణి, ముష్టికుడు బలరాముణ్ణి ఎదుర్కొన్నారు. కొంతసేపటికి శ్రీకృష్ణ-బలరాములు వారిద్దరినీ మట్టికరిపించారు. అదిచూసి మిగిలిన మల్లయోధులంతా తలో దిక్కుకూ పారిపోయారు. కంసుడు ఆగ్రహంతో తన అనుచరుల్ని పిలిచి కృష్ణుడి తండ్రి వసుదేవుణ్ణి చంపమని, కృష్ణుణ్ణి దూరంగా తరిమేయమని ఆజ్ఞాపించాడు. కంసుడి మాటవిని ఎంతో నిగ్రహం కోల్పోయిన శ్రీకృష్ణుడు గరుత్మంతుడు పర్వతం మీదకి ఎగిరినట్టు ఒక్కసారి కంసుడున్న భవనం మీదకి లఘించాడు. కృష్ణుణ్ణి పరిమార్చాలని కంసుడు కత్తి దూసాడు. అతడి కత్తి ప్రహారాలని తప్పించుకుని జాగ్రత్తగా కంసుణ్ణి ఒడిసి పట్టుకున్నాడు కృష్ణుడు. తన చేతిలోచిక్కిన ఆ దుష్టుణ్ణి నేలకేసి కొట్టి ఘోరంగా సంహరించాడు. కంస సంహారంతో దేవతలంతా ఎంతో సంతోషించి ఆకాశం నుంచి పూలవాన కురిపించారు. ఈ కంసుడు పూర్వజన్మలో కాలనేమి అనే రాక్షసుడు. కంసుడిగా పుట్టి జీవితాంతం కృష్ణుణ్ణి ద్వేషించి, చివరికి ఆయన చేతిలోనే మరణించి, ఆయనలోనే ఐక్యమైపోయాడు.

# రుక్మిణీ కల్యాణం

బ్రహ్మదేవుడి ఆదేశంతో రేవతుడనే మహారాజు తన కుమార్తె రేవతిని శ్రీకృష్ణుడి అన్న బలరాముడికిచ్చి వివాహం చేసాడు. ఆ వివాహానికి ఎందరో రాజులు విచ్చేసారు. వారిలో విదర్భరాజు భీష్మకుడు కూడా వున్నాడు. వివాహానికి వచ్చిన వారంతా శ్రీకృష్ణుడి గుణగణాల్ని లీలావిలాసాలని మెచ్చుకుంటుంటే భీష్మకుడు విని తన ఇంటికి వెళ్ళాక ఆ విశేషాలన్నీ తన వారందరికీ చెప్పాడు. విదర్భరాజుకి ఒక కుమార్తె వుంది. ఆమే రుక్మిణి. తండ్రి ద్వారా శ్రీకృష్ణుడి గుణగణాలు విని ఆయన మీదే మనసు పెంచుకుంది. అయితే రుక్మిణి అన్న రుక్మీకి తన చెల్లెల్ని శిశుపాలుడికిచ్చి వివాహం చేయాలని వుంది. ఈ విషయం తెలుసుకున్న రుక్మిణి తన మనసులోని కోరికను శ్రీకృష్ణుడికి తెలియచేయమని ఒక బ్రాహ్మణుడిని పంపించింది. రుక్మిణీదేవి చెప్పిన సందేశాన్ని ఆ బ్రాహ్మణుడు శ్రీకృష్ణుడి దగ్గరికి వచ్చి విన్నవించాడు.

శ్రీకృష్ణుడు రుక్మిణి అంతరంగాన్ని అర్థం చేసుకుని ఆ బ్రాహ్మణుడితో "విప్రవరా! నేను కుండిన నగరానికి వచ్చి అందరూ చూస్తుండగానే రుక్మిణిని తెచ్చి వివాహం చేసుకుంటాను. నాకు కూడా ఆమెమీద ప్రేమ వుంది. ఏమీ చింతించవద్దు" అని చెప్పి పంపాడు. కొద్దిరోజుల తరువాత బలరాముడితో సహా శ్రీకృష్ణుడు కుండిన నగరానికి వెళ్ళాడు. భీష్మకుడు కృష్ణుణ్ణి సాదరంగా స్వాగతించాడు. నగరంలోని వారంతా రుక్మిణికి శ్రీకృష్ణుడే తగిన జోడీ అని భావించారు. కృష్ణుడు వచ్చాడని విని రుక్మిణి ఎంతో సంతోషించింది.

మర్నాడు ఉదయం సర్వాభరణాలూ ధరించి రుక్మిణి గౌరీపూజ కోసం ఆలయానికి బయలుదేరింది. కృష్ణుడు కూడా ఆమెనే అనుసరిస్తూ వెళ్ళాడు. గుడిలో పూజ ముగించుకుని రుక్మిణీదేవి బైటకి వచ్చింది. ఆమె సౌందర్యం చూసి అందరూ ఆశ్చర్యపోయారు. రుక్మిణి ఓరకంట అక్కడేవున్న శ్రీకృష్ణుణ్ణి చూసింది. వెంటనే కృష్ణుడు ఆమెని తన రథం మీద కూర్చోబెట్టుకుని వేగంగా వెళ్ళిపోయాడు.

అదిచూసి అక్కడున్న రాజులంతా హాహాకారాలు చేస్తూ వెంబడించారు. రుక్మిణి అన్న రుక్మి కూడా సైన్యాన్ని వెంటబెట్టుకుని శ్రీకృష్ణుణ్ణి ఎదిరించాడు. తన చేతిలో ఓడిపోయిన 'రుక్మి'ని బావగారు గనుక క్షమించి కేవలం జుట్టు, మీసాలు గొరిగించి పంపించాడు. రుక్మిణీదేవిని చేపట్టి ద్వారకా నగరానికి వచ్చి వైభవంగా ఆమెని వివాహం చేసుకున్నాడు.

## శ్యమంతకోపాఖ్యానం

**పూ**ర్వం సత్రాజిత్తు అనే రాజు సూర్యుణ్ణి ఉపాసించి ఆయన అనుగ్రహంతో రోజుకి వేయి బారువుల బంగారాన్ని అందించే శ్యమంతక మణిని కానుకగా పొందాడు. ఒకనాడు ఆ మణి విషయం తెలిసిన శ్రీకృష్ణుడు దాన్ని తనకిమ్మని సత్రాజిత్తుని అడిగాడు. సత్రాజిత్తు అందుకు అంగీకరించలేదు. అదలా వుండగా ఒకనాడు సత్రాజిత్తు సోదరుడు ప్రసేనుడు ఆ మణిని ధరించి వేటకు వెళ్ళాడు. అడవిలో ఒక సింహం అతడి మెళ్ళో వున్న మణిని మాంసం ముద్ద అని భ్రమించి అతన్ని చంపి దాన్ని ఎత్తుకుపోయింది. ఆ సింహం చేతిలోవున్న మణిని ఒక ఆటవస్తువు అనుకుని జాంబవంతుడు దాన్ని సంహరించి ఆ మణిని తన కుమార్తె జాంబవతికి ఇచ్చాడు.

ప్రసేనుడు ఎంత కాలానికీ తిరిగి రాకపోవటంతో, సత్రాజిత్తు తన మణిని శ్రీకృష్ణుడే దొంగలించాడని, తన సోదరుణ్ణి కూడా సంహరించాడని అపవాదువేసాడు. తనమీద పడ్డ నింద పోగొట్టుకోవాలని భావించిన శ్రీకృష్ణుడు కొంత పరివారాన్ని వెంటబెట్టుకుని ప్రసేనుణ్ణి వెతుకుతూ అడవిలోకి వెళ్ళాడు. అక్కడ ప్రసేనుడి కళేబరం కనిపించింది. మణిలేదు. అక్కడున్న సింహం అడుగుజాడల్ని చూసి వెళ్ళగా సింహం కూడా చచ్చిపడుంది. దాని పక్కన భల్లూకం అడుగుజాడలు కనిపించాయి. వాటిని అనుసరిస్తూ వెళ్ళగా శ్రీకృష్ణుడికి ఒక గుహ కనిపించింది. అనుచరుల్ని బైటే వుండమని చెప్పి, కృష్ణుడు లోపలికి వెళ్ళాడు, ఆ గుహలో వున్న జాంబవంతుడు శ్రీకృష్ణుణ్ణి గుర్తించక ఆయనతో బాహుయుద్ధం చేసాడు. యుద్ధం చేసీచేసీ అలసిపోయిన జాంబవంతుడు

చివరకు శ్రీకృష్ణుడే శ్రీరాముడన్న సత్యం తెలుసుకున్నాడు. వెంటనే క్షమించమని ప్రార్థించి మణిని, తన కుమార్తె జాంబవతిని శ్రీకృష్ణుడికి సమర్పించాడు.

కృష్ణుడు ఆవిధంగా మణిని వెతికి తీసుకువచ్చి దాన్ని సత్రాజిత్తుకి అప్పగించాడు. అకారణంగా నిజం తెలుసుకోకుండా కృష్ణుణ్ణి అవమానించినందుకు సత్రాజిత్తు ఎంతో పశ్చాత్తాపపడి ఆ మణిని దానితోపాటు తన కుమార్తె సత్యభామని కృష్ణుడికి సమర్పించాడు. కృష్ణుడు సత్యభామని మాత్రం తన భార్యగా స్వీకరించి శ్యమంతకమణిని అతడికే ఇచ్చేశాడు.

## నరకాసుర వధ

**ప్రా**గ్జ్యోతిషపురాన్ని నరకాసురుడు ఏలుతున్నాడు. అతడు భయంకరంగా దేవీ ఉపాసన చేసి పదహారువేల మంది రాజకన్యల్ని బంధించి ఎన్నో అకృత్యాలు చేస్తున్నాడు. అతడి ఆగడాల్ని భరించలేక ఇంద్రుడు శ్రీకృష్ణుడి దగ్గరకు వచ్చి నరకుడు చేసే అకృత్యాలన్నీ ఏకరువు పెట్టాడు. నరకాసురుడికి చచ్చే సమయం ప్రాప్తించందని భావించి కృష్ణుడు వెంటనే గరుత్మంతుణ్ణి పిలిచి సత్యభామని వెంటబెట్టుకుని ప్రాగ్జ్యోతిష పురానికి బయలుదేరాడు. ఆ నగరంలోకి ప్రవేశించిన కృష్ణుడు నరకుడి సైన్యాన్నంతా చెల్లాచెదురు చేసి వారందరినీ వధించాడు. వారందరి నెత్తురు ప్రవహించేలా చేసి ఆ నగరాన్ని శోణితపురంగా మార్చాడు. అప్పుడు నరకుడి అనుచరుడైన మురాసురుడనే ఐదుతలల రాక్షసుడు కృష్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. అతడి ఐదుతలల్నీ తన చక్రాయుధంతో ఖండించేసాడు కృష్ణుడు.

నరకాసురుడు తన రాజ్యంలో మాత్రమే ప్రత్యేకంగా వున్న నాలుగుదంతాల గజసైన్యాన్ని వెంట బెట్టుకుని స్వయంగా శ్రీకృష్ణుణ్ణి సమీపించాడు. కృష్ణుడు ఎంతోసేపు నరకాసురుడితో యుద్ధం చేసాడు. చివరికి చక్రాయుధంతో అతడి తల నరికి మోక్షాన్ని ప్రసాదించాడు. నరకాసుర సంహారంతో భూదేవి ఎంతో సంతోషించింది. దేవతలంతా జయజయధ్వానాలు చేసి పూలవాన కురిపించారు. కృష్ణుడు నరకుడి కుమారుడు 'భగదత్తుడి'కి రాజ్యాన్ని అప్పగించి నరకుడి చెరలో వున్న పదహారువేల మంది కన్యలకూ

విముక్తి కల్పించాడు. చివరికి వారందరినీ వివాహం చేసుకుని వారికానందాన్ని కలిగించాడు.

తరువాత శ్రీకృష్ణుడు, పూర్వం నరకాసురుడు ఇంద్రుణ్ణి జయించి అపహరించిన అదితి కుండలాలను తీసుకుని సత్యభామతో సహా దేవలోకానికి వెళ్ళాడు. ఇంద్రుడికి వాటిని అప్పగించి తిరిగి వస్తుండగా సత్యభామ నందనవనంలో వున్న కల్పవృక్షాన్ని కోరుకుంది. కృష్ణుడు దాన్ని తీసుకుని ద్వారకా నగరానికి వచ్చి ఆ కల్పవృక్షాన్ని సత్యభామ పెరడులో నాటించాడు.

## పౌండ్రక వాసుదేవుడు

**క**రూదేశానికి రాజు పౌండ్రక వాసుదేవుడు. అతడు మూర్ఖుడే కాకుండా దురహంకారి కూడా. తనకి వాసుదేవుడు అనేపేరు ఉండటం వల్ల తానే నిజమైన వాసుదేవుడనని ద్వారకలో వుండే శ్రీకృష్ణుడు తనపేరు పెట్టుకుని వాసుదేవుడుగా చెలామణీ అవతున్నాడనీ భ్రమించాడు. అతడి చుట్టూ వున్న అనుచరులు కూడా అతడిలా వెర్రివారే. అందరూ కలిసి పౌండ్రకుడి భ్రమని నిజమని నమ్మించసాగారు. నిత్యం అతడిని శ్రీమహావిష్ణువుగా అలంకరించి పొగడ్తలతో, స్తుతులతో ముంచెత్తేవారు. క్రమంగా అతడికి పిచ్చి తలకెక్కి తనకి తప్ప ఎవరికీ వాసుదేవ నామం ఉండకూడదని భావించాడు. వెంటనే ఒక దూతతో తన సందేశాన్ని శ్రీకృష్ణుడికి చెప్పమని పంపించాడు.

పౌండ్రక వాసుదేవుడు పంపిన దూత శ్రీకృష్ణుడు సభలో వుండగా వచ్చి ఇలా చెప్పాడు "ఓయీ కృష్ణా! యాదవా! ఈ భూమండలాన్ని రక్షించటానికి వాసుదేవుడైన నేను అవతరించాను. నీవు నాపేరుని, నా చిహ్నాలని ఉపయోగించి సంచరిస్తున్నావని తెలిసింది. ఇది నీకు తగదు. ఇకపై నీవు నా వాసుదేవ నామాన్ని వినియోగించకుండా నన్ను శరణువేడుకో లేదా నాతో యుద్ధానికి తలపడు. నిన్ను సరాసరి యమలోకానికి పంపిస్తా" అని అన్నాడు. ఆ మాటలు విన్న సభాసదులందరూ ఎవడీ పిచ్చివాడు పిచ్చి సందేశం పంపాడు అని నవ్వుకున్నారు. అసలు ఇలాంటి మూర్ఖుడు కూడా ఒకడుంటాడా అని ఆశ్చర్యపోయారు.

శ్రీకృష్ణుడు పౌండ్రకుడి దూతతో "ఓయీ నీవు వెళ్ళి నీ వాసుదేవుడికి చెప్పు ఏ ఆయుధాల్ని నన్ను విసర్జించమన్నాడో అవే ఆయుధాలతో పౌండ్రక వాసుదేవుణ్ణి, అతడి అనుచరుల్ని సమూలంగా సంహరిస్తాను యుద్ధానికి సిద్ధంగా వుండమని చెప్పు" అని చెప్పి పంపాడు. దూత తిరిగి తన రాజు దగ్గరకి వెళ్ళి శ్రీకృష్ణుడి సందేశాన్ని వినిపించాడు. పౌండ్రకుడు శ్రీకృష్ణుడి రాకకోసం ఎదురుచూస్తున్నాడు.

శ్రీకృష్ణుడు పౌండ్రకుడి రాజ్యం మీదకి దండెత్తాడు. పౌండ్రకుడు కూడా ఎంతో ఉత్సాహంగా రెండు అక్షౌహిణుల సైన్యంతో శ్రీకృష్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. అతడికి ఆసరాగా మిత్రుడైన కాశీరాజు మూడు అక్షౌహిణీల సైన్యాన్ని వెంటబెట్టుకొచ్చాడు. యుద్ధరంగంలోకి అచ్చం శ్రీకృష్ణుడిలా వేణువుని పింఛాన్ని పీతాంబరాల్ని కిరీట కుండలాల్ని ధరించి పగటివేషగాడిలా వచ్చాడు. అతన్ని చూసి కృష్ణుడికి నవ్వాగలేదు. ఆ పరిహాసం చూసి ఆగ్రహంగా పౌండ్రకుడు ఎన్నో ఆయుధాల్ని శ్రీకృష్ణుడి మీదకి ప్రయోగించాడు. ఆయన వాటన్నిటినీ తునాతునకలు చేసి చివరికి తన చక్రాయుధాన్ని ప్రయోగించి పౌండ్రక వాసుదేవుడి తలని నరికేశాడు. ఒకపక్క పౌండ్రకుడు మరణించినా యుద్ధం విరమించకుండా పౌరుషాన్ని చూపిస్తున్న కాశీరాజు తలని కూడా తన చక్రాయుధంతో ఖండించి, ఆ తల కాశీరాజు కోటలో పడేలా బాణంతో కొట్టాడు శ్రీకృష్ణుడు.

ఆవిధంగా పౌండ్రకుడి మీద విజయం సాధించి శ్రీకృష్ణుడు ద్వారకానగరానికి వెళ్ళిపోయాడు. నిరంతరం శ్రీకృష్ణుడి పేరునే తలుస్తూ ఆయన అలంకారాన్నే ధరిస్తూ కృష్ణ నామస్మరణతోనే జీవితాన్ని గడిపిన పౌండ్రక వాసుదేవుడు చివరికి శ్రీకృష్ణుడి చేతిలోనే మరణించి కృష్ణ సాయుజ్యం పొందాడు.

అక్కడ కాశీరాజు తల కోటలో పడటం చూసి అందరూ ఎంతో దుఃఖించారు. కాశీరాజు మరణానికి కారకుడు శ్రీకృష్ణుడని తెలుసుకున్నాడు కాశీరాజు పుత్రుడైన సుదక్షిణుడు. కృష్ణుడి మీద ప్రతీకారం తీర్చుకోవాలని

శివుడి గురించి ఘోరమైన తపస్సు చేసాడు. శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమనగా, కృష్ణుణ్ణి సంహరించే శక్తిని ప్రసాదించమన్నాడు. అయితే శివుడు ఒక అభిచార హోమం చేసి తద్వారా అతడి కోరిక తీర్చుకోమని ఉపదేశించాడు. సుదక్షణుడు ఎంతో నిష్ఠగా పరమేశ్వరుడు చెప్పిన అభిచార హోమాన్ని నిర్వహించాడు. యాగం పూర్తయిన తరువాత హోమగుండం నుంచి కృత్య అనే మహాశక్తి ఆవిర్భవించింది. సుదక్షిణుడు దాన్ని ద్వారకా నగరంలో వున్న శ్రీకృష్ణుడి మీదకి ప్రయోగించాడు.

మహోజ్వలంగా తాటిచెట్టంత ఎత్తైన జ్వాలల్ని విరజిమ్ముతూ కృత్యాశక్తి ద్వారకానగరంలోకి ప్రవేశించింది. నగరాన్నంతా ధ్వంసం చేస్తూ విచ్చలవిడిగా సంచరించింది. దాని ధాటికి తట్టుకోలేక నగరవాసులంతా పరుగున వచ్చి కృష్ణుణ్ణి శరణు వేడుకున్నారు. ఆయన విషయం గ్రహించి ఆ కృత్యమీద తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు. ఆ సుదర్శనం సూర్యుడిలా దివ్యతేజస్సుతో ప్రకాశిస్తూ కృత్యని తరిమికొట్టింది. దాన్ని తురుముతూ వెళ్ళి ప్రయోగించిన సుదక్షిణుణ్ణి అతడి నగరాన్ని దహించి తిరిగి కృష్ణుడి చెంతకు చేరింది.

## జరాసంధుడి వధ

**శ్రీ**కృష్ణుడు సభలో వుండగా ఒక దూతవచ్చి ప్రభూ! మగధరాజైన జరాసంధుడు ఇరవైవేల ఎనిమిది వందలమంది రాజుల్ని జయించి వారందరినీ కారాగారంలో బంధించాడు. వారిని జరాసంధుడు నిత్యం ఎన్నో బాధలకు గురిచేస్తున్నాడు. ఆ దుష్టుడి బారి నుంచి తమను కాపాడమని నన్ను దూతగా మీ దగ్గరకు పంపారు" అని విన్నవించాడు.

దూతవాక్యాలు విని కృష్ణుడు జరాసంధుడి మీదకు యుద్ధానికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. అంతలో నారద మహర్షి వచ్చి ధర్మరాజు రాజసూయ యాగం చేయబోతున్నాడనే వార్తను తెలియచేసాడు. అప్పుడు కృష్ణుడు యుద్ధానికి వెళ్ళాలా లేక రాజసూయానికి వెళ్ళాలా అన్న సందిగ్ధావస్థకు

గురయ్యాడు. అది గమనించిన ఉద్ధవుడు కృష్ణుడితో స్వామీ! మనం ముందుగా రాజసుయానికి వెళితే మంచిది. అక్కడ నుంచి జరాసంధుడి దగ్గరకి వెళ్ళవచ్చు అని సలహా ఇచ్చాడు. ఉద్ధవుడి మాట ప్రకారం కృష్ణుడు తన పరివారన్నంతా వెంట బెట్టుకుని రాజసూయానికి వెళ్ళాడు.

రాజాసూయానికి వచ్చిన కృష్ణుడితో ఉద్ధవుడు కృష్ణా జరాసంధుడు మహాబలవంతుడు. అతడి చావు భీమసేనుడి చేతిలో రాసిపెట్టి వుంది. పైగా అతడికి వంద అక్షౌహిణీల సైన్యం వుంది. అంత సైన్యాన్ని ఎదిరించి గెలవటం కష్టం. జరాసంధుడికి బ్రాహ్మణులంటే ఎంతో భక్తి, వారు ఏది కోరినా ఇచ్చేస్తాడు. కనుక నీవు భీముడు విప్రులవేషంలో వెళ్ళి ద్వంద్వయుద్ధాన్ని యాచించండి. అతడు అందుకు అంగీకరిస్తాడు. అప్పుడతన్ని సులభంగా సంహరించవచ్చు" అని తన ఆలోచన తెలియచేసాడు.

ఇంద్ర ప్రస్థానానికి వచ్చిన కృష్ణుడు ధర్మరాజు ద్వారా అతిథి మర్యాదలు పొంది, ధర్మరాజు అనుమతితో భీముణ్ణి, అర్జునుణ్ణి వెంటబెట్టుకుని మగధరాజ్యానికి బయలుదేరాడు. దారిలో వారు ముగ్గురూ బ్రాహ్మణుల వేషాలు ధరించారు. సరాసరి గిరివ్రజానికి వెళ్ళి జరాసంధుణ్ణి కలిసారు. వచ్చిన అతిథులకు తగిన ఉపచారాలు చేసి ఏం కావాలో కోరుకోమన్నాడు జరాసంధుడు. అప్పుడు విప్రవేషంలో వున్న శ్రీకృష్ణుడు లేచి మాలో ఒకరితో నీవు ద్వంద్వయుద్ధం చేయాలి ఇదే మా కోరిక అన్నాడు. జరాసంధుడు భీముణ్ణి తనకు తగినవాడిగా ఎన్నుకున్నాడు.

భీమ జరాసంధుల మధ్య మల్లయుద్ధం ప్రారంభమైంది. ఒకరిమీద ఒకరు ముష్టిఘాతాలు కురిపించుకోసాగారు. ఇద్దరిలో ఎవరూ అలసిపోవటం లేదు. ఇలా వారి పోరు చాలాకాలం కొనసాగింది. భీముడు తన శక్తినంతా ఉపయోగించి జరాసంధుణ్ణి రెండు భాగాలుగా చీల్చేసినప్పటికీ అతడికున్న దివ్యశక్తి వల్ల ఆ రెండు శరీరభాగాలు తిరిగి కలసిపోయేవి. అప్పుడు కృష్ణుడు పక్కనే వున్న ఒక చెట్టు పుల్లనివిరిచి దాన్ని భీముడు చూసేలా వ్యత్యస్తంగా

పడేశాడు. ఆ సంకేతాన్ని గ్రహించిన భీముడు తిరిగి జరాసంధుణ్ణి ముష్టిఘాతాలతో పడగొట్టి అతడి శరీరాన్ని రెండుగా చీల్చాడు. ఆ భాగాల్ని తిరిగి అతుక్కోకుండా అటూఇటూ పడేశాడు. దానితో జరాసంధుడు మరణించాడు. మహావీరుడైన జరాసంధుణ్ణి అంతం చేసినందుకు కృష్ణుడు అర్జునుడు భీమసేనుణ్ణి అభినందించారు.

జరాసంధుడి కుమారుడైన సహదేవుణ్ణి రాజుగా అభిషేకించి బందీలుగా వున్న రాజులందరికీ విముక్తి కలిగించాడు కృష్ణుడు. వారంతా తమ విడుదలకు కారకుడైన కృష్ణుణ్ణి ఎంతోభక్తిగా స్తుతించారు. వారి ప్రార్థన విన్న కృష్ణుడు వారితో "రాజేంద్రులారా! ప్రజల్ని, బ్రాహ్మణుల్ని బాధించిన వేనుడు, నహుషుడు, రావణుడు, కార్తవీర్యుడు తదితర రాజులంతా నశించారు. ఈ విషయాన్ని గుర్తుంచుకోండి. కేవలం ధర్మమార్గంలో ప్రవర్తించే రాజులకే కీర్తిప్రతిష్ఠలు లభిస్తాయి. ఈ శరీరం శాశ్వతం కాదు. మీరు ఈ విషయాన్ని గ్రహించి నీతి, న్యాయం, ధర్మం తప్పకుండా మీ ప్రజల్ని పాలించండి. నిత్యం యజ్ఞయాగాది క్రతువుల్ని చేస్తూ నామీదే భక్తిని కలిగి వుండండి" అని బోధించి, వారందరికీ మంగళస్నానాలు చేయించి విలువైన కానుకలతో సత్కరించి వారివారి రాజ్యాలకు సాగనంపాడు.

## శిశుపాల వధ

**ధ**ర్మరాజు అత్యద్భుతంగా శాస్త్రబద్ధంగా రాజ సూయయాగాన్ని నిర్వహిస్తున్నాడు. ఆ యాగానికి వ్యాసమహర్షి కశ్యపుడు, భరద్వాజుడు వంటి మునీశ్వరులు, ద్రోణకృపాది గురువులు, భీష్మ దృతరాష్ట్రుల లాంటి కురువృద్ధులు, దుర్యోధనాది జ్ఞాతులు ఎందరో విచ్చేశారు. వారితో పాటు శ్రీకృష్ణుడు బంధుమిత్ర సపరివారంగా యాగానికి విచ్చేసి కార్యక్రమంలో పాలుపంచుకున్నాడు.

ఆ మహాయాగానికి వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన రాజులు తెచ్చే కానుకల్ని స్వీకరించటానికి దుర్యోధనుణ్ణి, యాచకులకు దానధర్మాలు చేసే పనికి కర్ణుణ్ణి, వంటలు పర్యవేక్షించే బాధ్యతను భీముడికి, వచ్చిన అతిథుల్ని

సత్కరించే బాధ్యతను అర్జునుడికీ, యజ్ఞసామాగ్రి సమకూర్చమని నకులుణ్ణి, బ్రాహ్మణుల్ని గురువుల్ని పెద్దల్ని పూజించేపనికి సహదేవుణ్ణి, అందరికీ మృష్టాన్న భోజనం అందేలా చూసే బాధ్యతని ద్రౌపతికి అప్పగించాడు ధర్మరాజు.

సకల లోకాల దేవతలూ ధర్మరాజు చేస్తున్న రాజసూయాన్ని చూసి ఎంతో గొప్పగా వుందని ప్రశంసించారు. యాగం ముగింపురోజుకు వచ్చింది. ధర్మరాజు యాగానికి విచ్చేసిన పెద్దలందరినీ తగిన రీతిలో పూజించి సన్మానించాలనుకున్నాడు. అయితే అందరిలో అగ్రపూజ ఎవరికి చేయాలి? అన్న సందేహం వచ్చింది. అందరూ తలో రకంగా సలహాలిచ్చారు. చివరగా సహదేవుడు సభలో పైకిలేచి శ్రీకృష్ణుణ్ణి చూపిస్తూ "పరంధాముడైన కృష్ణుడికి అగ్రపూజ చేస్తే లోకాలన్నీ సంతోషిస్తాయి" ఎందుకంటే

**అర్హతి హ్యచ్యుతః శ్రైష్ట్యం భగవాన్ సాత్వతం పతిః ।**
**ఏషవై దేవతాః సర్వా దేశకాల ధనాదయః ॥**

**యదాకృతమిదం విశ్వం క్రతవశ్చ యదాత్మకాః ।**
**అగ్నిరాహు తయోమంత్రాః సాంఖ్యం యోగశ్చ యత్పరః ॥**

**ఏకవా ద్వితీయోఽసావై తాదాత్మ్య మిదం జగత్ ।**
**ఆత్మనాత్మాశ్రయః సభ్యాః సృజత్యవతి హంత్యజః ॥**

**సర్వభూతాత్మ భూతాయ కృష్ణాయానన్య దర్శినే ।**
**దేయం శాంతాయ పూర్ణాయ దత్తస్యానంత్య మిచ్ఛతా ॥**

(*దశమస్కందం : శ్లో 19-24*)

యదువంశ శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడే సభాసదులందరిలోకీ గొప్పవాడు. అందువల్ల ఆయనే అగ్రపూజకు అర్హుడు. ఆయన సకలదేవతా స్వరూపుడు. అంతేకాదు దేశకాల ధనాది వస్తువులన్నీ ఆయనే. ఈ విశ్వం, సకలయజ్ఞాలు కృష్ణుడి స్వరూపాలే. ఆ కృష్ణుడే అగ్నిగా, ఆహుతిగా, మంత్రంగా విలసిల్లుతున్నాడు. సదస్యులారా శ్రీకృష్ణుడు ఒక్కడే అద్వితీయ పరబ్రహ్మ. ఈ సకలజగత్తూ ఆయన

స్వరూపమే. అంతకీ ఆయనే ఆధారం సకలప్రాణుల్లో శ్రీకృష్ణుడు అంతర్యామిగా వుంటాడు. శాంతి స్వరూపుడు, పరిపూర్ణుడు. కనుక అలాంటి శ్రీకృష్ణుడికే అగ్రపూజ చేయటం సముచితం" అన్నాడు.

సహదేవుడి మాటలు విని సభాసదులంతా హర్షధ్వానాలు చేసారు. ధర్మరాజు అతడి సోదరులు పరివారం ఎంతో భక్తిగా శ్రీకృష్ణుడికి అగ్రపూజ చేయటం ప్రారంభిచారు. అంతలో ఆ వైభవదృశ్యాన్ని చూసి సహించలేని శిశుపాలుడు సభలోంచి పైకిలేచి "ఆహా ఇంతమంది జ్ఞానవృద్ధులు, గురువులు వున్న ఈ సభలో వారందరినీ మరిచి యాదవుడైన శ్రీకృష్ణుడికి అగ్రపూజ చేస్తున్నారే! కులం గోత్రం లేనివాడికి పూజచేసి అందర్ని అవమానిస్తున్నారే! ఇది భావ్యమా అని ఎన్నో పరుషమైన వాక్యాలతో శ్రీకృష్ణుణ్ణి నిందించటం ప్రారంభించాడు. అందరూ అతడి మాటలకి ఆశ్చర్యపోతున్నారు.

శ్రీకృష్ణుడు చిద్విలాసంగా నవ్వుతూ చూస్తున్నాడు. పాండవులకు ఆగ్రహం వచ్చింది. ఆయుధాలు ధరించి శిశుపాలుడి మీదకి దాడి చేయబోయారు. శిశుపాలుడు కూడా అందరినీ తిడుతూ ఎదురుదాడికి సిద్ధమయ్యాడు. తన కత్తిని పైకెత్తి కృష్ణుడి మీదకి వచ్చాడు. ఇక సమయ మాసన్నమైందని తలచిన కృష్ణుడు వెంటనే చక్రాయుధాన్ని ప్రయోగించి శిశు పాలుడి తలని నరికేశాడు. ఒక్కసారిగా శిశుపాలుడి శరీరం నేలకొరిగింది. అతడి శరీరంలోంచి దివ్యతేజస్సు బైటకు వచ్చి శ్రీకృష్ణుడిలో కలిసిపోయింది. ఆవిధంగా శ్రీకృష్ణుడి మీద విరోధం పెంచుకుని నిరంతరం ఆయన నామస్మరణే చేస్తూ చివరికి ఆయన చేతిలోనే మరణించి కైవల్యం పొందాడు శిశుపాలుడు.

## కుచేలోపాఖ్యానం

**శ్రీ**కృష్ణుడు కుచేలుడు ఇద్దరూ సాందీప ముని దగ్గర శిష్యరికం చేసారు. వారిద్దరూ సహాధ్యాయులు. కాలక్రమంలో కుచేలుడు ధనసంపాదన మీద ఏమాత్రం ఆసక్తి లేకుండా జీవనాన్ని నిర్లిప్తంగా కొనసాగిస్తున్నాడు. కుచేలుడి

భార్య అతనికి అన్నివిధాలా అనుకూలవతే అయితే ఆమెకి ఆశ వుంది. ఎందుకంటే వారికి అధిక సంతానం. ఒకరోజు కుచేలుడి భార్య తన భర్తతో "స్వామీ! శ్రీకృష్ణుడు ఎంతో ఐశ్వర్యవంతుడు. పైగా మీకు సహాధ్యాయి. మన జీవితం సుఖంగా సాగటం కోసం ఆయన్ని ఏదైనా అర్థించి తీసుకురండి" అని కోరింది. దరిద్రబాధ తట్టుకోలేక తనకి ఇష్టం లేకపోయినప్పటికీ భార్య మాటని కాదనలేక తన ఇంట్లో వున్న కొద్ది అటుకుల్ని మూటకట్టుకుని ద్వారకా నగరానికి బయలుదేరాడు కుచేలుడు.

కుచేలుడు వచ్చాడన్న విషయం తెలిసి కృష్ణుడు సాదరంగా అతన్ని స్వాగతించాడు. కుశలోపచారాలు చేసి ఎంతో మర్యాదగా చూసుకున్నాడు. కృష్ణుడి సత్కారానికి కుచేలుడి మనసు ఎంతో ఆనందపడింది. భోజనం ముగించి ఆసనంలో కూర్చున్న కుచేలుడికి శ్రీకృష్ణుడు స్వయంగా వింజామరవీస్తూ పూర్వం చిన్నతనంలో గురుకులంలో జరిగిన సంఘటనలన్నిటినీ గుర్తుచేసాడు. కుచేలుడు తాను మూటకట్టి తెచ్చిన అటుకుల్ని కృష్ణుడికి ఇవ్వటానికి సిగ్గుపడ్డాడు. అది గ్రహించి ఆ మూటను లాక్కుని అందులోని అటుకుల్ని ఒక గుప్పెడు తిన్నాడు కృష్ణుడు.

ఆవిధంగా శ్రీకృష్ణుడితో ఎన్నో మర్యాదలు పొందిన కుచేలుడు తాను వచ్చిన విషయం మర్చిపోయి మర్నాడు ఉదయం ద్వారకానగరం నుంచి ఇంటికి బయలుదేరాడు. తన ఇంటి సమీపంలోకి వచ్చాక అతడికి గుర్తొచ్చింది. "అయ్యో! నాభార్య ఏదైనా అర్థించి రమ్మందే నేనేమో కృష్ణుణ్ణి ఏదీ కోరలేదు. అడిగి వుంటే ధనమేమైనా ఇచ్చేవాడేమో! ఇప్పుడు ఉత్తచేతులతో ఇంటికి వెళ్ళి నా భార్యకి ఏం చెప్పాలి" అని చింతిస్తూ ఇంటికి వెళ్ళాడు. అయితే అక్కడ అతడికి తన ఇల్లు కనిపించలేదు. ఒకపెద్ద భవనం కనిపించింది. ఏమిటిది అనుకుంటూ లోపలికి ప్రవేశించాడు. లోపల ఎంతో విలువైన మణిహారాలు ధరించిన తనభార్య చెలికత్తెలతో సేవలందుకుంటూ కనిపించింది. అప్పుడు అర్థమయ్యింది కుచేలుడికి అదంతా శ్రీకృష్ణుడి దివ్యానుగ్రహమేనని.

# 24 మంది గురువులు

**ఒక**నాడు యదుమహారాజు సంచరిస్తుండగా ఆయనకు దేహసంస్కారాలు లేక నిశ్చింతగా, నిర్లిప్తంగా తిరుగుతున్న ఒక అవధూత కనిపించాడు. ఆయనే దత్తాత్రేయుడు. అతన్ని చూసి ఆశ్చర్యపోయిన యదుమహారాజు "స్వామీ ఎన్ని సుఖభోగాలున్నా మేమంతా ఎంతో అసంతృప్తితో వున్నాం. తమరేమో ఏమీ లేకపోయినా ఇంత సంతృప్తిగా ఎలా వున్నారు. దయచేసి ఆ రహస్యమేమిటో చెప్పండని కోరాడు. ఆ అవధూత యదుమహారాజుతో రాజా! నేను లోకంలో ఎంతోమంది గురువుల నుంచి జ్ఞానాల్ని పొందాను. ఆ జ్ఞానం వల్లనే సత్యం తెలుసుకుని ఇలా నిశ్చింతగా నిర్లిప్తంగా సంతృప్తిగా సంచరిస్తున్నాను. ఆ గురువులెవరో చెబుతా విను–

1. **భూమి :** భూమి నుంచి సహనం. భూమి నుంచి పుట్టిన పర్వతాలు, వృక్షాల నుంచి స్థిరత్వాన్ని లోకోపకారం చేయటాన్ని నేర్చుకున్నాను.
2. **వాయువు :** వాయువు ప్రాణవాయువుగా లోపల బహిర్వాయువుగా బైట సంచరిస్తుంది. దీని నుంచి శరీరానికి ఎంత కావాలో అంతే తీసుకోవాలని బహిర్వాయువు ద్వారా సుగంధ దుర్గంధాల సమభావంతో స్వీకరించాలని గ్రహించాను.
3. **ఆకాశం :** ఇది లోపలా, బైటా, అంతా వ్యాపించి వుంటుంది. దీనిద్వారా పరమాత్మ అంతటా వ్యాపించి వుంటాడని, నిర్వికారుడని, నిర్గుణుడని తెలుసుకున్నాను.
4. **జలం :** నీరు అన్నిరకాల మలినాలనూ శుద్ధి పరుస్తుంది. దీనిద్వారా అజ్ఞానం అనే మలినాల్ని తొలగించి అందరినీ పవిత్రుల్ని చేయాలనే విషయాన్ని తెలుసుకున్నాను.
5. **అగ్ని :** అగ్ని అనేది ఇదిమంచిది, ఇదిమంచిది కాదు అన్న విచక్షణ లేకుండా అన్నిటినీ దహిస్తుంది. దీనిద్వారా యోగి తనకు సంక్రమించిన అనుభవాల్ని సమానంగా స్వీకరించాలని తెలుసుకున్నాను.

అగ్నికి ప్రత్యేకమైన ఆకారం వుండదు. ఏ వస్తువులో ప్రవేశిస్తే దాని ఆకారాన్ని ధరిస్తుంది. అలాగే ఆత్మకూడా ప్రత్యేకమైన ఆకారం లేకుండా ఏ జీవుడి శరీరంలో చేరుతుందో అదే రూపాన్ని ధరిస్తుందని తెలుసుకున్నాను.

6. **చంద్రుడు :** చంద్రుడి కళలు పెరగటం తరగటం చూసి శరీరం కూడా పెరిగి క్షీణిస్తుందని తెలుసుకున్నాను.

7. **సూర్యుడు :** సూర్యుడు ఎవరూ కోరకుండా నీటినుంచి ఆవిరిని తీసుకుని తిరిగి వర్షంగా ప్రసాదిస్తాడు. అన్ని లోకాలకూ వెలుగు, వేడీ ఇస్తాడు. ఈయన ద్వారా ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేకుండా యోగి అన్నవాడు లోకకల్యాణం కోసం పాటుపడాలని నేర్చుకున్నాను. ఒకే సూర్యుడు ఎన్నో పాత్రలలో వున్న నీళ్ళలో ఎన్నో సూర్యులుగా ప్రతిబింబించటం చూసి, ఒకే పరమాత్మ వేరువేరు రూపాలలో అనేకంగా వున్నట్టు భ్రమకల్పిస్తాడని తెలుసుకున్నాను.

8. **పావురం :** ఒక పావురం చెట్టుకొమ్మ మీద గూడుకట్టుకుని తన పిల్లలతో సంసారం చేస్తోంది. ఒకనాడు ఒక బోయవాడు పన్నిన వలలో పిల్ల పావురం చిక్కుకుంది. దాన్ని విడిపించాలని తల్లిపావురం. వారిద్దరినీ విడిపించాలని తండ్రి పావురం వలలో చిక్కుకున్నాయి. వీటిద్వారా భార్యాపిల్లలనే మమకారాన్ని పెంచుకుంటే సంసారమనే వలలో చిక్కి జీవిత లక్ష్యమైన మోక్షసాధనని మానవులు విస్మరిస్తారని తెలుసుకున్నాను.

9. **కొండచిలువ :** దీని నుంచి ఆహారం కోసం వెతుక్కోకుండా లభించిన ఆహారం ఎలాంటిదైనా దాన్ని ఆనందంగా ఆరగించాలి. ఒకవేళ ఆహారం లభించకపోతే సహనంగా నిరాహారంగా వుండాలని తెలుసుకున్నాను.

10. **సముద్రం :** సముద్రం నుంచి గంభీరంగా, నిశ్చలంగా వుండటం నేర్చుకున్నాను.

11. **మిడత :** ఇది దీపంకాంతికి ఆకర్షించబడి తన ప్రాణాలు కోల్పోతుంది. దీనిద్వారా ఇంద్రియాల ఆకర్షణకు లోబడితే మానవుడు నశిస్తాడని తెలుసుకున్నాను.

**12. తేనెటీగ :** తేనెటీగ ఎన్నోపూల నుంచి తేనెను తెచ్చి తన పట్టులోపెట్టి దాన్ని విడిచి వెళ్ళలేక అందులోనేపడి మరణిస్తుంది. దీని నుంచి యోగి అనేవాడు దేన్నీ తెచ్చి దాచుకోకూడదని ఏది లభిస్తే దానితోనే తృప్తిపడాలని తెలుసుకున్నాను.

**13. ఏనుగు :** ఏనుగును పట్టేవాడు పెద్దగొయ్యి తవ్వి దానిమీద ఆకులు కప్పి అక్కడే ఒక ఆడఏనుగును ఉంచుతాడు. ఆడఏనుగు కోసం వచ్చిన మగఏనుగు ఆ గుంటలో పడిపోతుంది. దీని ద్వారా అన్ని వ్యామోహాల కన్నా స్త్రీ వ్యామోహం అత్యంత ప్రమాదకరమని తెలుసుకున్నాను.

**14. తేనెపట్టు :** తేనెపట్టు తనలోని తేనెను సద్వినియోగం చెయ్యక దాచిపెట్టి వుంచుతుంది. దాచిన ధనం దొంగల్ని ఆకర్షిస్తుంది. ప్రమాదానికి కారణమవుతుంది. కనుక సంగ్రహించటం, లోభంతో వుండటం అనేవి తగవని గ్రహించాను.

**15. లేడి :** లేడి అడవిలో సంచరిస్తూ చక్కని వాద్యాల ధ్వనికి ఆకర్షించబడి వేటగాడికి చిక్కిపోతుంది. దీనిద్వారా తెలుసుకున్నదేమిటంటే యోగి నృత్యాలకి, గానాలకి ఆకర్షించబడకూడదు అని.

**16. చేప :** చేపద్వారా జిహ్వాచాపల్యం కూడదని తెలుసుకున్నాను. ఎరకు ఆశపడ్డ చేప దాన్ని మింగి తాను వేటగాడి గేలానికి చిక్కి అతడికి ఆహారమవుతుంది.

**17. పింగళ (వేశ్య) :** పింగళ అనే వేశ్య ఎంతో ధనకాంక్షతో వుండేది. ఒకనాడు ఆమెకు వైరాగ్యం కలిగి సుఖభోగాలన్నీ త్యజించి సర్వేశ్వరుడి పాదాలు ఆశ్రయించింది. ఆమె నుంచి ఆశ అనేది దుఃఖకారణమని, నిరాశ అనేది సుఖానికి హేతువని తెలుసుకున్నాను.

**18. కురదం (పక్షి) :** ఒక పక్షి తనకోసం ఆహారాన్ని సేకరించి తన గూడు నిండా దాచుకుని తింటోంది. ఒకనాడు ఆహారం ఏమీ దొరకని ఇతరపక్షులు

ఆ పక్షిగూడు మీదకి దాడిచేసి దాచిన ఆహారన్నంతా దోచుకుపోయాయి. దీనిద్వారా దాచుకోవటం దుఃఖానికి కారణమని తెలుసుకున్నాను.

**19. పసిబిడ్డ :** ఎలాంటి కల్మషం లేకుండా హాయిగా వుండే పసిబిడ్డను చూసి యోగి కూడా మనసులో ఎలాంటి కల్మషం లేకుండా పసిబిడ్డలాగా నిర్మలంగా వుండాలని గ్రహించాను.

**20. కన్య :** కన్య ద్వారా నేను తెలుసుకున్నదేమిటంటే ఎక్కువమంది ఉన్నచోట ధాన్యం దంచటం కుదరదని, ఇద్దరుంటే వారు పరస్పరం మాట్లాడుకుంటారు గనుక ఏకాగ్రతకుదరని, కనుక ఏకాంతంగా వుండటమే ధ్యానసిద్ధికి మార్గమని తెలుసుకున్నాను.

**21. బోయవాడు :** ఒక బోయవాడు తన బాణం ములుకునూ తయారుచేస్తూ అది సరిగ్గా పదునుగా తయారయ్యిందో లేదో అని పరిశీలిస్తూ ఆవైపు వచ్చిన రాజుని కూడా గమనించకుండా ఏకాగ్రంగా తన పనిలో లీనమయ్యాడు. అతడి నుంచి ఏకాంతంతో పాటు ఏకాగ్రత కూడా యోగికి చాలా అవసరమని గ్రహించాను.

**22. సర్పం :** పాము తనకోసం ఇల్లు నిర్మించుకోదు. చీమలు ఇతరజీవాలు చేసిన పుట్టలలో అది నివసిస్తుంది. దీని నుంచి యోగి అన్నవాడు సొంతగా ఇల్లు నిర్మించుకోకూడదని సర్పం ఏకాంతంగా జనసంచారం లేనిచోట సంచరిస్తుంది. అలాగే యోగి కూడా ఏకాంతంగా సంచరించాలని తెలుసుకున్నాను.

**23. సాలీడు :** సాలీడు తన శరీరం నుంచి దారాల్ని పుట్టించి దానితో గూడు అల్లుకుంటుంది. తరువాత తన దారాల్ని తానే తినేస్తుంది. ఆ సాలీడులాగానే పరమేశ్వరుడు కూడా తన నుంచే విశ్వాన్ని సృష్టించి కొంతకాలానికి ఆ విశ్వాన్ని తానే లయం చేసుకుంటాడని తెలుసుకున్నాను.

**24. కందిరీగ :** ఇది ఒక గోడమీద మట్టిగూడును కట్టి అందులో ఒక పురుగుని పెట్టి దాన్ని తన మొనతో కుడుతూ నిత్యం ఝుంకారం

చేస్తూ వుండటం వల్ల ఆ గూడులోని పురుగు కూడా పురుగుమీద భయంతో కందిరీగలా మారిపోతుంది.

అదేవిధంగా ప్రేమతోగానీ, ద్వేషంతోగానీ, భయంతోగానీ, నిరంతరం భగవంతుణ్ణి ధ్యానిస్తే చివరికి భగవంతుడి సారూప్యం పొందవచ్చని గ్రహించాను.

**25. శరీరం :** రాజా! నా శరీరం నుంచి కూడా నేనెన్నో విషయాలు తెలుసుకున్నాను. నాది అనుకున్న శరీరం అగ్నికి ఆహుతైపోతుంది. లేదా ఇతర జీవాలకు ఆహారమైపోతుంది. భగవంతుడు ఒక్క మానవుడికే తనని తెలుసుకునే జ్ఞానాన్నిచ్చాడు. ఇది తెలుసుకోక మానవులు చచ్చేంతవరకూ ఇంద్రియ విషయాల మాయలోపడి కొట్టుకుంటారు. కనుక శరీరం పతనం కాకముందే పరమాత్మ గురించి తెలుసుకుని, దేహాభిమానాన్ని విడిచి వైరాగ్యభావంతో పరమాత్మ సాయుజ్యాన్ని పొందాలని తెలుసుకున్నాను.

"రాజా! నీకిప్పుడు చెప్పిన గురువుల నుంచీ నా శరీరం నుంచీ తెలుసుకున్న పాఠాలను నిజజీవితంలో అవలంబిస్తున్నాను. ఇప్పుడు నాకు సంపూర్ణ వైరాగ్యం లభించింది. నేను నాది అనే భావం నాలోలేదు. ఎలాంటి కోరికలూ లేవు. అందుకే నేను మీకు నిర్వికారంగా నిర్లిప్తంగా ప్రకాశిస్తూ కనిపిస్తున్నాను" అని చెప్పాడు అవధూత దత్తాత్రేయుడు.

## సిద్ధులు

శ్రీకృష్ణుడు తన ప్రియమిత్రుడైన ఉద్ధవుడితో నిరంతరం ధ్యానం చేస్తూ ఇంద్రియాలను, మనస్సును, ప్రాణాన్ని జయించిన యోగికి ఎలాంటి సిద్ధులు లభిస్తాయో చెప్పాడు.

### పరమార్థానికి ఉపయోగపడే సిద్ధులు

**1. అణిమాసిద్ధి :** ఇది శరీరాన్ని అణువంత చిన్నగా చేస్తుంది.

2. **మహిమాసిద్ధి :** దీని ద్వారా శరీరాన్ని ఎంతో పెద్దదిగా చేయవచ్చు.

3. **లఘిమాసిద్ధి :** దీనివల్ల అతి తేలికగా శరీరం మారిపోతుంది.

4. **గరిమాసిద్ధి :** దీనివల్ల శరీరం చాలా బరువుగా మారిపోతుంది.

5. **ప్రాప్తిసిద్ధి :** దీని ద్వారా ఇతర జీవులు పొందే అనుభవాలతో సంబంధం పెట్టుకోవచ్చు.

6. **ప్రాకామ్యసిద్ధి :** దివ్యలోకాల్లో లభించే సుఖాల్ని ఇక్కడనుంచే అనుభవించవచ్చు.

7. **ఈశత్వసిద్ధి :** తన సంకల్పానుసారం ఇతరుల్ని నడిపించవచ్చు.

8. **వశిత్వసిద్ధి :** విషయసుఖాల మధ్య ఉంటూ కూడా వాటిమీద వ్యామోహం లేకుండా వుండవచ్చు.

ఈ ఎనిమిది సిద్ధులనూ అష్టసిద్ధులంటారు. నిరంతరం యోగాభ్యాసం చేసేవారికి ఇవి లభిస్తాయి. అయితే నిజమైన యోగి ఈ సిద్ధుల్ని లౌకికానికి కాకుండా కేవలం పరమాత్మను పొందటం కోసమే వినియోగిస్తారు. ఇవిగాక మరో పదిరకాల సిద్ధులున్నాయి.

1. **అమార్మిత్వం :** శరీరానికి ఆకలిదప్పికలు, వార్ధక్యం లేకుండా చేస్తుంది. 2.దూరశ్రవణం, 3.దూరదర్శనం, 4.మనోజవం (మనస్సంత వేగంగా పయనించటం) 5.కామరూపం(కోరిన రూపాన్ని ధరించటం) 6.పరకాయ ప్రవేశం (చనిపోయిన వారి శరీరాల్లోకి ప్రవేశించటం) 7.స్వచ్ఛంద మరణం (తన ఇష్టం వచ్చినప్పుడు మరణించటం) 8.రమణశక్తి (దేవతలు అనుభవించే సుఖక్రీడల్ని అనుభవించటం) 9.సంకల్పసిద్ధి (తాను కోరుకున్న వాటిని పొందటం) 10.అప్రతి హతగమనం (కోరినచోటికి అడ్డులేకుండా వెళ్ళగలగటం) ఈ పది సిద్ధులూ లౌకికసిద్ధులు.

వీటితో పాటు 1.త్రికాలజ్ఞానం 2.అద్వంద్వం(వేడికి చలికి చలించకుండా వుండటం) 3.పరచిత్తాభిజ్ఞత (ఇతరుల మనసులలోని

విషయాల్ని గ్రహించటం) 4.స్తంభనం (నిప్పులో నీటిలో కాలకుండా, తడవకుండా వుండటం) 5.అపరాజయం (ఎవరితో ఓడిపోకుండా వుండటం)

ఉద్ధవా! ఇప్పుడు నేను చెప్పిన సిద్ధులన్నీ భగవద్ధ్యాన నిమగ్నులైన యోగులకు లభిస్తాయి. అయితే ఈ సిద్ధుల ఆకర్షణలో పడ్డవాడు మాయబద్ధుడై తన అసలు లక్ష్యాన్ని విస్మరిస్తాడు. కనుక ఈ సిద్ధుల విషయంలో చాలా జాగ్రత్తగా వుండాలి అని శ్రీకృష్ణుడు ఉపదేశించాడు.

## సన్యాసాశ్రమం

**శ్రీ**కృష్ణుడు ఉద్ధవుడికి సన్న్యాసాశ్రమ నియమాలను గురించి ఇలా బోధించాడు.

ఉద్ధవా! సన్న్యాసాశ్రమాన్ని బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థాశ్రమాలలో దేనినుంచైనా స్వీకరించవచ్చు. అయితే స్వీకరించే వాడికి ఇహపరలోక భోగాల మీద తీవ్రమైన వైరాగ్యం వుండాలి. ప్రాజాపత్యేష్టి యాగాన్ని ఆచరించి తనకున్న సంపదనంతా దానం చేసి దేనిమీదా కోరిక లేకుండా పరమాత్మను హృదయంలో ప్రతిష్టించుకోవాలి. భార్యాపుత్రులు బంధుమిత్రులు కలిగించే బంధాలను అవరోధాలను అతిక్రమించాలి. కౌపీనాన్ని దాని మీద మొలచుట్టూ ఒక గుడ్డను మాత్రమే ధరించాలి. ఉత్తరీయం వేసుకోకూడదు. దండం భిక్షాపాత్ర తప్ప మరేదీ ఉంచుకోకూడదు. నేలని చూస్తూ నడవాలి. నీళ్ళను వస్త్రంలో వడబోసుకుని త్రాగాలి. ఎప్పుడూ సత్యాన్నే పలకాలి. మౌనవ్రతాన్ని ఆచరించాలి. కామ్యకర్మల్ని చేయాలనే ఆలోచనే రాకూడదు. ఏడు ఇళ్ళలో మాత్రమే భిక్ష అర్థించి లభించిన దానితో సంతృప్తి చెందాలి. ఊరిబయట వున్న నదిలోగానీ, చెరువులోగానీ స్నానంచేసి తాను సేకరించిన భిక్షలో కొంత ఇతర జీవులకు అర్పించి మిగిలింది తాను తినాలి.

సన్న్యాసి ఎప్పుడూ ఒంటరిగానే సంచరించాలి. కేవలం భిక్ష కోసమే గ్రామంలోకి వెళ్ళాలి. ఈ దృశ్య జగత్తంతా అశాశ్వతం అని గుర్తుంచుకోవాలి.

మోక్షం మీద కోరిక కూడా వదిలేసి కేవలం జ్ఞానసాధన మీదే మనసు లగ్నం చేయాలి. బాలుడిలాగా, మందుడిలాగా, పిచ్చివాడిలాగా, తన ప్రపంచంలో తానే ఉంటూ భగవద్ధ్యానం చేయాలి.

వైదిక ధర్మాల్ని పాటిస్తున్నా కర్మకాండల మీద ఆసక్తి చూపకూడదు. ఎవరికీ దేనికీ భయపడకూడదు. ఎవరికీ భయం కలిగించకూడదు. ఇతరులు తనని అవమానించినా, తాను మనోవాక్కాయ కర్మలతో ఎవరినీ బాధించకూడదు. సకలజీవుల్లో ఆ సర్వేశ్వరుడే వున్నాడని భావించాలి. సన్న్యాసి తనకు ఆత్మజ్ఞానం కలిగే వరకూ గురువులని ఆశ్రయించాలి. గురువును పరబ్రహ్మ స్వరూపుడుగా భావించాలి. సంపూర్ణంగా వైరాగ్యభావం వుంటేనే సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించాలి. లేకపోతే పుణ్యానికి బదులు పాపం వస్తుంది. పరమార్థం నశిస్తుంది.

## భాగవత ధర్మాలు

**స్వా**యంభువ మనువు మునిమనుమడు ఋషభుడు. అతడి కుమారుడైన ప్రబుద్ధుడు, విదేహరాజైన 'నిమి'కి భాగవత ధర్మాల గురించి ఈవిధంగా ఉపదేశించాడు. "మహారాజా! మానవుడు తాను జీవించి వున్నంతకాలం బాధలు పోవటానికి, సుఖం పొందటానికీ ఏవో కర్మల్ని ఆచరిస్తూనే వుంటాడు. తాను కర్మల ద్వారా విశేషంగా సంపదల్ని ఆర్జించి తాను కోరినవన్నీ అనుభవించాలనుకుంటాడు.

అలాగే యజ్ఞయాగాది క్రతువుల్ని ఆచరించి తద్వారా స్వర్గలోకసుఖాలు పొందాలని వాంఛిస్తాడు. అయితే మానవుడు తాను అనుకున్నవన్నీ పొందుతున్నాడా అంటే? లేదు సుఖాల రూపంలో కనిపించే దుఃఖాన్నే పొందుతున్నాడు. కర్మల ద్వారా అతడు పొందే సుఖాలన్నీ శాశ్వతమైనవి కాదు. అన్నీ నశించేవే. అయితే శాశ్వత సుఖాన్నిచ్చే సాధన ఏది అంటే! ఒక సద్గురువును ఆశ్రయించి భాగవత ధర్మాల్ని ఆచరించటం. దీనికి మొదటగా చేయాల్సింది "ప్రతిరోజూ కొద్దికొద్దిగా తన ఆయుర్దాయం క్షీణిస్తున్నప్పటికీ, తన శరీరం, భార్య, బంధువులు, పుత్రులు, సంపదలు. వాటిమీద మమకారాన్ని

వదులుకోలేక, సంసారాంధకారంలో పడికొట్టుకుంటూ, దేహమే గొప్పదని భావిస్తూ దాన్ని సుఖపెట్టాలని నిత్యం ఎన్నో యాతనలు పడుతూ దైవం గురించి విస్మరించే మూర్ఖులతో సాహసం తక్షణమే వదులుకోవాలి.

**భాగవత ధర్మాలు**

1.సత్త్వగుణం 2.భూతదయ 3.హరికథామృతం వినాలనే కోరిక 4.బ్రహ్మచర్యం 5.విషయ సుఖాలమీద విరక్తి 6.సజ్జనులతో మైత్రి 7.సాధువులతో సాంగత్యం 8.వినయగుణం 9.అంతర్ బహిర్శుద్ధి 10.తపస్సు 11.క్షమ 12మౌనవ్రతం 13.వేదాధ్యయనం 14.శాస్త్రాధ్యయనం 15.అహింసా చరణం 16.సుఖదుఃఖాలను సమానంగా సహించటం 17.పరమాత్మను సర్వవ్యాపకుడుగా గుర్తించటం 18.మోక్షాన్ని పొందాలని తీవ్రంగా తపించటం 19.జనసందోహ ప్రదేశాల్ని వర్జించటం 20.నారవస్త్రాలను ధరించటం 21.దొరికిన దానితోనే సంతృప్తి చెందటం. 22.వేదాంత శాస్త్రం మీద మక్కువ కలిగి వుండటం 23.ఇతర దేవతల్ని నిందించకుండా వుండటం 24.త్రికరణ శుద్ధిగా వుండటం 25.సత్యవచనాలనే పలకటం 26.శమదమాది గుణాలను సాధనచేయటం 27.తన ఇల్లు, వాకిలి, క్షేత్రం, భార్య, పుత్ర, సంపదల్ని శ్రీహరికే సమర్పించటం 28. శ్రీహరి భక్తులు కానివారి దగ్గరకు వెళ్ళకుండా వుండటం.

ఇవన్నీ భాగవతధర్మాలు. ఓ విదేహ రాజా! మానవుడు పై తెలిపిన భాగవత ధర్మాల్ని ఆచరిస్తూ, నిత్యం హరిభక్తులతో స్నేహం చేస్తూ, శ్రీహరి దివ్యలీలా విలాసాలను స్మరిస్తూ, ఆనందబాష్పాలతో పులకించేవాడే విష్ణుమాయను దాటుకుని దివ్యధామానికి చేరగలడు.

## శ్రీకృష్ణుడు చెప్పిన సాధనాంగాలు

**శ్రీ**కృష్ణుడు తన ప్రియసఖుడైన ఉద్ధవుడికి ఎన్నో ఆధ్యాత్మిక, తాత్త్విక విషయాల గురించి సవివరంగా బోధించాడు. దీనినే ఉద్ధవగీత అంటారు. ఈ బోధలో భాగంగా సాధకుడైన ప్రతివాడూ ఆచరించాల్సిన కొన్ని నియమాల గురించి ప్రబోధించాడు.

**1. యమాలు**

1.అహింస 2.సత్యం 3.అస్తేయం 4.అసంగం 5.హ్రీ 6.అసంచయం 7.ఆస్తిక్యం 8.బ్రహ్మచర్యం 9.మౌనం 10.స్థైర్యం 11.క్షమ 12.అభయం అనేవి యమాలు. వీటి గురించి వివరంగా తెలుసుకోవాలి.

1. **అహింస :** మనోవాక్కాయ కర్మలతో ఏజీవికీ ఎలాంటి బాధనీ కల్పించకపోవటం.
2. **సత్యం :** ప్రియమైన మాటలతో కూడిన సత్య వచనం.
3. **అస్తేయం :** ఇతరుల వస్తువుల్ని మనసులో కూడా కావాలి అని కోరుకోకపోవటం.
4. **అసంగం :** ఏ విషయం మీద, వస్తువుల మీద, వ్యక్తుల మీద ప్రత్యేకంగా అభిమానం లేకుండా వుండటం.
5. **హ్రీ :** చేయకూడని పన్లు చేయటానికి, ఇవ్వగలిగి వుండీ ఇవ్వనందుకు సిగ్గుపడటం.
6. **అసంచయం :** వస్తువుల్ని, ధనాన్ని ఒకచోట కూడబెట్టాలనే కాంక్ష లేకుండా వుండటం.
7. **ఆస్తిక్యం :** వేదశాస్త్ర విషయాల మీద సంపూర్ణమైన విశ్వాసం కలిగి వుండటం.
8. **బ్రహ్మచర్యం :** స్త్రీ సాంగత్యాన్ని విషయసుఖాల్ని వర్జించటం.
9. **మౌనం :** వాక్కుద్వారా, మనసుద్వారా శాంతిని పాటించటం.
10. **స్థైర్యం :** మానసికంగా ఏ విషయంలోనైనా స్థిరభావాన్ని కలిగి వుండటం.
11. **క్షమ :** ఇతరులు తన గురించి చేసే చెడ్డపనుల మీద సహనాన్ని చూపటం.
12. **అభయం :** ఏవిషయంలోనూ ఎవ్వరికీ భయపడకపోవటం.

**2. నియమాలు**

1.జపం 2.తపం 3.హోమం 4.శ్రద్ధ 5.ఆతిథ్యం 6.భగవదర్చనం 7.తీర్థయాత్ర 8.పరోపకారం 9.సంతుష్టి 10.ఆచార్యసేవ 11.అంతఃశౌచం 12.బాహ్యాశౌచం. వీటి గురించి వివరంగా తెలుసుకోవాలి.

1. **జపం :** మంత్రాన్ని తనకు మాత్రమే వినపడేలా ఆవృత్తి చేయటం.
2. **తపం :** శారీరక సుఖాల్ని, అవసరాల్ని విడిచిపెట్టి ఏకైక లక్ష్యం గురించి ధ్యానించటం.
3. **హోమం :** అగ్నిలో ఆహుతుల్ని సమర్పించి మంత్రాలతో ఆరాధించటం.
4. **శ్రద్ధ :** గురువాక్యం మీద శ్రద్ధ కలిగి, విశ్వాసంతో చేసే పనిని దీక్షగా చేయటం.
5. **ఆతిథ్యం :** భగవంతుడే అతిథిరూపంలో వచ్చాడని భావించి అతన్ని సేవించటం.
6. **భగవదర్చనం :** షోడశోపచారాలతో నిత్యం భగవంతుణ్ణి పూజించటం.
7. **తీర్థయాత్ర :** పుణ్యక్షేత్రాలను భక్తిశ్రద్ధలతో దర్శించటం.
8. **పరోపకారం :** స్వార్థరహితంగా, ఎలాంటి భేదభావాలు లేకుండా ఇతరులకు మేలు చేయటం.
9. **సంతుష్టి :** తనకు లభించిందే దేవుడి ప్రసాదమని భావించి సంతృప్తిగా స్వీకరించటం.
10. **ఆచార్యసేవనం :** జ్ఞానదాతలైన గురువుల్ని భక్తిశ్రద్ధలతో సేవించటం.
11. **అంతఃశౌచం :** రాగద్వేషాలతో మనసుని కలుషితం కాకుండా చూసుకోవటం.
12. **బహిఃశౌచం :** శరీరాన్ని, పరిసరాల్ని స్నానంతో, మార్జనంతో పవిత్రంగా వుంచుకోవటం.

"ఉద్ధవా ఇప్పుడు నేను నీకు చెప్పిన యమనియమాలతో పాటు ఇంకా ఎన్నో నియమాల్ని మానవుడు పాటించాలి. వాటిని పాటించటం ద్వారా నన్ను చేరుకుంటాడు. ఆ విషయాలు వాటి లక్షణాలు చెబుతున్నా శ్రద్ధగా విను" అని శ్రీ కృష్ణుడు ఇలా చెప్పటం ప్రారంభించాడు.

1. **శమం :** మనస్సును నిగ్రహించకుని భగవంతుడి మీదే స్థిరంగా లగ్నం చేయటం.
2. **దమం :** ఇంద్రియాలు వాటిష్టం వచ్చినట్టు సంచరించకుండా అదుపులో వుంచటం.
3. **తితిక్ష :** శారీరక మానసిక బాధల్ని ఓర్పుగా సహించటం.
4. **ధృతి :** జిహ్వాచాపల్యానికి, సంభోగానికి లొంగిపోకుండా వుండటం.
5. **దానం :** ఏ ప్రాణినీ ద్వేషించకుండా, ద్రోహం తలపెట్టకుండా వుండటమే దానం. కేవలం ధనం ఇస్తే అది దానం కాదు.
6. **శౌర్యం :** ఆకలి దప్పికల్ని స్వభావాన్ని జయించటం.
7. **సత్యం :** ఆత్మ అనేది అంతటా వ్యాపించి వుందని తెలుసుకోవటం సమదర్శి కావటం.
8. **ఋతం :** ఉన్నది ఉన్నట్టుగా పలకటం.
9. **శౌచం :** తాను చేసే పనుల్లో కర్తృత్వభావం లేకుండా వుండటం.
10. **త్యాగం :** కర్మల్ని ఆచరించి కర్మఫలాల్ని విడిచిపెట్టటం.
11. **ధనం :** ధర్మమే గొప్పధనం. భగవంతుడి మీద భక్తిని కలిగించేదే ధర్మం.
12. **దక్షిణ :** జ్ఞానాన్ని అనుగ్రహించిన గురువుకు కృతజ్ఞతగా శిష్యుడు సమర్పించేది.
13. **యజ్ఞం :** సకల కల్యాణ గుణస్వరూపుడైన నేనే యజ్ఞం.
14. **బలం :** ప్రాణాయామమే బలం.
15. **ఈశ్వరభావం :** భగవంతుడి దివ్యతేజస్సును గురించి తెలుసుకోవటం.

**16. భగం :** ఐశ్వర్యం, శౌర్యం, కీర్తి, వైరాగ్యం, సమగ్రత వంటివి కలిసి వున్న భగవంతుడి తత్త్వం.

**17. లాభం :** ఏ కోరికలూ లేకుండా భగవంతుడి మీద భక్తిని కలిగి వుండటం.

**18. దయ :** నిస్వార్థంగా ఇతరుల బాధలకు స్పందించి వారి బాధల్ని ఎలాగైనా నివారించుకోవాలనుకోవటం.

**19. విద్య :** దేవతల్లో, మానవుల్లో, పశుపక్ష్యాదుల్లో ఒకే ఆత్మ వుందని తెలుసుకోవటం.

**20. శ్రీ :** దేనిమీద అపేక్ష లేకుండా లభించిన దానితో సంతృప్తి చెందటం.

**21. సుఖం :** దుఃఖానికి సుఖానికీ అతీతంగా వుండటం.

**22. దుఃఖం :** విషయ సుఖాల మీద కోరిక కలిగి వుండటం.

**23. పండితుడు :** బంధాలకూ, మోక్షానికీ కారణం తెలిసినవాడు.

**24. మూర్ఖుడు :** దేహమే నేను అని అహంకార మమకారాలున్నవాడు.

**25. సన్మార్గం :** భగవంతుణ్ణి చేరటానికి దారిచూపే వైరాగ్యం.

**26. చెడ్డమార్గం :** మనస్సును ఇంద్రియ సుఖాలవైపు మళ్ళించటం.

**27. స్వర్గం :** మనసులో రజోగుణం, తమోగుణం క్షీణించి సత్త్వగుణం వృద్ధిచెందే స్థితి.

**28. నరకం :** మనసులో తామసగుణం వృద్ధి చెందిన స్థితి.

**29. బంధువు :** జ్ఞానాన్ని ప్రసాదించే గురువు. ఆ గురువుని నేనే ఉద్ధవా!

**30. గృహం :** శరీరమే మనిషికి గృహం.

**31. ధనవంతుడు :** సద్గుణాలతో నిండినవాడు.

**32. దరిద్రుడు :** సంతృప్తి లేనివాడు.

**33. కృపణుడు :** ఇంద్రియాలను అదుపులో ఉంచుకోలేనివాడు. అనగా హీనుడు.

**34. ప్రభువు :** ఇంద్రియ విషయ సుఖాలవైపు పరుగులు తీయకుండా తన అదుపులో వుంచుకున్నవాడు.

**35. బానిస :** ఇంద్రియాల చెప్పుచేతల్లో వున్నవాడు.

**36. దోషం :** ఏ వస్తువులోనైనా గుణదోషాల్ని వెతికి చూడటం.

**37. శ్రేష్ఠం :** గుణదోష విచారణ చేయకుండా అన్నీ ఈశ్వర స్వరూపమే అని గ్రహించి సమభావంతో వుండటం.

## జనన మరణాలు

**ఆ**త్మ నిత్యమైంది. దానికి నాశనం లేదు. అది క్షణక్షణం మారుతూ చివరికి నశించే శరీరం లోపల చేరుతుంది. ఈ సత్యాన్ని జ్ఞానులు మాత్రమే తెలుసుకోగలరు. అసలైన ఆత్మతత్త్వాన్ని తెలుసుకోలేని అజ్ఞానులు తమ శరీరమే సర్వస్వమని భ్రమిస్తూ తాముచేసే అన్ని పనుల్నీ శారీరక సుఖం కోసమే చేస్తూ శరీరం మీద ధ్యాసతోనే మరణించి తిరిగి శరీరాన్నే మరలమరల పొందుతుంటారు. అది ఎలా జరుగుతుందంటే? పదహారు తత్త్వాలతో వున్న సూక్ష్మశరీరం ఒక స్థూలశరీరాన్ని విడిచిపెట్టి బీజరూపంగా వేరొక గర్భంలోకి ప్రవేశించి శరీరాన్ని ధరిస్తుంది. అవసరమైతే ఒక లోకం నుంచి మరోలోకానికి ప్రయాణిస్తుంది.

జీవుడు సూక్ష్మశరీరంతో తాదాత్మ్యం చెంది వుండటం వల్ల దాన్ని అంటిపెట్టుకుని దానితోనే ప్రయాణిస్తాడు. పూర్వజన్మలో చేసిన పుణ్యఫలాలకు అనుగుణంగా సుఖాలు వస్తే సంతోషించటం, దుఃఖాలు వస్తే బాధపడటం జరుగుతుంది. జీవుడికి మరణం సంభవించిన తరువాత గతజన్మ స్మృతులు లేకపోయినప్పటికీ గాఢమైన అనుభవాల వాసనలు మాత్రం అతని మనసుని అంటి పెట్టుకునే వుంటాయి. మరణ సమయంలో జీవుడి మనసు అతడి కర్మానుసారం దేనిని స్మరిస్తుందో దానికి సంబంధించిన శరీరాన్నే అది పొందుతుంది. ఈ ప్రకృతితో పాటు సృష్టించబడ్డవన్నీ క్షణక్షణం మారుతూనే వుంటాయి. అయితే మానవుల స్థూలదృష్టికి ఆ మార్పులు కనిపించవు.

ఉద్ధవా! వెలుగుతున్న దీపంలో జ్యోతికణాలు పుట్టి ఆరిపోతుంటాయి. అయితే ఆ జ్యోతిమాత్రం నిలకడగా వెలుగుతూ మనకి కనిపిస్తుంది.

అదేవిధంగా ఒక నదిలో వున్న నీటికణాలు ఒకచోటే వుండకుండా ప్రవహిస్తూనే వుంటాయి. అయితే స్థూలంగా చూస్తే ఆ నది మనకు నిశ్చలంగా వున్నట్టు కనిపిస్తుంది. ఇలాగే వృక్షాలు, పర్వతాలు, సకల జీవరాసులూ ప్రతిక్షణం కాలప్రభావానికి గురౌతూ మార్పు చెందుతున్నా ఆ మార్పు స్థూలదృష్టికి గోచరించదు.

మానవ శరీరంలో ప్రధానంగా తొమ్మిదిరకాల మార్పులు జరుగుతుంటాయి. 1.నిషేకం (బీజంగా గర్భంలోకి ప్రవేశించటం) 2.గర్భంలో శిశువుగా పెరగటం 3.జన్మించటం 4.బాల్యావస్థ 5.కుమారావస్థ 6.యౌవనదశ 7.మధ్యవయసు 8.వార్ధక్యం 9.మరణం. వాస్తవానికి ఆత్మకి మరణం లేదు. జననం లేదు. ఆ రెండూ శరీరానికి సంబంధించిన క్రియలు. ఆత్మవేరు శరీరం వేరు అని తెలుసుకోలేని అజ్ఞానులు సంసారసాగరంలో పడిపోతారు.

ఉద్ధవా! మానవుడు సత్త్వగుణాన్ని నింపుకుని వుండగా మరణాన్ని పొందితే అతడికి దేవ, ఋషి, సాధువుల శరీరం లభిస్తుంది. రజోగుణం అధికంగా వున్నప్పుడు మరణిస్తే మానవ, రాక్షస శరీరాలు లభిస్తాయి. తామసగుణంతో నిండి వున్నప్పుడు శరీరం నశిస్తే పిశాచ, మృగ, పశు, పక్ష్యాది జన్మలు లభిస్తాయి. మనసులో ఊహించిన వాటిమీదనైనా సరే సంగం ఏర్పడితే చాలు, బుద్ధి చలించి వాసనలు అనేవి ఏర్పడతాయి. దేహంతో తాదాత్మ్య భావం వీడనంత వరకూ జీవుడికి సంసారబాధలు తప్పవు. ఎవరు ఏంచెప్పినా! ఎంతచెప్పినా ఉద్ధవా! పరమాత్మ అంశతో వున్న జీవాత్మ శరీరం కన్నా భిన్నమైనదని స్థిరంగా తెలుసుకోవాలి. ఈవిధంగా శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవుడికి జననమరణ వలయం గురించి సవివరంగా బోధించాడు.

## కర్మ - జ్ఞాన - భక్తి యోగాలు

**ఉ**ద్ధవా! సాధకుల్లో వారివారి స్థాయిల్ని బట్టి మూడుమార్గాల్ని నేను నిర్దేశించాను. అవి 1.కర్మయోగం 2.జ్ఞానయోగం 3.భక్తియోగం. ఈ మూడు

మార్గాల ద్వారా నన్ను చేరుకోవచ్చు. ఈ మూడూ గొప్పవే. వీటిలో కర్మయోగం అనేది – వేదాల్లో, శాస్త్రాల్లో చెప్పబడ్డ వివిధరకాల కర్మల్ని ఆచరిస్తూ ఇహలోక పరలోక సుఖాల్ని కాంక్షిస్తూ వాటికోసం తాపత్రయపడే జీవులకు ఉపయోగపడుతుంది. అలాగే జ్ఞానయోగం అనేది ఇహ–పర లోకాల మీద ఎలాంటి కోరికా లేకుండా ఈ దేహం, ఇంద్రియాలు, బుద్ధి వీటితో పాటూ ఈ ప్రపంచమంతా నశించిపోయేదే అని గ్రహించి నిత్యమైనది సత్యమైనది అయిన ఆత్మను పొందాలనుకునేవారికి ఉపయోగపడుతుంది.

నా దివ్యానుగ్రహంతో మానవులకు నా దివ్యలీలల్ని వినాలనే ఆసక్తీ, నా దివ్యనామాన్ని నిరంతరం గానం చేయాలనే ఉత్సాహం కలుగుతుంది. అలాంటి సాధకులు ఎలాంటి సుఖాలమీదా కాంక్ష లేకుండా నా పాదాలనే ఆశ్రయించి ఉండాలనుకునే వారి కోసం చెప్పబడిందే భక్తియోగం. ఉద్ధవా! ఈ మూడు మార్గాలు తప్ప నన్ను చేరటానికి మరోమార్గం లేదు.

కామ్య కర్మల్ని నిత్యం ఆచరిస్తూ వుండే మానవుడు కొన్నాళ్ళకి వాటిమీద ఆసక్తి తగ్గి క్రమంగా నిష్కామ కర్మల్ని కేవలం నా ప్రీతి కోసమే ఆచరిస్తూ నా మీద అనన్యమైన భక్తిప్రపత్తులు పెంపొందించుకుంటాడు. లేదా వైరాగ్యంతో జ్ఞానమార్గం ద్వారా సాధన చేసుకోవాలనుకుంటాడు. ఈ మానవ శరీరం ఒక్కటే మోక్షానికి సాధనం. మోక్షం పొందాలనుకునే దేవతలు కూడా అందుకోసం ఈ మానవశరీరాన్నే పొందాలని కోరుకుంటారు. ఈ శరీరమే సంసారసాగరాన్ని దాటటానికి ఏకైక సాధనం. అలాంటి శరీరాన్ని మీరు సద్వినియోగపరుచుకోవాలి.

సద్గురువు ఒక్కడే సంసారసాగరాన్ని దాటించగలడు. మనసు చాలా చంచలమైనది. పొగరుబోతు గుర్రాన్ని ఎలా లొంగదీసుకుని అదుపులో వుంచుకుంటామో మనసును కూడా అలాగే లొంగదీసి అదుపులో వుంచుకోవాలి. మనసును నిత్యం భగవతత్త్వ చింతన మీద నిలిపి వుంచితే అది ఇతర

విషయాలవైపు మళ్ళదు. భగవంతుణ్ణి పొందాలనుకునేవారు కామ్యంతో ఎలాంటి పనీ చేయకూడదు. ఇది మంచిదని స్వీకరించటం, ఇది చెడు అని తిరస్కరించటం చేయకూడదు.

ఉద్ధవా! బ్రహ్మచారి అయినవాడు గృహస్థుల ధర్మాల్ని ఆచరించకూడదు. అలాగే గృహస్థుడు సన్న్యాసిలాగా ప్రవర్తించకూడదు. మంచి, చెడు అన్న విచక్షణ లౌకిక విషయాలలోనేగానీ పరమాత్మ విషయంలో చూపకూడదు. నన్ను చేరాలనుకునేవాడికి నా కథల మీద నా దివ్యలీలల మీదా అంతులేని ఆసక్తి ఏర్పడుతుంది. నన్ను సాధకుడు తన మనసులో నిలుపుకోగానే అతడి కోరికలన్నీ క్రమంగా నశిస్తాయి. కొత్త కోరికలు పుట్టవు. ఆ సాధకుడికి కోరికలు తీర్చుకోవాలన్న అభిలాష తగ్గిపోతుంది. చివరికి కోరికల మీదే విరక్తి పుడుతుంది.

నా మీద స్థిరమైన భక్తీ అనురక్తీ కలిగిన సాధకుడు సర్వభూతాంత రాత్ముడైన నన్ను ఎప్పుడూ తన హృదయంలో వుంచుకొని ధ్యానిస్తాడు. నా దివ్యదర్శనంతో ఆ సాధుకుడిలో వున్న సందేహాలు, కర్మలు అన్నీ తొలగిపోతాయి. అందుకే భక్తియోగం అనేది కర్మజ్ఞాన యోగాల కన్నా ఎంతో గొప్పది.

యజ్ఞయాగాలు, తీర్థయాత్రలు, జపతపాలు, జ్ఞానవైరాగ్యాలు ఇచ్చే ఫలాలన్నీ నామీద భక్తిప్రపత్తులు ఉన్నవాడికి వెంటనే లభిస్తాయి. నా భక్తులైనవారు నా నుంచి ఏదీ కోరరు. నేను ఇస్తానన్నా స్వీకరించరు. వారికి నామీద అనన్యమైన భక్తిప్రపత్తులు తప్ప మరే కోరికా వుండదు. మోక్షం పొందాలనేది గొప్ప కోరిక అయితే నా భక్తులు ఆ కోరికను కూడా కోరరు. పవిత్ర మనస్కులైన నా భక్తులకు ఇది మంచిది ఇదికాదు అన్న భేదం ఏదీ వుండదు. వారు అంతటా నా దివ్యరూపాన్నే దర్శిస్తూ నన్నే ప్రేమిస్తూ, నన్నే స్మరిస్తూ, నన్నే కీర్తిస్తూ వుంటారు.

ఉద్ధవా! నేను చెప్పిన ఈ దివ్య భక్తితత్త్వాన్ని అర్థం చేసుకుని ఆచరించినవారు పరమానందాన్ని నా దివ్య పరంధామాన్ని పొందుతారు.

# సాంఖ్యయోగం

**శ్రీ**కృష్ణుడు ఉద్ధవుడికి సాంఖ్యయోగాన్ని గురించి సవివరంగా ఇలా బోధించాడు. ఉద్ధవా! సాంఖ్యయోగం చాలా గొప్పది. దీన్ని సక్రమంగా గ్రహించినవాడు ఈ శరీరమే ఆత్మ అన్న భ్రమ తొలగిపోయి, ఆత్మ సర్వవ్యాపకత్వాన్ని గురించి తెలుసుకుంటాడు.

నామరూప గుణాలు లేనిదీ, వర్ణించలేని ఒకేఒక దివ్యరూపంతో వున్నదీ, ఎలాంటి వికారాలకూ లోనుకానిదీ అయిన దివ్యతత్త్వాన్నే పరబ్రహ్మ అంటారు. ఈ పరబ్రహ్మం రెండుగా రూపొందింది. ఒకటి మాయాస్వరూపం కాగా రెండోది పురుషరూపాన్ని ధరించింది. ఈ రూపాన్నే జీవుడు అంటారు. ఇక మాయ అనేది సత్త్వరజో, తమస్సులనే త్రిగుణాత్మక, క్రియాత్మక శక్తిగా మారి 'ప్రకృతి' అన్న పేరుతో వ్యవహరించబడింది. ప్రకృతి అంటే దివ్యమైన కార్యాలు చేయగలిగిన శక్తి. ఈ ప్రకృతే ప్రపంచంగా మారింది. ఇక పురుషుడనేవాడు పరమాత్మ జ్ఞానశక్తిగా వెలసిన స్వయంప్రకాశ జ్ఞానస్వరూపుడు. అంతేకాదు ఆనంద స్వరూపుడు కూడా. ఇక కాలం–ఇదికూడా ప్రకృతితో పాటు ఆవిర్భవించిన మహత్తర శక్తి.

కాలం అనేది ప్రకృతిలో వున్న త్రిగుణాల సమతౌల్యాన్ని బాధిస్తుంది. దానివల్ల క్రియాశక్తి అనే తత్త్వం పుడుతుంది. జ్ఞానశక్తినే మహత్తత్త్వం అంటారు. ఉద్ధవా! క్రియాశక్తి–జ్ఞానశక్తి ఈ రెండూ జంటగా పనిచేస్తాయి. ఈ మహత్తత్త్వం నుంచి 'అహం' అనే తత్త్వం పుట్టింది. దీన్నే 'అహంకారం' అంటారు. ఈ అహంకారమే జీవుడికి 'శరీరమే నేను' అనే భ్రమని కలుగచేస్తుంది.

ఈ అహంకారం 1.సాత్త్విక అహంకారం 2.రాజస అహంకారం 3.తామస అహంకారం అని మూడు విధాలుగా రూపొందుతుంది. ఉద్ధవా సాత్త్విక అహంకారం నుంచి – పది ఇంద్రియాలకూ, మనస్సుకూ అధిదేవతలైన సూర్య, చంద్ర, వరుణ, అగ్ని వంటి మొత్తం పదకొండుమంది దేవతలు

ఆవిర్భవించారు. రాజసిక అహంకారం నుంచి పదిఇంద్రియాలు, మనస్సు ఉద్భవించాయి. తామస అహంకారం నుంచి పంచతన్మాత్రలు, పంచభూతాలు జన్మించాయి.

ఉద్ధవా! ఇలా విడివిడిగా వున్న అన్ని తత్త్వాలలో నా చైతన్యశక్తిని ప్రవేశింపచేసి వాటన్నిటినీ సంఘటిత పరిచాను. అలా చేసిన తరువాత అవి ఒక అండాకారంగా మారాయి. ఆ అండం 'గర్భోదకం' అనే నీటిలో పెరగసాగింది. నేను అండంలో 'నారాయణ' స్వరూపంతో వెలసాను. నారాయణుడనైన నా నాభి నుంచి ప్రపంచం పద్మాకారంగా ఆవిర్భవించింది. ఆ పద్మం నుంచి చతుర్ముఖ బ్రహ్మ జన్మించాడు.

నా అనుగ్రహంతో బ్రహ్మదేవుడు క్రమంగా భూః, భువః, సువః అనే లోకాల్ని లోకాధిపతుల్ని, దిక్పాలకుల్ని సృష్టించాడు. ఈ భూలోకంతో పాటు అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళలోకాలు కూడా పుట్టాయి. భూలోకంలో మానవులు. దానిక్రింద వున్న లోకాల్లో నాగులు, అసురులు వుంటారు. ఇవి కింది లోకాలు కాగా, స్వర్గంతోపాటు మహర్లోకం, జనోలోకం, తపోలోకం, సత్యలోకం అనే ఊర్ధ్వలోకాలు కూడా ఆవిర్భవించాయి. ఈ ఊర్ధ్వ లోకాలలో దేవతలు, యోగులు, సిద్ధులు వుంటారు. స్వర్గలోకానికీ భూలోకానికీ మధ్యలో భువర్లోకం వుంటుంది. అందులో భూత, ప్రేత, పిశాచాలు వుంటాయి.

ఉద్ధవా! అన్ని లోకాలకన్నా గొప్పది నా నిజ, నిత్య నివాసమైన వైకుంఠధామం. నామీద అనన్యమైన భక్తి శ్రద్ధలు వున్నవారు మాత్రమే ఈ లోకానికి చేరుకోగలరు. నా లోకానికి వచ్చి నన్ను పొందిన వారికి జరామరణాలు వుండవు. ఈ సత్యాన్ని గ్రహించినవారికి విషయసుఖాల మీద విరక్తి కలుగుతుంది. ఒక్క బ్రహ్మదేవుడు సత్యలోకంలో నివాసం వున్నవారు తప్ప, మిగిలిన అన్ని లోకాల్లోనివారూ మళ్ళీ మళ్ళీ జన్మిస్తూ మరణిస్తూ వుంటారు. ఆ సత్యలోక వాసులు కూడా ప్రళయకాలం వరకూ జీవించి

చివరికి బ్రహ్మతోపాటు నాలో లయమైపోతారు. అంతేకాదు మహా ప్రళయకాలంలో ఈ సకల ప్రపంచమంతా సూక్ష్మరూపంలో నాలో లయమై తిరిగి ఆవిర్భవిస్తుంది.

ఉద్ధవా! అణువు నుంచి, మహత్తు వరకూ ఈ సృష్టి మొత్తం ప్రకృతి పురుషుల సంయోగం వల్లనే కలుగుతుంది. నేను మాత్రం ఈ సృష్టికి పూర్వం సృష్టి నిలిచివున్న కాలం సృష్టి లయమైన తరువాత కూడా స్థిరంగా నిలిచి వుంటాను. నాకు ఆది అంతాలు లేవు. ఆదిమధ్యాంతాలు లేనిదే నిత్యసత్యం. ఉద్ధవా! ఈ సృష్టి, స్థితి, లయాలూ మూడూ ఈశ్వరుడి ఆజ్ఞ వున్నంతవరకూ కొనసాగుతూనే వుంటాయి.

నూతనంగా ఆవిర్భవించిన ఈ బ్రహ్మాండమంతా కల్పాంతంలో లయమైపోతుంది. ఆ లయకాలంలో శరీరం అన్నంలో, అన్నం పంటల్లో, ఆ పంటలు భూమిలో కలిసిపోయి నశిస్తాయి. అనగా అన్నం లభించక శరీరం, పంటలు పండక అన్నం. భూమికి పండించే శక్తిలేక పంటలు క్రమంగా నశిస్తాయి. ఆ ప్రళయకాలంలో, భూమి తన తన్మాత్ర అయిన గంధంలో, ఆ గంధం జలంలో, ఆ జలం రసంలో, ఆ రసం తేజస్సులో, ఆ తేజస్సు రూపంలో, రూపం వాయువులో, వాయువు స్పర్శలో, స్పర్శ ఆకాశంలో, ఆకాశం శబ్దంలో, శబ్దం చివరికి తామసాహంకారంలో లయమైపోతాయి.

ఇంద్రియాలు రాజసాహంకారంలో, ఇంద్రియాల అధిదేవతలు మనస్సులో, ఆ మనస్సు సాత్త్వికాహంకారంలో లయమౌతాయి. ఈవిధంగా మూడు అహంకారాలూ మహత్తత్త్వంలో, ఆ మహత్తత్త్వం త్రిగుణాల్లో లయమైపోతాయి.

ఉద్ధవా! వీటితో పాటూ కాలం పురుషుడిలో లయమవగా, మాయని వశపరుచుకున్న పురుషుడు పరబ్రహ్మలో లీనమౌతారు. పరమాత్మనైన నేను నిత్యం వుండేవాడిని. సృష్టి, స్థితి, లయ కారకుణ్ణి నేనే. నా యధార్థతత్త్వాన్ని తెలుసుకున్నవాడికి ఆత్మతత్త్వం సంపూర్ణంగా అవగతమవుతుంది.

అతడికి అన్నిరకాల భ్రమలూ తొలగిపోతాయి. ఉద్ధవా! ప్రకృతి, పురుషుడు, సృష్టి, స్థితి, లయాలు, వ్యష్టి, సమిష్టితత్త్వాల గురించి నేను చెప్పిన ఈ విషయాలన్నిటినీ సాంఖ్యయోగమంటారు.

## త్రిగుణాలు

**శ్రీ**కృష్ణుడు ఉద్ధవుడితో చెబుతున్నాడు – ఉద్ధవా! సాంఖ్యయోగంలో భాగంగా నేను చెప్పిన ప్రకృతి, పురుషుల గురించి తెలుసుకున్నప్పటికీ, మానవుడికి త్రిగుణాల గురించి వాటి స్వభావం గురించి తెలుసుకోకపోతే దుఃఖం తొలగిపోదు.

ఇంద్రియనిగ్రహం, మనోనిగ్రహం, తితిక్ష, తత్త్వవివేచనం, స్వధర్మాచరణ, తపస్సు మీద అనురక్తి, సత్యనిష్ఠ, కరుణ, స్మృతి, సంతృప్తి, దానశీలత, భోగలాలస లేకపోవటం, భగవంతుడి మీద, పునర్జన్మ మీద విశ్వాసం కలిగి వుండటం, సిగ్గు, అధర్మకార్యాల మీద విముఖత, ఉదార స్వభావం, ఆత్మజ్ఞానం పొందాలనే కోరిక ఇవన్నీ సత్త్వగుణం వల్ల కలిగే శుభలక్షణాలు.

విషయ సుఖాలమీద ప్రీతి, స్వార్థం, అహంకారం, గర్వం, చంచలత్వం, మొండితనం, కోరికలతో కూడిన దైవపూజ, అతిశయం, భేదభావం, స్వానురక్తి, బలగర్వ ప్రదర్శన, ముఖస్తుతి, కీర్తికాంక్ష, అపహాస్యం చేయటం, శక్తి సామర్థ్యాలను అల్పుల మీద ప్రయోగించటం. ఇవన్నీ రజోగుణం వల్ల కలిగే అవలక్షణాలు.

ఇక తమోగుణం వల్ల – ప్రతీకారం, లోభం, అసత్యం, హింసాప్రవృత్తి, యాచకత్వం, కపటం, అలసత్వం కలహబుద్ధి, శోకం, మోహం, దైన్యం, నిద్రమత్తు, అత్యాశ, భయం, సోమరితనం, మాత్సర్యం, పగ, క్రోధం వంటి లక్షణాలు కలుగుతాయి.

ఉద్ధవా! ఈ మూడుగుణాలు ప్రతిజీవిలో వివిధపాళ్ళలో మిళితమై వుంటాయి. అహంకార మమకారాలకు రాజసిక తామసిక గుణాలే మూలకారణం. అసలు మనిషి ప్రవర్తనను శ్రద్ధగా పరిశీలిస్తే చాలు.

అతడు సాత్త్వికుడో, తామసికుడో అని తెలిసిపోతుంది. ఎలాంటి కోరికలు లేకుండా నన్ను ఆరాధించేవాడు సాత్త్వికుడు. సుఖభోగాలు కోరకుంటూ నన్ను సేవించేవాడు రాజసికుడు. ఇతరులను నాశనం చేసి తాను పైకిరావాలనే కోరికతో నన్ను ఆరాధించేవాడు తామసికుడు. ఈ మూడు గుణాలూ స్త్రీలలో, జంతువులలో కూడా వుంటాయి.

ఒకే వ్యక్తిలో ఈ త్రిగుణాలు ఆయా సమయ సందర్భాలను బట్టి పెరుగుతూ తరుగుతూ వుంటాయి. సత్త్వగుణం అధికంగా వుంటే మనసు చాలా ప్రశాంతంగా, ప్రసన్నంగా, ఆనందంగా ఆహ్లాదంగా వుంటుంది. రజోగుణం అధికంగా వుంటే మనసు చంచలంగా, ఉద్రేకంగా, రాగద్వేషాలతో, కామక్రోధాలతో నిండి వుంటుంది. అదే తమోగుణం అధికంగా వుంటే ఆ మానవుడి బుద్ధి మందంగా, మత్తుగా, పగ ప్రతీకారాలతో నిండి వుంటుంది.

త్రిగుణాల వల్ల జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు కలుగుతాయి. ఈ మూడు అవస్థల కన్నా అతీతమైన నాలుగో అవస్థను తురీయావస్థ అంటారు. ఈ తురీయావస్థలో జీవాత్మ నిలబడి అన్ని అవస్థల్నీ గమనిస్తూ వుంటుంది. మానవుడు సత్త్వగుణం అధికంగా వున్నప్పుడు మరణిస్తే ఊర్ధ్వలోకాలనూ, రజోగుణం అధికంగా వున్నప్పుడు మరణిస్తే తిరిగి భూలోకానికీ, తమోగుణం అధికంగా వున్నప్పుడు మరణిస్తే నరకలోకానికీ చేరుకుంటాడు.

ఉద్ధవా! రజస్తమోగుణాల్ని తొలగించుకుని కేవలం సత్త్వగుణంతో నిండినవారే నన్ను చేరుకుంటారు. సాత్త్వికులైన వారు జనసందోహం లేని అడవుల్లో నివసించటానికి ఇష్టపడతారు. రాజసికులు జనసందోహం వున్న పట్టణాలలో నివసించటానికి, తామసికులు మద్యశాలల్లో, జూదశాలల్లో ఉండటానికి ఇష్టపడతారు. త్రిగుణాతీతులు దేవాలయాలలో నివసించాలి అనుకుంటారు.

ఉద్ధవా! ఈవిధంగా సృష్టిలో వున్న ప్రతిదాని మీదా త్రిగుణాల ప్రభావం వుందని తెలుస్తోంది కదా! అన్నిరకాల కర్మల్లో, జ్ఞానంలో, సాధనల్లో, అభిరుచుల్లో, విద్యల్లో, పూజల్లో, శ్రద్ధలో, సుఖాలలో, ఆహారాలలో, ద్రవ్యాల్లో, శాస్త్రాధ్యయనాలలో, ఇంద్రియ విషయాలలో, మానసిక భావాల్లో ఇలా ప్రతివిషయంలో త్రిగుణాలనేవి కలిసి కనిపిస్తాయి. తమోగుణాన్ని రజోగుణాన్ని పోగొట్టుకుని, సత్త్వగుణాన్ని ప్రయత్న పూర్వకంగా పెంపొందించుకుని క్రమంగా త్రిగుణాతీతుడైన సాధకుడు నన్నే తన మనసులో స్థిరంగా నిలుపుకుని ఆరాధిస్తే అతడు తప్పక నా దివ్యధామాన్ని చేరుకుంటాడు.

## జ్ఞానయోగం

ఈ ప్రపంచమంతా భగవంతుడి స్వరూపం. ప్రతిజీవిలో ప్రతివస్తువులో భగవంతుడు సర్వాంతర్యామిగా వుండటం వల్ల ఏ జీవిని నిందించినా, హింసించినా, అది భగవంతుణ్ణి హింసించి, నిందించినట్టే అవుతుంది. భగవంతుడు వేరు, ఈ జీవుల ప్రపంచం వేరు అనుకునే వ్యక్తి ఆత్మతత్త్వాన్ని తెలుసుకోలేక ఎప్పటికీ అజ్ఞానంలోనే వుండిపోతాడు.

ఈ చరాచర ప్రపంచంలో వున్న సకల జీవరాసులు, అన్నిరకాల వస్తువులూ ప్రకృతికి సంబంధించిన ప్రతిరూపాలే. ఈ ప్రకృతి అనేది భగవంతుడి మాయతోనే పుట్టింది గనుక, ప్రకృతి, దానితో పాటు దాని ప్రతిరూపాలైన ఈ ప్రపంచం అంతా మిథ్యే. మానవులకు స్వప్నంలో కనిపించిన విషయాలన్నీ సత్యాలుగా అనిపించినా మెలకువ వచ్చేసరికి అవన్నీ మిథ్య అని తెలిసినట్టుగానే జ్ఞానోదయం అయిన వ్యక్తికి ఇదంతా మిథ్యే అని తెలుస్తుంది.

మిథ్య కాకుండా నిత్యంగా, సత్యంగా వుండేది కేవలం ఆత్మ ఒక్కటే అని తెలుసుకోవటమే జ్ఞానం. ఆత్మ అనేది సహజంగా పవిత్రమైనది. అయితే అది దేహంతో ఇంద్రియాలతో ప్రాణంతో కలిసి వుండటం వల్ల, వాటి మాయాస్వరూపాన్ని గ్రహించి అజ్ఞానంతో సంసారిగా అవుతుంది. దేహానికి, ఇంద్రియాలకి, మనస్సుకి కలిగే సుఖదుఃఖాలని, అనుభవాలనీ తనవిగానే

భావించి ఆ ఆత్మ భరిస్తుంది. అది అజ్ఞానంతో వుండటం వల్ల దేహమే నేను అనే భ్రమను పొంది ఈ శరీరంతో వియోగాన్ని సహించలేక తిరిగి మరో శరీరాన్ని పొంది ఈ లోకంలోకి ప్రవేశిస్తుంది. ఈవిధంగా జన్మపరంపరలు జీవుడికి ఏర్పడుతుంటాయి. ఈ పునర్జన్మలనేవి ఆత్మకే తప్ప శరీరానికి కాదు.

ఉద్ధవా! జీవాత్మ నిత్యమైనది కనుక దానికి చావుపుట్టుకలుండవు. సుఖదుఃఖాలు, జననమరణాలు ఇవన్నీ జీవుణ్ణి ఆశ్రయించి వున్న అహంకారానికి చెందినవి. ఈ మాయావరణ తొలగిపోవటాన్నే ముక్తి పొందటం అంటారు. సద్గురువు అనుగ్రహంతోనే జ్ఞానం లభించి జీవుడికి మాయావరణ తొలగిపోతుంది. నిరంతర వేదాధ్యయనం, తపస్సు, మహాపురుషుల బోధనల మీద భక్తివిశ్వాసాలు, ఆత్మానుభూతి, ఆదిమధ్యాంత రహితుడై వుండేది ఆ పరబ్రహ్మయే అన్న విశ్వాసం ఉంటేనే సంపూర్ణజ్ఞానం కలుగుతుంది.

పరబ్రహ్మ ప్రకృతి చేష్టలకు ఏమాత్రం చలించడు. మార్పు చెందదు. కనుక సాధకుడు నామీదే మనసు నిలిపి, పరబ్రహ్మ నిజతత్త్వాన్ని గ్రహించి, సాధువుల సజ్జనుల సాంగత్యం చేస్తూ పుణ్యతీర్థాలకు వెళ్ళి, సకల భూతాలలో నున్న నాలో సకల ప్రపంచాన్నీ దర్శిస్తూ, సమదర్శులుగా అనన్యభక్తితో నన్ను సేవించాలి. ఉద్ధవా! ఇదే భాగవతధర్మం. దీని ద్వారా తప్ప మరోమార్గం ద్వారా నన్ను ఎవరూ చేరుకోలేరు" అని శ్రీకృష్ణభగవానుడు ఉద్ధవుడికి త్రిగుణాలతత్త్వం గురించి ప్రబోధించాడు.

శ్రీకృష్ణుడి అవతార పరిసమాప్తి, ద్వాపరయుగం పరిసమాప్తం కాబోతోంది. శ్రీకృష్ణుడికి తన అవతారం చాలించాల్సిన సమయం దగ్గర పడిందని తెలిసింది. వెంటనే యాదవ ప్రముఖులందరినీ సమావేశపరిచి వారితో "పెద్దలారా ద్వారకానగరంలో కొద్దికాలంలోనే విపత్తులు ఏర్పడతాయి. మీరంతా ఇక్కడ వుండటం ఏమాత్రం క్షేమం కాదు. కనుక మీరంతా శంఖోద్ధారక్షేత్రానికి వెళ్ళండి. కేవలం పురుషులు మాత్రం ప్రభాసతీర్థానికి వెళ్ళండి. నేను కూడా మీతో వస్తాను. అందరం కలిసి సరస్వతీనది సముద్రంలో కలిసే చోట పుణ్యస్నానాలు చేసి, తర్పణాలు విడిచి, విప్రులకు దక్షిణలు

సమర్పించి రాబోయే విపత్తుల నుంచి కాపాడమని దేవతల్ని ప్రార్థిద్దాం” అన్నాడు. అందరూ సరేనని అంగీకరించి పెద్దలు తిరునాళ్ళకు వెళ్తున్నట్టుగా సంబరంగా బయలుదేరారు.

శ్రీకృష్ణుడు చెప్పిన విధంగా స్త్రీలు, పిల్లలు, వృద్ధులు శంఖోద్ధారక తీర్థానికి వెళ్ళి అక్కడ స్నానాలు పూజలు ముగించుకుని తిరిగి ద్వారకకు వెళ్ళిపోయారు. పురుషులందరూ ప్రభాస తీర్థానికి వెళ్ళి స్నానాలు, తర్పణాలు, పూజాది కార్యక్రమాలు నిర్వహించిన తరువాత విధి వక్రించి, వారంతా మితిమీరి మద్యపానం చేసారు. దానితో వారిలో విచక్షణాజ్ఞానం నశించింది. పరస్పరం ఒకరిని ఒకరు దూషించుకోసాగారు. నెమ్మదిగా వారి కలహం పెరిగి పెద్దదయింది. మాటామాటా అనుకుంటూ ఆయుధాలు తీసి ఒకరిని ఒకరు గాయపరుచుకోవటం ప్రారంభించారు.

అలా పోట్లాడుకుంటున్న వారిలో వృష్ణులు, భోజకులు, అంధకులు, సాత్వతులు వంటి వంశాలవారితోపాటు శ్రీకృష్ణుడి పుత్రులు కూడా వున్నారు. అలావారు చాలాకాలం కొట్లాడుకోవటంతో వారి చేతిలో వున్న ఆయుధాలన్నీ నాశనమైపోయాయి. అందరూ ఆవేశంగా అటూఇటూ చూసారు. వారికళ్ళకు అక్కడ ఏపుగా కత్తిమొనల్లా పెరిగిన రెల్లుగడ్డి కనిపించింది. అంతే ఆ రెల్లుని పీకి దానితో ఒకరినొకరు పొడుచుకోవటం ప్రారంభించారు. ఆ రెల్లు, పూర్వం మునిశాపం కారణంగా యాదవకులాన్ని నాశనం చేసే “ముసలం పొడి” ద్వారా పుట్టింది. అలా ఒకర్నొకరు అంతం చేసుకుంటుంటే చూసి సహించలేక బలరామకృష్ణులు వారిని వారించే ప్రయత్నం చేశారు. అయితే శాపప్రభావ కారణంగా వారెవ్వరూ బలరామకృష్ణుల్ని ఏమాత్రం లెక్కచేయకుండా పక్కకు నెట్టేసి వారిమీద కూడా దాడికి దిగారు. ఇలా యాదవవంశం వారంతా పరస్పరం కలహించుకుని చివరికి అందరూ అంతమైపోయారు.

జరిగిన విపరీతాన్ని చూసి ఎంతో బాధపడిన బలరాముడు సముద్రతీరాన కూర్చుని ఏకాంతంగా స్వస్వరూపాన్ని ధ్యానిస్తూ తన శరీరాన్ని విడిచిపెట్టి సంకర్షణమూర్తిలో లీనమైపోయాడు. బలరాముడు నిష్క్రమించటంతో భూమి

భారం తొలగిపోయింది. ఇక తన అవతారం కూడా చాలించాల్సిన సమయం ఇదేనని గ్రహించిన శ్రీకృష్ణుడు ఒక రావిచెట్టు దగ్గర కూర్చుని, వీపుని చెట్టుకి ఆన్చి తన ఎడమపాదాన్ని కుడి తొడమీద ఉంచుకుని, నాలుగు చేతులతో సూర్యుడిలా తేజస్సుని విరజిమ్ముతూ, మకర కుండలాలు, పట్టుపీతాంబరాలు, కౌస్తుభమణి, వైజయంతీ మాల ధరించి నిజస్వరూపంతో చిన్మయ దరహాసాలు చిందించసాగాడు. శంఖం, చక్రం, గద, పద్మం స్వామి చేతులలోకి వచ్చి చేరాయి. కృష్ణుడు తన కుడి తొడమీద ఉంచిన అందమైన పాదాన్ని నెమ్మదిగా కదిలిస్తు వున్నాడు.

పూర్వం మునిశాపం కారణంగా పుట్టిన ముసలం ఒక బోయవాడికి దొరికింది. వాడు దాన్ని బాగా అరగదీసి ఒక ములుకులా తయారుచేసి బాణానికి తొడిగాడు. ఆ బోయవాడు అడవిలో తిరుగుతుండగా దూరం నుంచి కదులుతున్న శ్రీకృష్ణుడి పాదం లేడిముఖంలా అతడికి కనిపించింది. వెంటనే ఆ బోయవాడు ముసలాన్ని ములుకుగా తగిలించి ఆ బాణాన్ని ప్రయోగించాడు. ఆ బాణం సూటిగా వచ్చి శ్రీకృష్ణుడి మీద కూడా పనిచేసింది. దగ్గరకి వచ్చి చూసిన బోయవాడు అక్కడ శ్రీకృష్ణుడి కాలిలో తానువేసిన బాణం గుచ్చుకోవటాన్ని చూసి బోరున విలపించాడు. తన తప్పును మన్నించమని వేడుకున్నాడు. కృష్ణుడు అతన్ని ఓదార్చి అదంతా దైవనిర్ణయం ఇందులో నీ తప్పేమీలేదని చెప్పి అతన్ని పంపేశాడు.

అంతలో శ్రీకృష్ణుడి రథసారధి దారుకుడు స్వామిని వెతుక్కుంటూ అక్కడికి వచ్చాడు. రథం దిగి శ్రీకృష్ణుని పరిస్థితిని చూసి చలించిపోయాడు. స్వామి పాదాలమీద పడి విలపించటం ప్రారంభించాడు. శ్రీకృష్ణుడు దారుకుణ్ణి ఓదార్చి "దారుకా! నీవు వెంటనే ద్వారకకు వెళ్ళి యాదవవంశంలోని పురుషులందరూ నశించిపోయారని, బలరాముడు కూడా శరీరత్యాగం చేసాడని, నేనుకూడా నిష్క్రమించానని, అతి త్వరలోనే ద్వారకాపట్టణాన్ని సముద్రం ముంచేస్తుందని చెప్పు, అలాగే అర్జునుడితో ద్వారకలో వున్న స్త్రీలను,

పిల్లల్ని, వృద్ధుల్ని సంరక్షించమని నా మాటగా చెప్పు. అందర్నీ ఇంద్రప్రస్థానానికి తీసుకువెళ్ళమను. దారుకా! నీవుకూడా నిశ్చలచిత్తంతో జరిగేదంతా నా సంకల్పంతోనే జరుగుతోందని గ్రహించి, నామీదే స్థిరంగా మనసునిల్పి, రాగద్వేషాలు తొలగించుకుంటే నన్ను చేరుకుంటావు" అని ప్రబోధించాడు. కృష్ణుడి మాటలు విన్న దారుకుడు బరువెక్కిన హృదయంతో ఆయన్ని విడిచి వెళ్ళలేక తప్పనిసరై ద్వారకకు పయనమయ్యాడు.

దారుకుడు వెళ్ళిపోగానే బ్రహ్మరుద్రాది దేవతలందరూ నింగి నుంచి పూలవాన కురిపించారు. ప్రజాపతులు, ఋషులు, మునులు, సిద్ధులు, గంధర్వులు కృష్ణుడి దగ్గరకి వచ్చారు. అందరూ సామూహికంగా ఆయన లీలల్ని గానం చేసారు. భక్తిగా స్తుతించారు. అందరినీ ఒక్కసారి ప్రేమపూర్వకంగా చూసి నెమ్మదిగా కళ్ళు మూసుకుని నిజ శరీరంతో అలాగే అంతర్ధానమై వైకుంఠానికి వెళ్ళిపోయాడు శ్రీకృష్ణుడు. స్వామి నిష్క్రమించగానే ఆయనతోపాటే ధర్మం, ధైర్యం, కీర్తి, సంపదలు కూడా అదృశ్యమైపోయాయి. కృష్ణుణ్ణి దర్శించటానికి వచ్చిన ఇంద్రాది దేవతలు కూడా క్రమంగా తమతమ నిజధామాలకు వెళ్ళిపోయారు.

శ్రీకృష్ణుడి దగ్గర నుంచి బయలుదేరిన దారుకుడు సరాసరి ద్వారకకు చేరి ఉగ్రసేనుడికి, వసుదేవుడికి శ్రీకృష్ణుడి సందేశాన్ని వినిపించాడు. అదివిని అందరూ శోకసముద్రంలో మునిగిపోయారు. ద్వారకలోని పెద్దలంతా ప్రభాస తీర్థానికి వెళ్ళి అక్కడ విగత జీవులైన తమతమ కుమారుల్ని చూసి విలపించారు. వసుదేవుడు రోహిణి, దేవకీదేవి శ్రీకృష్ణుడులేని తమ జీవితం వ్యర్థమని భావించి ప్రాణత్యాగం చేయగా, శ్రీకృష్ణ బలరాముల భార్యలు అగ్నిప్రవేశం చేసి తమతమ ప్రాణాలు విడిచారు. అలాగే యాదవపత్నులు కూడా తమ భర్తలతో సహగమనం చేసారు. అర్జునుడు ద్వారకకు వచ్చి గుండె దిటవు చేసుకుని మరణించిన వారందరికీ శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపించాడు.

తన గురువైన శ్రీకృష్ణుడు మహాభారత యుద్ధసమయంలో కురుక్షేత్రంలో తనకు చేసిన గీతోపదేశాన్ని గుర్తుతెచ్చుకుని, స్థిరచిత్తంతో శ్రీకృష్ణుడి ఆదేశం ప్రకారం ద్వారకలో వున్న వృద్ధుల్ని, పిల్లల్ని వెంటబెట్టుకుని ఇంద్రప్రస్థానానికి బయలుదేరాడు. అర్జునుడు అలా వెళ్ళగానే ఒక్కసారిగా సముద్రం ఉప్పొంగి ద్వారకా పట్టణాన్ని తనలో కలిపేసుకుంది. తరువాత కొంతకాలానికి పాండవులు తమ మనుమడైన పరీక్షిత్తుకు రాజ్యాన్ని అప్పగించి బదరికాశ్రమానికి చేరుకున్నారు. అక్కడ నుంచి వారు పైకి ప్రయాణిస్తూ క్రమంగా ఒక్కరొక్కరే ప్రాణాలు విడిచారు. చివరికి ధర్మరాజు ఒక్కడే సశరీరంగా స్వర్గాన్ని అధిరోహించాడు.

## కలియుగ ప్రభావం

**శు**కమహర్షి పరీక్షిన్మరాజుకు కలియుగంలో జరిగే పరిణామాలు ఏవిధంగా వుంటాయో ఇలా ప్రబోధించాడు. రాజా! కృతయుగంలో సత్యం, దయ, తపస్సు, దానం అనే నాలుగు పాదాలమీద ధర్మం నడిచేది. త్రేతాయుగంలో ఈ నాలుగు పాదాలలో ఒక పాదం తగ్గిపోయి పైవాటి స్థానంలో అనృతం, హింస, అసంతృప్తి, కలహం అనేవి చేరతాయి. ద్వాపరయుగంలో ధర్మం రెండుపాదాలు తగ్గిపోయి, వాటి స్థానంలో అనృతం, హింస, అసంతృప్తి, కలహం అనేవి సగానికి సగం వుంటాయి. ఇక కలియుగంలో ధర్మం కేవలం ఒక్కపాదం మీదే వుంటుంది. కనుక సత్యం, దయ, తపస్సు, దానం అనేవి ఒక్కభాగమే వుండి మిగిలిన మూడుభాగాలు అనృతం, హింస, అసంతృప్తి కలహం అనేవి వుంటాయి.

కలియుగంలో సద్గుణాలు చాలావరకు నశించిపోతాయి. దురాచారాలు, లోభాలు, నిర్దయ, పగ, ఆశ, అసూయ, ద్వేషం, మాత్సర్యం, బుద్ధిమాంద్యం, తిండిబోతుతనం, అతినిద్ర, భోగకాంక్ష, జారత్వం, కలహం, చోరబుద్ధి ప్రబలంగా వుంటాయి. పాలకులు ప్రజల్ని దారుణంగా పీడిస్తారు. బ్రాహ్మణులు జ్ఞానాన్ని కోల్పోయి, స్వధర్మాన్ని విడిచిపెట్టి కడుపుకూటి కోసం నీచమైన వృత్తులు

చేపడతారు. పాలివ్వని ఆవుల్ని కటికవాడికి అమ్మేస్తారు. సాధువులు, సన్న్యాసులు గ్రామాల్లోనే నివసిస్తారు. ధనం మీద అందరికీ ఆశ పెరుగుతుంది. స్త్రీలంతా అధిక సంతానాన్ని కంటారు. వారు విషయ సుఖాలమీద వ్యామోహాన్ని పెంచుకుని సిగ్గు లజ్జ విడిచి చేయరాని పనులు చేస్తారు. వర్తకులందరూ మోసం చేయటానికే అలవాటు పడతారు. పురుషులు కామానికి వశమైపోయి స్త్రీలకు లొంగిపోయి వుంటారు. అత్యాచారాలు చేస్తారు. దుర్మార్గులు సన్న్యాసుల వేషం ధరించి ప్రజల్ని మోసగిస్తారు. పురుషులు తమ తల్లిదండ్రుల్ని ఆదరించకుండా భార్యను వారి బంధువుల్ని ఆదరిస్తారు. ప్రతివ్యక్తీ స్వార్థంతో కేవలం తన సుఖం కోసమే పాకులాడుతుంటాడు. నాస్తికత్వం బాగా విజృంభిస్తుంది. అతివృష్టి, అనావృష్టి, దుర్భిక్షం, దరిద్రం, ఆకలిమంటలు ప్రజలకు తప్పవు.

ఈ కలియుగంలో తరించటానికి ఒకే ఒక్క మార్గం వుంది. అదే భగవంతుడి నామస్మరణ. నిత్యం పరమాత్మ దివ్యనామాన్ని శ్రద్ధగా పఠిస్తుంటే చాలు కలిదోషాలు సంపూర్ణంగా తొలగిపోతాయి. కృతయుగంలో ధ్యానసాధన ద్వారా, త్రేతాయుగంలో యజ్ఞయాగాల ద్వారా, ద్వాపరయుగంలో భగవంతుణ్ణి అర్చించటం ద్వారా లభించే ముక్తి కలియుగంలో కేవలం భగవన్నామస్మరణతోనే లభిస్తుంది.

## బ్రహ్మజ్ఞానం

**శు**కమహర్షి! పరీక్షన్మహారాజుకు బ్రహ్మజ్ఞానాన్ని గురించి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

1. ఓ పరీక్షిన్మహారాజా! శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణ పరమాత్మ తత్త్వం చాలా చక్కగా చెప్పబడింది. ఈ సకల జగత్తుకూ కారణం ఆయనే. బ్రహ్మరుద్రాదులు కూడా పరమాత్మ నుంచే ఆవిర్భవించారు.
2. జననమరణాలనేవి శరీరానికే గానీ ఆత్మస్వరూపుడవైన నీకు చావు పుట్టుకలనేవి వుండవు. నేను మరణిస్తున్నాను అనే భావన జంతువులకు వుండాలి కానీ, జ్ఞానవంతుడవైన నీకు వుండకూడదు.

3. కట్టె వేరు దానిలో వున్న అగ్నివేరు. అదేవిధంగా శరీరం వేరు అందులో వుండే ఆత్మవేరు అని తెలుసుకో.

4. స్వప్నంలో నీ తల నరకబడినట్టు చూస్తావు. అలాగే నీలో వున్న ఆత్మ నీ శరీరానికి కలిగే అనుభవాల్ని కేవలం ఒక సాక్షిగా మాత్రమే చూస్తుంది. స్వప్నంలో చంపబడ్డట్టు కనిపించిన నీ శరీరం మెలకువలోకి వచ్చాక చావనట్టే శరీరం అనేది నశించిపోయినా అందులో వున్న ఆత్మ మాత్రం చావదు.

5. కుండ విరిగిపోయినప్పుడు గదిలో గోడ కూలిపోయినప్పుడు కుండలో వున్న ఆకాశం (శూన్యం) గదిలో వున్న ఆకాశం (శూన్యం) నశించకుండా అంతా అనంతమైన ఆకాశంలో కలిసిపోయినట్టే, శరీరం పతనమైన తరువాత లోపల వున్న ఆత్మ నశించక అది అనంతాత్మలో కలిసిపోతుంది.

6. జీవులందరికీ తమ శరీరంలో ఇంద్రియాలతో సంపర్కం అనేది మనస్సు వల్ల కలుగుతుంది. ఈ మనస్సనేది మాయ వల్ల పుడుతుంది. ఆ మాయా ప్రభావంతోనే జీవుడు వేరొక దేహాన్ని ధరిస్తుంటాడు.

7. ప్రమిద, వత్తి, నూనె ఉన్నప్పటికీ అగ్ని లేకుండా జ్యోతి వెలగనట్టు ఆత్మ అనేది లేకపోతే ఇంద్రియాలు ఏవీ పనిచేయవు. అయితే ఇంద్రియాలు శరీరం లేకపోయినప్పటికీ ఆత్మ నిత్యమై సత్యమై వుంటుంది.

8. అగ్ని లేకుండా జ్వాల వుండదు. కానీ జ్వాల ఆరిపోయినా అగ్ని వున్నట్టు శరీరం నశించినా ఆత్మ వుంటుంది.

ఓ పరీక్షిన్మహారాజా ఈవిధంగా ఆత్మతత్వాన్ని తెలుసుకుని అనంతుడు, శాశ్వతుడు అయిన వాసుదేవుడి మీద పరిపూర్ణమైన భక్తివిశ్వాసాన్ని పెంపొందించుకో. బ్రాహ్మణ శాపం వల్ల తక్షకుడు వచ్చి నీ శరీరాన్ని కాటువేసి దహించగలడు గానీ, నిన్ను చంపలేడు. ఎందుకంటే? నీవు అన్నీ విడిచిపెట్టి బంధాల్ని తొలగించుకున్న ఈశ్వరుడివి కనుక నిన్ను ఏదీ చంపలేదు. అహంబ్రహ్మాస్మి నేనే పరబ్రహ్మను, నేనే ఆ పరంధాముడిని అని నీవు భావిస్తూ

ధ్యాననిమగ్నుడవై వుంటే ఆ తక్షకుడు నిన్ను కాటేసినా నీకా విషయం ఏమాత్రం తెలియదు. ఎందుకంటే? నీవా సమయంలో పరబ్రహ్మతో తాదాత్మ్యస్థితిలో వుంటావు కనుక.

ఈవిధంగా శుకమహర్షి పరీక్షిన్మహారాజుకి బ్రహ్మజ్ఞానాన్ని బోధించగా, పరీక్షిత్తు ఎంతో ఆనందించి "ఓ మహాత్మా! నేనెంతో ధన్యుడిని. నీ అనుగ్రహంతో పరంధాముడైన శ్రీమన్నారాయణుడి దివ్యతత్త్వాన్ని తెలుసుకున్నాను. ఇప్పుడు నా మనసు ఎంతో పవిత్రమైంది. నాకు చాలా ఆనందంగా వుంది. కోరికలన్నీ నశించాయి. ఈ శరీరం మీద భ్రాంతి తొలగిపోయింది. ఇక తక్షకుడే కాదు సాక్షాత్తు ఆ మృత్యుదేవతే నాకు ఎదురైనా నాకు భయంలేదు. మునీశ్వరా నాకు ఆ పరంధాముడి దివ్యపాదాల మీద మనసు లగ్నమయ్యేలా ఆశీర్వదించు. ఇదే నేను కోరేది' అని భక్తిగా ప్రార్థించాడు. శుకమహర్షి పరీక్షిత్తుని ఆశీర్వదించి తన స్థానానికి తిరిగి వెళ్ళిపోయాడు.

## పరీక్షిత్తుకు ముక్తి

**శు**కమహర్షి ద్వారా ఏడురోజుల్లో భాగవత తత్త్వాన్ని తెలుసుకుని పరిశుద్ధుడయ్యాడు పరీక్షిన్మహారాజు. ఇతర చింతలన్నీ వదిలేసి నిశ్చలమైన మనసుతో పరమాత్మ మీద దృష్టి నిలిపి ధ్యాన నిమగ్నుడయ్యాడు. క్రమంగా ప్రాణచలన లేకుండా మహాసమాధి స్థితిని పొందాడు. అదే సమయంలో తక్షకుడు హుటాహుటిగా పరీక్షిత్తుని కాటువేయాలని బయలుదేరి వస్తున్నాడు. దారిలో అతడికి మహామంత్రవేత్త అయిన ఒక బ్రాహ్మణుడు కనిపించాడు.

అతడు తక్షకుడి విషం బారినుంచి పరీక్షిత్తుని రక్షించి విలువైన కానుకల్ని పొందాలనే ఆశతో వున్నాడు. ఆ విషయాన్ని గ్రహించిన తక్షకుడు తానే ఎన్నో కానుకల్ని ఆ విప్రుడికిచ్చి అతన్ని వెనక్కి పంపేశాడు. ఆ విప్రుడి వేషాన్ని ధరించిన తక్షకుడు సరాసరి పరీక్షిత్తు దగ్గరకు వచ్చి అతన్ని కాటేశాడు. అప్పటికే పరీక్షిత్తు ముక్తి పొందే స్థితికి దగ్గరయ్యాడు. తక్షకుడి కాటుతో

ఆయన శరీరం భస్మమైపోయింది. పరీక్షిత్తు జీవాత్మ పరమాత్మలో ఐక్యమయ్యింది. ఆ సమయంలో దేవతలందరూ దుందుభులు మ్రోగించారు. అప్సరసలు నాట్యాలు చేసారు. గంధర్వులు మధురంగా పాటలు పాడారు.

## సర్పయాగం

కొంతకాలం తరువాత పరీక్షిత్తు మహారాజు కుమారుడు జనమేజయుడికి జరిగిన విషయమంతా తెలిసింది. తన తండ్రి మరణానికి కారణమైన తక్షకుణ్ణి సంహరించాలని మహాభయంకరమైన సర్పయాగాన్ని ప్రారంభించాడు. ఆ యాగంలో మహాసర్పాలన్నీ ఆహుతి కావాలని సంకల్పించాడు. అంతే ఒక్కొక్కటిగా సర్పాలన్నీ వచ్చి హోమగుండంలో పడి ఆహుతైపోతున్నాయి. తక్షకుడికి ఈ విషయం తెలిసి స్వర్గానికి పరుగెత్తాడు. అక్కడ ఇంద్రుణ్ణి శరణు వేడుకుని ఆయన సింహాసనానికి చుట్టుకున్నాడు. ఇక్కడ జనమేజయుడు ఆ విషయాన్ని గ్రహించి "సహేంద్రతక్ష కాయస్వాహా" అని ఆహుతి వేసాడు. వెంటనే ఇంద్రుడితో సహా తక్షకుడు హోమగుండంవైపు ఆకర్షితుడై వచ్చేస్తున్నాడు.

ఈ దృశ్యం దేవగురువైన బృహస్పతి కంటబడింది. ఆయన దివ్యదృష్టితో జనమేజయుడు చేస్తున్న సర్పయాగం గురించి తెలుసుకుని తక్షణమే బయలుదేరి యాగశాల దగ్గరకు వచ్చాడు. జనమేజయుడి దగ్గరకు వెళ్ళి ఆయన్ని శాంతపరిచి "రాజా! తక్షకుడు పూర్వం అమృతం తాగాడు కనుక అతడు మరణించడు. దయచేసి అతన్ని వదిలేయి. నీ తండ్రి మరణించటానికి తక్షకుడు కారణంకాదు. అతడు కేవలం నిమత్తమాత్రుడే. మానవులంతా ప్రారబ్ధ కర్మాధీనులు. వారు చేసుకున్న ప్రారబ్ధమే శత్రువుల, చోరుల, అగ్ని, నీరు, రోగం, దుర్ఘటనల రూపంలో వచ్చి వారి ప్రాణాల్ని తీస్తుంది. నీ తండ్రి దుర్మరణానికి కారణం ఆయన కర్మ ప్రారబ్ధమే. ఈ సర్పాలన్నీ ఏం నేరం చేసాయని వాటిని అగ్నికి ఆహుతి చేస్తున్నావు. ఇది ధర్మం కాదు. మహాపాపం. ఈ ప్రపంచమంతా విష్ణుమాయతో ఆవరించబడింది. ఉత్తమ గుణసంపన్నుడైన నీ తండ్రి అజ్ఞానంతో ఒక దుష్టుడిలాగా ఆలోచించి, క్షణికావేశంలో చచ్చిన పామును మహర్షి మెడలో వేయటమేమిటి? దానికి కారణం విష్ణుమాయే"

అని ప్రబోధించాడు. బృహస్పతి మాటలు విన్నాక జనమేజయుడుకి జ్ఞానోదయమైంది. వెంటనే సర్పయాగాన్ని ఆపేశాడు. హోమగుండం దాకా వచ్చిన తక్షకుడు ఇంద్రుడు ప్రాణాపాయం నుంచి బైటపడ్డారు.

## ఓంకారం

**పూ**ర్వం బ్రహ్మదేవుడు తీవ్రంగా ధ్యాన నిమగ్నుడై వున్నాడు. ఆ సమయంలో ఆయన హృదయం నుంచి ఒక అనాహత శబ్దం వినిపించింది. ఆ శబ్దం చెవులు మూసుకుని ధ్యానించేవారికి ఎవరికైనా వినిపిస్తుంది. యోగులైన వారందరూ ఆ దివ్యనాదం మీదే ధ్యాసను కేంద్రీకరించి బంధవిముక్తులై మోక్షాన్ని పొందుతారు. ఆ దివ్యనాదం నుంచే 'అ' కార 'ఉ' కార 'మ' కారాలతో కూడిన ఓంకార శబ్దం వెలువడింది. ఆ ఓంకారమే శబ్దరూపంలో వేదాలుగా వెలసింది. ఇదే అన్ని మంత్రాలకూ మూల బీజాక్షరం. ఈ ఓంకారం నుంచే బ్రహ్మదేవుడు 'అ' నుంచి 'హ' వరకు వున్న అక్షరాలను, వాటి నుంచి నాలుగువేదాలనూ వెలువరించాడు. ఓంకారంలో వుండే 'అ' కారం సత్త్వగుణానికి, 'ఉ' కారం రజోగుణానికి, 'మ' కారం తమోగుణానికీ ప్రతీక. అలాగే ఈ మూడు అక్షరాలు ఋక్, యజు, స్సామవేదాలని, భూః, భువః, సువః అనే మూడు లోకాలనీ, జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే మూడు అవస్థల్నీ సూచిస్తాయి.

## వేదాలు

**బ్ర**హ్మదేవుడు తన నాలుగు ముఖాల నుంచీ నాలుగువేదాల్ని సృష్టించాడు. అవి ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వవేదం. ఈ నాలుగింటినీ తన మానసపుత్రులైన మరీచ్యాది మహర్షులకు బోధించాడు. వారు దానిని తమ పుత్రులైన కశ్యపాది మహర్షులకు బోధించగా, అవి ఆనాటినుంచి గురుశిష్య పరంపరగా లోకంలో ప్రచారం పొందాయి. యజ్ఞయాగాది క్రతువుల్లో ఈ వేదాల్నీ ఋత్విక్కులు చదువుతారు. 1.అధ్వర్యుడు యజుర్వేదాన్ని, 2.ఉద్గాత సామవేదాన్ని 3.హోత ఋగ్వేదాన్ని చదువుతుంటే బ్రహ్మ అనే

ఋత్విజుడు యాగాన్ని నిర్వహిస్తాడు. ద్వాపరయుగంలో పరాశనికి సత్యవతికి పుత్రుడుగా జన్మించిన కృష్ణద్వైపాయనుడు (ఈయనే బాదరాయణుడు), అంతవరకు ఒకేరాశిగా వున్న వేదాల్ని స్పష్టంగా విభజించి వేదవ్యాసుడుగా కీర్తి పొందాడు. ఆయన నాలుగువేదాల్ని తమ శిష్యులకు బోధించాడు. పైలుడికి ఋగ్వేదాన్ని, జైమినికి సామవేదాన్ని, యాజ్ఞవల్క్యుడికి యజుర్వేదాన్ని, సుమంతుడికి అధర్వవేదాన్ని బోధించి వాటిని వ్యాప్తి చేయమన్నాడు. గురువు ఆదేశం ప్రకారం ఆ నలుగురూ తాము గ్రహించిన వేదాలను శిష్యపరంపరగా లోకంలో వ్యాపింప చేశారు.

తరువాత కొంతకాలానికి గురువుగారి ఆగ్రహానికి గురయ్యాడు యాజ్ఞవల్క్యుడు. ఆయన తన దగ్గర నేర్చుకున్న యజుర్వేదాన్ని కక్కేసి వెళ్ళిపోమని ఆజ్ఞాపించాడు. యాజ్ఞవల్క్యుడు గురువు ఆజ్ఞప్రకారం తాను నేర్చిన వేదాన్ని కక్కేశాడు. అంత విలువైన వేదం నేలపాలవ్వకూడదని భావించిన ఇతర శిష్యులు కొందరు తిత్తిరి పక్షులుగా మారి ఆ కక్కిన వేదాన్ని తినేశాయి. అలా వారు స్వీకరించిన వేదభాగానికి తైత్తిరీయ సంహిత అనే పేరు వచ్చింది. దాన్నే కృష్ణయజుర్వేదం అంటారు. యాజ్ఞవల్క్యుడు తిరిగి వేదజ్ఞానాన్ని పొందాలని భావించి సూర్యుణ్ణి గొప్పగా ఆరాధించాడు. ఆయన సంతోషించి ఒక అశ్వరూపంలో ఎవరికీ తెలియని మంత్రాలలో యాజ్ఞవల్క్యుడికి యజుర్వేదాన్ని అనుగ్రహించాడు. దానిని శుక్లయజుర్వేదం అంటారు.

## అష్టాదశ పురాణాలు

**వే**దవ్యాస మహర్షి వేదాల్ని విభజించిన తరువాత వేదధర్మాల్ని నిక్షిప్తం చేసి అష్టాదశ (18) పురాణాల్ని ఉపపురాణాలను రచించాడు. వాటిని ఆయన రోమహర్షణుడికి అప్పగించగా, రోమహర్షణుడు ఆ పురాణ సంహితల్ని త్రయ్యారుణి, కశ్యప, సావర్ణి వంటి ఆరుగురు శిష్యులచేత అధ్యయనం చేయించాడు. తరువాత సూతుడు, సావర్ణి, అకృతవర్ణుడూ కలిసి వ్యాసుడి కుమారుడైన శుకమహర్షి ద్వారా నాలుగు పురాణ సంహితల్ని అధ్యయనం చేసారు.

ఈ అష్టాదశ మహాపురాణాలలో సృష్టి, స్థితి, ప్రళయం, పోషణ, మన్వంతరాలు, వంశాలు, రాజులచరిత్రలు, మోక్ష సాధనాలు వంటి విషయాలు వివరించబడ్డాయి. ఈ పురాణాలలో శ్లోకాల సంఖ్య ఈ విధంగా వుంటుంది. 1.బ్రహ్మపురాణం (10వేల శ్లోకాలు) 2.పద్మపురాణం (55వేల శ్లోకాలు) 3.విష్ణుపురాణం (23వేల శ్లోకాలు) 4.శివపురాణం (34వేల శ్లోకాలు) 5.భాగవత పురాణం (18వేల శ్లోకాలు) 6.నారదపురాణం (25వేల శ్లోకాలు) 7.మార్కండేయ పురాణం (9వేల శ్లోకాలు) 8.అగ్నిపురాణం (15వేల నాలుగువందల శ్లోకాలు) 9.బ్రహ్మవైవర్త మహాపురాణం (18వేల శ్లోకాలు) 10.భవిష్యపురాణం (14వేల ఐదువందల శ్లోకాలు) 11.లింగపురాణం (11వేల శ్లోకాలు) 12.వరహపురాణం (24వేల శ్లోకాలు) 13.వామనపురాణం (10వేల శ్లోకాలు) 14.కూర్మపురాణం (17వేల శ్లోకాలు) 15.మత్స్యపురాణం (14వేల శ్లోకాలు) 16.గరుడపురాణం (19వేల శ్లోకాలు) 17.బ్రహ్మాండపురాణం (12వేల శ్లోకలు) 18.స్కందపురాణం (81వేలవంద శ్లోకాలు) ఇలా మొత్తం అన్ని పురాణాలలో కలిపి నాలుగులక్షల శ్లోకాలు వున్నాయి.

## భగవంతుడి తత్త్వం

శౌనకాది మహర్షులు 'ఓ సూతమహాశయా!' భగవంతుడి తత్త్వాన్ని గురించి, అతడి విశ్వరూపాన్ని గురించి మాకు తెలియచేయి అని కోరగా సూతుడు ఇలా చెప్పడం ప్రారంభించాడు.

"ఈ బ్రహ్మాండము, భగవన్మాయ క్రియారూపమైన ప్రకృతి వికారం (మార్పులతో ఏర్పడిన ఆకారం). ఈ బ్రహ్మాండం, మహత్తత్త్వం, అహంతత్త్వం, పంచభూతాలు, కాలం, వికారాలు అనే వాటితో ఏర్పడింది. (వికారాలు= దశేంద్రియాలు, మనస్సు, పంచతన్మాత్రలు)

ఇదే భగవంతుడైన నారాయణుడి విరాట్ స్వరూపం, దివ్యరూపం. ఈ విరాట్ పురుషుడి పాదాలు-భూమి, శిరస్సు-అంతరిక్షం, నాభి-ఆకాశం,

నేత్రాలు–సూర్యుడు, నాసిక–వాయువు, బాహువులు–దిక్కులు, జననేంద్రియ – ప్రజాపతి, అపానం– మృత్యువు, భుజాలు–లోకపాలురు, మనస్సు–చంద్రుడు, రోమాలు–వృక్షాలు, సమస్త జీవరాసుల చైతన్యమే కౌస్తుభమణిగా ప్రకాశిస్తోంది. శ్రీవత్సచిహ్నమే–సమిష్టి జ్ఞానం. వనమాలయే–గుణాలతో కూడిన మాయ, ఆయన పట్టు పీతాంబరాలు–గాయత్రీ ఛందస్సు, వేదాలు ఆయన బ్రహ్మసూత్రం (జంధ్యం) – అకార ఉకార మకారాలతో కూడిన ఓంకారం.

ఆయన యొక్క మకరకుండలాలు – సాంఖ్యం, యోగం. ఆయన కిరీటం–బ్రహ్మలోకం, ఆయన యొక్క ఆసనమే(అనంతుడు)– మూలప్రకృతి, ధర్మం, జ్ఞానం, ఐశ్వర్యం, యశస్సు, శ్రీ, వైరాగ్యం అనే ఆరు దివ్యగుణాలూ, విమల, ఉత్కర్షిణి, జ్ఞాన, క్రియా, యోగ, ప్రాహ్వి, సత్స, ఈశాన, అనుగ్రహ అనే తొమ్మిది దివ్యశక్తులూ కలిసిన శుద్ధ సత్త్వమే ఆయన ఆసీనుడైయుండే పద్మం.

ఓజస్సు (ఇంద్రియశక్తి), సహస్సు (మనశ్శక్తి), ప్రాణశక్తులతో కూడిన శక్తి ఆయన యొక్క కౌమోదకీ గద. జలతత్త్వమే శంఖం. తేజస్తత్త్వమే సుదర్శన చక్రం, ఆకాశతత్త్వమే ఖడ్గంగా భాసిస్తుంటాయి. ఆయన యొక్క దేహవర్ణం–నీలం, డాలు–తమస్సు, ధనుస్సు–కాలం, అమ్ములపొది–కర్మరాశి, బాణాలు– ఇంద్రియాలు, రథం–సంకల్పం, రథం యొక్క అంలకరణలు–పంచతన్మాత్రలు. భగవంతుడు అనే పేరుకి అర్థం – జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులనబడే షడైశ్వర్యాలున్న వాడు అని భావం. భగవంతుని చేతిలోని పద్మం, ఈ ఆరు లక్షణాలకు ప్రతీకం, వైకుంఠం, ఆయన నివాస స్థానం. గరుడుడు, ఋక్యజుఃసామాలు, లక్ష్మీదేవి, భాస్కరుని ఎప్పుడూ విడిచి వుండని తేజస్సులాగ భగవంతుణ్ణి ఎల్లప్పుడూ అంటి పెట్టుకొని యుండే శక్తి. నందాదులైన అష్టపార్షదులు–అణిమాది అష్టసిద్ధులు. సేనానియైన విష్వక్సేనుడు–తంత్రం. నారాయణుడే–వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న,

అనిరుద్ధులనబడే నాలుగు మూర్తులుగా వ్యక్తమౌతాడు. భగవంతుడే జాగ్రత్ స్వప్న సుషుప్తి, ముక్త, అవస్థలలో, విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, తురీయుడు అనబడతాడు.

జాగ్రదవస్థాభిమాని అయిన వైశ్వానరుడే అనిరుద్ధుడు. స్వప్నావస్థాభిమాని అయిన తైజసుడే సంకర్షణుడు, సుషుప్తి అవస్థాభిమాని అయిన ప్రాజ్ఞుడే ప్రద్యుమ్నుడు, ముక్తావస్థాభిమాని అయిన తురీయుడే వాసుదేవుడు. భగవంతుడి అనిరుద్ధశక్తి సృష్టిస్తుంది. ప్రద్యుమ్నశక్తి పాలిస్తుంది. సంకర్షణశక్తి సంహరిస్తుంది, వాసుదేవశక్తి ముక్తినిస్తుంది. భగవంతుడే బ్రహ్మలో అంతర్యామిగా వుండి సృష్టినీ, రుద్రుడిలో అంతర్యామిగా ఉండి సంహారం చేస్తూ, తానే స్వయంగా రక్షణ పోషణ చేస్తాడు.

సర్వస్వానికీ ఆ భగవంతుడే కారణమైనవాడు, సర్వసాక్షి, స్వయంప్రకాశుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, పరిశుద్ధాంతరాత్ములైన యోగులకు, భక్తులకు తప్ప, ఇంకెవ్వరి దేహేంద్రియ మనోబుద్ధులకును గోచరించనివాడు. ఆనందానికి నిధి. అందరినీ ఆనందింపజేసేవాడు.

పై తెలిపిన లక్షణాలన్నీ ఉన్న శ్రీకృష్ణుడే భగవంతుడు. పరబ్రహ్మ. అతడి నామాన్ని, సత్కీర్తిని, గాథల్ని, వినటం చేతనే సకలపాప పరిహారాలూ, సకల మంగళాలూ, సకల పుణ్యఫలాలూ కలుగుతాయి అని సూతుడు భగవంతుడు అయిన శ్రీకృష్ణుడి పరబ్రహ్మతత్త్వాన్ని వారికి బోధించాడు.

## సౌరవ్యూహం

**సూ**తమహర్షి శౌనకాది మునులకు శ్రీ మహావిష్ణువు సూర్యుడి రూపంలో నెలకొక్క పేరుతో ఉపాసించబడే సూర్య వ్యూహాన్ని గురించి ఈ విధంగా చెప్పటం ప్రారంభించాడు.

పూర్వం అవిద్య అయిన విష్ణుమాయతో సృష్టించబడ్డ సూర్యుడు ఆ విష్ణువు తేజస్సుతోనే బలవంతుడై లోకాలన్నిటినీ ఉత్తేజపరిచి

పరిభ్రమిస్తున్నాడు. కాలవిభజనకు, సమస్త వైదికకర్మలకు సూర్యుడి రూపంలో వున్న శ్రీమహావిష్ణువే ఆధారభూతుడు. ఆ సూర్యుడే 1.కాలం 2.దేశం 3.క్రియ 4.సాధనం 5.యజమానుడు 6.అపూర్వం 7.ఆగమం 8.ద్రవ్యం 9.ఫలం అని తొమ్మిదివిధాలుగా ప్రవర్తిస్తూ, పన్నెండు మాసాలలో పన్నెండు గణాలతో కలిసి సంచరిస్తుంటాడు. ఈ పన్నెండు గణాలలో ప్రతి గణంలో ఒక్కొక్క ఋషి, గంధర్వుడు, అప్సరస, నాధుడు, యక్షుడు, రాక్షసుడు అనే ఆరుగురు వుంటూ సూర్యుడితో పాటు సంచరిస్తుంటారు.

**ప్రతిమాసం మారుతూ వుండే సౌరగణ సప్తకం**

1. **చైత్రమాసంలో సూర్యుడి పేరు ధాత.** అప్సరస-కృతస్థలి, రాక్షసుడు-హేతి, నాగుడు-వాసుకి, యక్షుడు-రథకృత్తు, ఋషి-పులస్త్యుడు, గంధర్వుడు- తుంబురుడు.
2. **వైశాఖమాసంలో సూర్యుడి పేరు అర్యముడు.** అప్సరస-పుంజికస్థలి, రాక్షసుడు-ప్రహేతి, నాగుడు-కచ్ఛనీర, యక్షుడు-అథౌజ, ఋషి-పులహుడు, గంధర్వుడు-నారదుడు.
3. **జ్యేష్ఠమాసంలో సూర్యుడి పేరు మిత్రుడు.** అప్సరస-మేనక, రాక్షసుడు-పరుషేయుడు, నాగుడు-తక్షకుడు, యక్షుడు-రథస్వన, ఋషి-అత్రి, గంధర్వుడు-హాహా.
4. **ఆషాఢమాసంలో సూర్యుడి పేరు వరుణుడు.** అప్సరస-రంభ, రాక్షసుడు-చిత్రస్వనుడు, నాగుడు-శుక్ర, యక్షుడు-సహజన్య, ఋషి-వసిష్ఠుడు, గంధర్వుడు-హూ హూ.
5. **శ్రావణమాసంలో సూర్యుడి పేరు ఇంద్రుడు.** అప్సరస-ప్రమ్లోచన, రాక్షసుడు-వర్యుడు, నాగుడు-ఏలాపుత్ర, యక్షుడు-శ్రోత, ఋషి-అంగిరస, గంధర్వుడు-విశ్వావసువు.
6. **భాద్రపదమాసంలో సూర్యుడి పేరు వివస్వంతుడు.** అప్సరస-అనుంలోచ, రాక్షసుడు-వ్యాఘ్రు, నాగుడు-శంఖపాల, యక్షుడు-అసారణ, ఋషి-భృగు, గంధర్వుడు-ఉగ్రసేన.

7. **ఆశ్వయుజమాసంలో సూర్యుడి పేరు త్వష్ట.** అప్సరస–తిలోత్తమ, రాక్షసుడు–బ్రహ్మాపేత, నాగుడు–కంబల, యక్షుడు–శతజిత్, ఋషి–జమదగ్ని, గంధర్వుడు–ధృతరాష్ట్ర.

8. **కార్తీకమాసంలో సూర్యుడి పేరు విష్ణు.** అప్సరస–రంభ, రాక్షసుడు–మఖాపేత, నాగుడు–అశ్వతార, యక్షుడు–సత్యజిత్, ఋషి–విశ్వామిత్ర, గంధర్వుడు–సూర్యవర్చ.

9. **మార్గశిరమాసంలో సూర్యుడి పేరు అంశుడు.** అప్సరస–ఊర్వశి, రాక్షసుడు–విద్యుచ్చక్ర, నాగుడు–మహాశంఖ, యక్షుడు–తార్క్ష్య, ఋషి–కశ్యప, గంధర్వుడు–ఋతుసేన.

10. **పుష్యమాసంలో సూర్యుడి పేరు భగుడు.** అప్సరస–పూర్వచిత్తి, రాక్షసుడు–స్ఫూర్జ, నాగుడు–కర్కోటకుడు, యక్షుడు–ఊర్ణ, ఋషి–ఆయువు, గంధర్వుడు–అరిష్టనేమి.

11. **మాఘమాసంలో సూర్యుడి పేరు పూషుడు.** అప్సరస–ఘృతాచి, రాక్షసుడు–వాత, నాగుడు–ధనంజయ, యక్షుడు–సురుచి, ఋషి–గౌతమ, గంధర్వుడు–సుషేణ.

12. **ఫాల్గుణమాసంలో సూర్యుడి పేరు పర్జన్య.** అప్సరస–సేనజిత్తు, రాక్షసుడు–వర్చ, నాగుడు – ఐరావత, యక్షుడు – క్రతు, ఋషి – భరద్వాజ, గంధర్వుడు–విశ్వ.

ఈ విధంగా శ్రీ మహావిష్ణువే సూర్యుడి రూపంలో ప్రతిరోజూ అన్నిలోకాలకూ దర్శనమిస్తుంటాడు. సూర్యభగవానుడి దివ్యలీలల్ని ప్రతిరోజూ రెండు సంధ్యలలో స్మరించేవారికి పాపాలు దరిచేరవు. సౌరగణ సప్తకంలో వున్న ఋషులు నిత్యం సూర్యభగవానుణ్ణి ఋక్‌యజుస్సామాలతో స్తుతిస్తుంటారు. గంధర్వులు తమ గాన సంకీర్తనలతో, అప్సరసలు తమ అద్భుత నృత్యాలతో ఆయన్ని ఆనందింపచేస్తారు. నాగులు సూర్యుడి రథాన్ని

సడలిపోకుండా గట్టిగా బంధించి ఉంటారు. యక్షులు రథాన్ని పూన్చి బయలుదేరటానికి సిద్ధంచేసి ఉంచుతారు. రాక్షసులు సూర్యరథాన్ని వెనుకనుంచి నెడుతుంటారు. వాలఖిల్యులు అనే అరవైవేల మంది బ్రహ్మజ్ఞానులైన మహర్షులు సూర్యభగవానుణ్ణి స్తుతిస్తూ ఆయనతోపాటే ముందుకు సాగిపోతారు.

ఈవిధంగా ఆద్యంతాలు లేని విష్ణుపరమాత్మ సూర్యుడి రూపంలో ప్రతిరోజూ లోకాలన్నిటినీ అనుగ్రహిస్తూ కాపాడుతుంటాడు.

## భాగవత ధర్మం

**ప**రమ పవిత్రమైన ఈ దివ్యభాగవతాన్ని పరమాత్మ బ్రహ్మదేవుడికి కేవలం నాలుగుశ్లోకాల్లో చెప్పాడు. సకల వేదాంతసారమైన పరబ్రహ్మ స్వరూపం ఈ పురాణంలో చెప్పబడింది. భగవంతుడి కన్నా గొప్పవారు ఎవరూ లేరు. కనుక ఆయనే పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మ ఈ చరాచర జగత్తంతా వ్యాపించి వుంటాడు గనుక ఆయనే పరమాత్మ. ఈ రెండు దివ్యలక్షణాలు మరెవ్వరిలో ఉండవు కనుక ఆయన అద్వితీయుడు. అలాంటి అద్వితీయుడైన పరమాత్మను పరబ్రహ్మను ఆరాధించి ముక్తిని పొందటమే భాగవత ధర్మం.

## భాగవత మహిమ

**శ్రీ**కృష్ణభగవానుడు బ్రహ్మదేవుడికి భాగవత మహిమను ఇలా వివరించి చెప్పాడు.

1. శ్రీమద్భాగవతం నామపురాణం లోక విశ్రుతమ్ ।
   శృణుయా చ్ఛ్రద్ధయా యుక్తో మమసంతోష కారణమ్ ॥
2. నిత్యం భాగవతం యస్తు పురాణం పఠతేనరః ।
   ప్రత్యక్షరం భవత్తేస్య కపిలాదానజం ఫలమ్ ॥
3. శ్లోకార్థం శ్లోక పాదంవా నిత్యం భాగవతోద్భవమ్ ।
   పఠతే శృణుయాద్ యస్తు గోసహస్రఫలం లభేత్ ॥
4. యః పఠేత్ ప్రయతో నిత్యం శ్లోకం భాగవతం సుతః ।
   అష్టాదశ పురాణానాం ఫలమాప్నోతి మానవః ॥

5. నిత్యం మమ కథాయత్ర తత్ర తిష్ఠతి వైష్ణవాః ।
కలిబాహ్యా నరాస్తేవై యే౽ర్చయంతి సదామమ ॥

శ్రీమద్భాగవతపురాణం అనే పేరుతో లోకంలో ప్రసిద్ధి చెందిన ఈ పురాణాన్ని నిత్యం శ్రద్ధతో శ్రవణం చేస్తే నేనెంతో సంతోషిస్తాను. ఎవరైతే ప్రతిరోజూ భాగవత పురాణాన్ని పఠిస్తాడో అందులో అతడు ఉచ్చరించిన ఒక్కో అక్షరానికి, ఒక్కో కపిలగోవుని దానం చేసిన ఫలం అతడికి లభిస్తుంది. భాగవతంలోని అర్థశ్లోకాన్నిగానీ కనీసం పావుశ్లోకాన్నిగానీ శ్రవణం చేసినా చాలు వాడికి వెయ్యి ఆవుల్ని దానం చేసిన ఫలితం లభిస్తుంది.

పవిత్రమైన మనసుతో ప్రతిరోజూ భాగవతంలోని ఒక్క శ్లోకాన్ని పఠించినా అతడికి పద్దెనిమిది పురాణాలు పఠించినంత పుణ్యం కలుగుతుంది. ఎక్కడ ప్రతిరోజూ నా దివ్యకథలు వినబడుతుంటాయో ఎవరు భాగవత పురాణాన్ని పూజిస్తూ వుంటారో వారు కలిప్రభావానికి గురికారు. ఎవరు తమ ఇంట్లో భాగవతపురాణాన్ని శ్రద్ధగా పూజిస్తారో వారు అన్ని పాపాలనుంచీ విముక్తి పొందుతారు. దేవతలతో సైతం నమస్కరించబడతారు.

**యచ్ఛన్తి వైష్ణవే భక్త్యా శాస్త్రం భాగవతం హియే ।**
**కల్పకోటి సహస్రాణి మమలోకే వసంతితే ॥**

ఎవరైతే నా భక్తులకు భాగవతపురాణాన్ని భక్తిపూర్వకంగా సమర్పిస్తారో వారు వేలకోట్ల కల్పాల వరకూ నా దివ్య వైకుంఠధామంలో నివసిస్తారు. కీర్తి, ధర్మం, విజయం, పాపక్షయం కావాలనుకునేవారు నా దివ్యకథలతో కూడిన భాగవత పురాణాన్ని శ్రవణం చేయాలి.

**శ్రీమద్భాగవతం పుణ్యమాయురారోగ్య పుష్టిదమ్ ।**
**పఠనాచ్ఛ్రవణాద్ వాపి సర్వపాపైః ప్రముచ్యతే ॥**
**శ్లోకం భాగవతం చాపి శ్లోకార్థం పాదమేవవా ।**
**లిఖితం తిష్ఠతే యస్య గృహేతస్య వసామ్యహమ్ ॥**

పవిత్రమైన ఈ భాగవతం ఆయుర్దాయాన్ని, ఆరోగ్యాన్ని, పుష్టిని ప్రసాదిస్తుంది. దీన్ని పఠించినా, శ్రవణం చేసినా అన్ని పాపాల నుంచీ విముక్తులౌతారు. ఎవరి ఇంట్లో భాగవతానికి సంబంధించిన ఒక శ్లోకం కానీ అర్ధశ్లోకం కానీ వ్రాయబడుతుందో అతడి ఇంట్లోనే నేను ఎప్పుడూ నివసిస్తాను.

ఓ బ్రహ్మదేవా నా దివ్యకథల్ని చెప్పేవాడిని, వాటిని వినాలనే ఆసక్తి వున్నవాడిని, విని ఆనందాన్ని పొందేవాడిని నేనెప్పుడూ విడిచిపెట్టను.

## శ్రీకృష్ణస్తుతి

శ్రీ సచ్చిదానంద ఘనస్వరూపిణే
కృష్ణాయ చానంత సుఖాభివర్షిణే
విశ్వోద్భవస్థాన నిరోధహేతవే
నుమోవయం భక్తిరసాప్తయేఽనిశమ్

## శ్రీ శుకస్తుతి

యం ప్రవజన్త మనుపేత మపేతకృత్యం
ద్వైపాయనో విరహకాతర ఆజుహావ ।
పుత్రేతి తన్మయతయా తరవోఽభినేదు
స్తం సర్వభూత హృదయం మునిమానతోఽస్మి ॥



కృష్ణం వందే జగద్గురుమ్

# శ్రీ కృష్ణాష్టకమ్

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 1

అతసీపుష్పసంకాశం, హారనూపురశోభితమ్ ।
రత్నకంకణకేయూరం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 2

కుటిలాలకసంయుక్తం, పూర్ణచంద్రనిభాననమ్ ।
విలసత్కుండలధరం, దేవం కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 3

మందారగంధసంయుక్తం, చారుహాసం చతుర్భుజం ।
బర్హిపింఛాంగ చూడాంగం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 4

ఉత్ఫుల్లపద్మపత్రాక్షం, నీలజీమూత సన్నిభమ్ ।
యాదవానాం శిరోరత్నం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 5

రుక్మిణీకేళిసంయుక్తం, పీతాంబరసుశోభితమ్ ।
అవాప్తతులసీగంధం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 6

గోపికానాం కుచద్వంద్వ కుంకుమాంకిత వక్షసమ్ ।
శ్రీనికేతం మహేష్వాసం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 7

శ్రీ వత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితమ్ ।
శంఖచక్రధరం దేవం, కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 8

కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్
కోటిజన్మకృతం పాపం, స్మరణేన వినశ్యతి

ఇతి శ్రీ కృష్ణాష్టకం సంపూర్ణమ్



